# రైతుబిడ్డలు

సాంఘిక నాటకం





కొడాలి గోపాలరావు

# రైతుబిడ్డలు

(సాంఘికనాటకం)



రచన

**కొడాలి గోపాలరావు**



క్రాంతి పబ్లికేషన్సు, తెనాలి.

ద్వితీయ ముద్రణ - ౨౦౦౦

ముద్రణ:-సాయి ప్రింటర్స్,:- తెనాలి.

1954-మే

మూల్యం 1-0-0



శ్రీ కొడాలి గోపాలరావు

పెదరావూరు P.O.

తెనాలి తాలూకా, (గుంటూరు జిల్లా.)

# అంకితం

నిండు హృదయంతో

ప్రియమైన

నాన్న

గారికి

అంకితం

కొడాలి గోపాలరావు.

# పరిచయం

శ్రీ కొండాలి గోపాలరావుగారు వ్రాసిన రైతుబిడ్డలు నాటకం చూస్తుంటే, నిజంగా ఒక రైతుకుటుంబం రంగంమీదికొచ్చి తమ కష్టసుఖాలు వెళ్లబోసుకుంటున్నట్లుగా వుంటుంది చిన్నకొడుకు రంగారావు కథానాయకుడులాగా కథ చుట్టూ తిరిగి వచ్చినప్పటికి యిందులో ఆకుటుంబమంతా కథానాయికత్వం వహిస్తుంది. అందువల్లనే యీ నాటకానికి "రైతుబిడ్డలు" అని నామకరణం.

భూస్వామిబుద్ధి మాంద్యంలాగే కామయ్య అవ్యాజవ్యాసాంగానికి కారణం లేకపోయినా కామయ్య. భీమన్నల పాత్ర కల్పన నాటకానికి జీవం పోసిందని చెప్పాలి.

రంగారావు చంద్రం. కామయ్య రాఘవయ్య జగన్నాధరావు నరసయ్య పరస్పర విరుద్ధ స్వాభావాలుగల పాత్రలు. వీరి మధ్యనున్న వైత్యాసాల తాలూకు సంఘర్షనే కథావస్తు. శ్యామల కేవలం బలిజంతువు. బుద్ధిమంతులైన ప్రేక్షకులు మాదిరిగానే సుశీలసత్యంలు సాక్షిమాత్రులు. గ్రంథకర్త స్థూలంగా గ్రామీణ జీవిత వాస్తవికతను, మెలికించ చూచాడనటంలో అతిశయోక్తిలేదు. పల్లెపట్టుమీద అనేకనాటకాలు వెలువడిన నేడుకూడా యిందులో వకనిజాయితీ ఒక క్రొత్తదనం విస్పష్టంగా కనిపిస్తాయి.

ప్రయాగ **17-3-54**

# తలవని తలంపు

ఈ నవ్య వసంతంలో ప్రపంచం నాలుగు చెరుగులా కోటానకోట్ల శ్రామికప్రజలు. రక్తాక్షర లిఖితమైన "మే" పర్వదినాన్ని జరుపుకొంటున్నారు. రక్తాశ్రువుల్ని చిందించి. ఆత్మార్పణగావించి, విప్లవకేతనాన్ని ఎగురవేసిన ఈ పర్వదినం నాడు "క్రాంతి పబ్లిషింగ్ కంపెనీని" స్థాపించటం. దానిద్వారా ఈ "మే" ఒకటిని "రైతుబిడ్డలు" ద్వితీయముద్రణ ప్రారంభించడం జరిగింది. క్రాంతి పబ్లిషరుగారైన శ్రీ నారిశెట్టి ఉమామహేశ్వరరావుగారు ఈ నాటకాన్ని యింతత్వరలో వెలుగులోకి తీసుకువచ్చినందులకు వారికి నా ధన్యవాదాలు. సాహిత్యసేవకై వీరు చేయనున్న ఈకర్తవ్య నిర్వహణలో ఆంధ్రప్రజల ఆదరాభిమానాలు లభించగలవనటంలో సందేహంలేదు.

ఈ నాటకానికి ముఖచిత్రం వ్రాసిన శ్రీ గోలి శేషయ్య గారికి పరిచితిని వ్రాసి యిచ్చిన ప్రాయాగ,,కు. ముద్రణ విషయంలో తోడ్పడిన శ్రీ సాయిప్రింటర్సు వారికి నా అభివందనములు. ఈ నాటకము ప్రదర్శించు సమాజాలవారు ప్రదర్శనలో కలిగిన అనుభూతుల్ని అందచేయగలరని ఆశిస్తూ

అభివందనములతో

కొడాలి గోపాలరావు

## ఇందులో.....

| | | |
|---|---|---|
| నరసయ్య | — | మధ్యరకం రైతు |
| చంద్రం<br>రంగారావు | — | నరసయ్య కొడుకులు |
| సత్యం | — | నరసయ్య అల్లుడు |
| రాఘవయ్య | — | నరసయ్య బంధువు |
| కోటిగాడు | — | నరసయ్య నౌకరు |
| జగన్నాథరావు | — | భూస్వామి |
| కామయ్య | — | చెట్టుక్రింద ప్లీడరు |
| భీముడు | — | రౌడి |

## స్త్రీలు

| | | |
|---|---|---|
| సుశీల | — | నరసయ్య కుమార్తె |
| శ్యామల | — | జగన్నాథరావు కుమార్తె |

స్థలం — ఒక పల్లెటూరు
కాలం — వర్తమానం

# రైతు బిడ్డలు

## -: ఒకటవ రంగం :-

(తెర)

[అది నరసయ్యగారి యిల్లు. యింటిముందు వసారా. వసారాలో రెండు మంచాలు. ఒక ముక్కాలపీట. దక్షిణపువైపుగోడ ప్రక్కన గడంచి. దానిమీద నాలుగు వడ్లబస్తాలు. ఉత్తరపువైపు గోడమూల వ్యవసాయపనిముట్లూ, గోడలకు అక్కడక్కడా దేవతల ఫోటోలుంటాయి. నరసయ్య చిన్నకొడుకు రంగారావు బయటనుండి వస్తాడు. వయస్సు 28 సంవత్సరాలు. సామాన్యమైన గుడ్డలు, వస్తూనే]

రంగా:- అమ్మాయ్...సుశీ...

సుశీ:- (వస్తూనే) దేనికన్నయ్యా? (వయస్సు 16 సంవత్సరాలుంటాయి. అంతా రంగారావు పోలికే. సామాన్యమైన గుడ్డలే అయిన అవి కాస్త కొత్తగావుంటయి.)

రంగా:- తిండి పెట్టేదేమన్నావుందా?

సుశీ:- (ముఖం చిన్నబుచ్చుకొని) యిప్పుడు పెట్టనన్నదెవరు? గడపలో కాలుపెట్టావో లేదో అప్పుడే తగాదా?

రంగా:- నోరుమూసుకొని పదా. నా కవతల పనుంది.

సుశీ:- వీధులెంట తిరిగే పనేనా?

రంగా:- (ఎగతాళిగా) కాదు. విస్తరాకు లెత్తేపని.

సుశీ:- (బాధగా, అందుకు పనికిరావాలిసిందే మనం. ఒక పనా, పాటా? యదాస్తమానం దిక్కుమాలిన తిరుగుడేకదా? పొలంపని ముట్టేదిలేదుగదా! పోనీ యింటిదగ్గర గొడ్డూ గోదనన్నా మేపుతావాలంటే అది అసలేలేదు.

రంగా:– అయిందా వుపన్యాసం?

సుశీ:– నలుగురూ నిన్నుగురించి ఏమనుకుంటున్నారో నువ్వు వింటున్నావా అన్నయ్యా? నువ్వు యిలా తిరిగితే నీకు పిల్ల నెట్లా యిస్తారు? పెళ్ళెట్లావుతుంది?

రంగా:– (హేళనగా) నీకైందిగా! చాల్లే! సంతోషించు.

సుశీ:– (కోపముతో) నువ్వు యిలా తిరిగి యేమైపోదామని.

రంగా:– (పరిహాసంగా) మనిషినైపోదామని.

సుశీ:– (చికాగ్గా) మామాట నువ్వెందుకింటావులే. నాన్న నీకోసం (మధ్యలో)

రంగా:– (నవ్వుతూ) చచ్చేటట్లుగాతిని, నిశ్చింతంగా నిద్ర పోతున్నాడుకదూ?

సుశీ:– అనయ్యా (కోపముతో) నీకు చిన్నా పెద్దా లేకుండా పోతుంది మరీను.

రంగా:– చాల్లే! ఆపు సోది. పద తిండి పెడుదువుగాని. (వెటకారంగా) ఈ యింటి నుద్ధరించటానికి మీరంతా వున్నారుగా? చాల్లే!

సుశీ:– మేము ఉద్ధరిస్తామని నీతో చెప్పామా? దరిద్రపు స్నేహాలుపట్టి నువ్వే ఉద్ధరిస్తున్నావుగా. నలుగురిలో ఛీ. ఛీ. అనిపించుకుంటాను.

రంగా:– ఎవ్వడు నన్ను ఛీ. ఛీ. అంది. వాణ్ణి డొక్క పగల దీస్తాను.

సుశీ:– నోరుంచేసరి. నాకెందుకులే. యిన్నేళ్ళు వచ్చినాక నీకు తెలియాలికాని.

రంగా:- నాకు తెలుస్తూనేవుంది. నవ్వు ఈ యింటికెపెత్తుండాలి వచ్చావని

సుశీ:- యింటికి వస్తూనే అదిరించి బెదిరించి రావటం. తిని పోయి వీధులెంట కొంపా గోడి లేనివాడికిమల్లే తిర గటం. ఛీ ఛీ పాడు బ్రతుకు. (వెళ్ళబోయింది)

రంగా:- ఏమన్నావ్ (కొట్టబోతాడు. సుశీల ఏడుస్తూ విడి లించుకొంటుంది) జాగ్రత్త. పద. తిండి పెడుదువుగాని.

సుశీ:- (కోపంతో) నేను పెట్టనుపో (అలుగుతుంది)

రంగా:- (పైకొస్తు) చంపేస్తాను.

సుశీ:- నాన్నను రానీ చెప్తాను. (ఏడుస్తు)

రంగా:- ఓ పెద్దఆత్తరంక్షకుడు దొరికాడు (ఎగతాళిచేస్తు) పద అన్నం పెడుదువుగాని.

సుశీ:- నేనెందుకు పెట్టాలి.

రంగా:- తంతాను.

సుశీ:- ఏది! తన్ను చూద్దాం. (నిర్భయంగా)

రంగా:- తిండి పెట్టవన్నమాట.

సుశీ:- హు హు

రంగా:- నేనే పెట్టుకుతింటాను. (వెళ్ళబోతాడు)

సుశీ:- (అసహ్యంగా) సిగ్గులేకపోతేసరి

రంగా:- ఏమన్నావ్ (కొట్టబోతాడు సుశీలఅరుస్తుంది. యింతలో నరసయ్య వస్తాడు)

నర:- (కోపంతో) ఏమిట్రా అది? ఏమిట్రా దున్నపోతా? ఆడపిల్లను కొడతావా? నువ్వు కడుపుకి అన్నంతినటం లేదట్రా?

రంగా:- (ఆగిపోయి) బ్రతికిపోయావుపో! (లోపలకు వెళ్ళాడు రివ్వున. సుశీల కన్నీళ్ళుతుడుచుకుంటూ నరసయ్య దగ్గర కొస్తుంది. నరసయ్య తల నిమురుతూ)

నర:- (ప్రేమపూర్వకంగా) కొట్టాడా?

సుశీ:- (లేదన్నట్లు తలవూపుతుంది)

నర:- వాడసలే వట్టి పశువు. వాడిజోలి కెందుకెళ్ళావమ్మా? వాడిపుటకతగలెయ్య. వాడిమూలంగా నాపరువుప్రతిష్టలు నాశనమైపోతున్నాయి. (బాధగా) నాకడుపున చెడపుట్టాడు. ఛీ, ఛీ, నన్ను నవ్వులపాలు చేస్తున్నాడు. (మంచంమీదకూర్చుంటూ) కాసినిమంచినీళ్ళు తెచ్చిపెట్టమ్మా!

సుశీ;- తెస్తానుండునాన్నా (లోపలకువెళ్ళును)

నర;- (నిట్టూర్చి) ఓరిభగవంతుడా? నేనెంతపాపం చేస్తేనాకిలాంటి సంతానాన్నిచ్చావురాతండ్రి!

సుశీ:- (లోపలనుండి) అయ్యో? ఆపెట్టిలో ఏమున్నయ్యనాన్నాయి యేమిటది?

రంగా:-(కోపంతో) నోరెత్తావాచచ్చావే? పో? అవతలకు

సుశీ;- (యేడుస్తు) నాన్నా...నాన్నా.. అన్నాయిపెట్టెలుపగలగొడుతున్నాడు. అన్నాయి నీకుదండం పెడతాను నాపెట్టెలంటుకోకు.

నర:- (ఉద్రేకంగా) ఒరేయ్ దున్నపోతా,. ఏమిట్రా నీకేమొచ్చిందరాపోయేకాలం? ఈకొంపకు నువ్వొక్కడదాపురించావురా? (లేచి లోపలకువెళ్ళబోతాడు. వాకిట్లోకి రంగారావేరివ్వున వెళుతూ ఎదురౌతాడు. నరసయ్య

కోపం పట్టలేకుండవుండాడు. ఏంచెయ్యటానికి తోచక కాండ్రించి (కిందఊస్తాడు.) ఛీ నీ బతుకు తగలెయ్య

రంగ:- (రంగారావు పోతున్నవాడల్లా హఠాత్తుగాఆగికోపంతో చురచురాచూస్తాడు)

నర:- (కోపంతో) కొడతావట్రాముండా? దయ్యప్పుగుడ్లేసుకుని చూడగానే భయపడతాననుకున్నా! (రంగారావు వెళ్ళిపోతాడు. సుశీల మంచినీళ్ళ గ్లాసుతో వస్తుంది)

సుశీ:- యివిగోనాన్నా మంచినీళ్ళు (యిస్తుంది)

నర:- (తీసుకుంటూ) ఏంతీసుకువెళ్ళాడు?

సుశీ:- నాపెట్టెపగలకొట్టి నువ్వామొన్న మహాశివరాత్రినాడు యిచ్చిన పదిహేనురూపాయలు ఎత్తుకెళ్ళాడు.

నర;- చావనీయి, వాడిపుటక తగలెయ్య. యికవాడిజన్మఅంతే రామ రామ నలుగురిలో తలెత్తుకోవటానికి రుణంలేదు కదా! కొంపలమ్మటతిరగటం చీట్లపేకలూ ఊరంతా అప్పులటా నామాన మర్యాదల్ని గంగలో కలుపుతున్నాడు నేనిస్తాలేఊరుకోమ్మా నీడబ్బు(ఏట్టూర్చి)ఏనాడు చేసుకున్నకర్మో యివ్వాళ అనుభవిస్తున్నాను.

సుశీ:- యివ్వాళ అనుకుంటే లాభమేముందినాన్నా వాణ్ణి చిన్నప్పటినుండీ తయారుచేసిందిఅట్లా మీరు కాదూ?

నర:- బాగుపడి చస్తాడనుకున్నాంకాని యిలాబరితెగినఅడ్డగాడిదల్లే పీకులెంట తిరుగుతాడనుకున్నానా?

సుశీ:- ఆవేళవాణ్ణి చదివించమంటే మీరువిన్నారుగాదయ్యో? అబ్బాయికందిపోతాడనుకుంటే యివ్వాళఎందుకూపనికి

కిరాకుండా తిరుగుతున్నాడయ్యో మొక్కనాడువంచంది మానయ్యింతరువాత వంచగలమా?

నర:— ఏమిటో అంతాకర్మ

సుశీ:— సరే భోజనానికి లేవండినాన్నా

నర:— లేస్తాలే ఆకలి కావటంలేదు యికవాడుచూడటో తే నామాటవిన్నాడా? కొండకు వెళ్లొద్దురాఅన్నా

సుశీ:— (ఆత్రుతగా) ఎంజరిగింది నాన్నా

నర:— ఆ...ఏముంది...ఆకొండదెగ్గర ఈసంవత్సరం కలరాలు చాలాతీ ంగా వున్నయట చాలామంది చనిపోతున్నా రట (నిట్టూర్చాడు)

సుశీ:— ఎవరుచెప్పారు?

నర:— కొండకెళ్ళి వచ్చినవాళ్ళే.

సుశీ:— ఏకొండ దగ్గరా?

నర:— పెద్ద కొకడదగ్గరే

సుశీ:— మరి అన్నయ్యా వాళ్ళు...

నర:— (నిరుత్సాహంగా) ఏమో పిచ్చిసన్నాసి

సుశీ:— కొండకెళ్లినవాళ్ళని అడక్కపోయావా వుండు మనరాఘ వయ్య బాబాయి వెళ్ళినట్లున్నాడుఅడిగివస్తాను(వెళ్ళింది కొద్దిసేపటికితిరిగివస్తుంది.)వస్తున్నాడునాన్నా బాబాయి

నర:— (దగ్గుతాడు కొద్దిసేపు నిశబ్దం యింతలో రాఘవయ్య వస్తాడు వయస్సు 35 సంవత్సరాలుంటయి. పైపంచబా గుగా జారవేశాడు కట్టుపంచ కాళ్ళకు అడ్డుపడుతూనేల యీసుకుంటుంది. బక్కపలచగా బారుగావుంటాడునోట్లో

పెదాలమధ్య పుగాకుకాడవుంది. ఒక కాడచించి చుట్ట చుట్టుకుంటు నిర్లక్ష్యంగా వచ్చాడు)

నర:- రారా రాఘువయ్యా రా

రాఘు;- దేనికే నరసయ్యన్నా పిలిచావట

సుశీ:- (ఆత్రుతగా) నువ్వు కొండకు వెళ్ళలేదా బాబాయి

రాఘు:-(కూర్చుంటూ) వెళ్ళేనుగా (చుట్టముట్టిస్తాడు)

నర:- వెళ్ళేమావాడు కనిపించాడా?

రాఘు:-ఆరివీడిశిగతరగా పట్టివెధవ పుగాకిచ్చాడు వట్టితడిముద్ద ఎన్నిపుల్లలుపెట్టికాల్చినా కాలిచావందే మరీఈకోమటి నరసయ్యకు పోయ్యేకాలం వచ్చిందే నరసయ్యన్నా (చుట్టచివరకొరికి క్రిందవూస్తాడు)

సుశీ:- ఏంబాబాయి అన్నాయి కనుపించలా

రాఘు:-ఎవరూ మనచంద్రమేనా?

నర:- అవునురా

రాఘు:-ఆ, కనుపించకేం కనుపించాడు, నేనువచ్చేటప్పుడు మాట్లాడానుగూడాను

నర:- యిదేం అనోళంరా కొండదగ్గర కలరావ్యాధి తీవ్రంగా

రాఘు-ఉన్నమాటయదార్థమే. కాని, మనవాడు ఈపాటికి వస్తూనేవుండాలి. నిన్ననే ఎడ్లపందాలు గూడాఅయి పోయినై.

నర- పందాల్లో యేవూరి ఎడ్లుగెలిచినైరా ఈసంవత్సరం?

రాఘు-మనఊరియెడ్లే గెలిచినై.

సుశీ- ఎవరివి బాబాయి గెలిచినది?

రాఘు–ఈచుట్టుప్రక్కల పదియిరవై ఊళ్ళల్లో మీఎడ్లను ఓడించేయి వున్నయ్యా?

సుశీ:- మాఎడ్లుగెలిచినయ్యా బాబాయి,

రాఘు:- ఔను, ఒసి వాటితల్లిశిగతరగ, మరీఆపాలబట్లయెద్దు కాడిక్రిందనిలిచిందటే నరసయ్యన్నా? బండికట్టేకన్ను మూసితెరిచేలోగా ఆవతలఅద్దుదగ్గర కెళ్ళిఆగినైయను కో? అసలు రెండూ రెండేనే సిహ్వాపుపిల్లలు.

నర:- అదంతా మాపెద్దవాడి తరిఫీదురా, ఆసలుఆఎడ్లంటేనే వాడికిపంచప్రాణాలు.

సుశీ:- అన్నాయి యిరవైనాలుగు గంటలూ ఆఎడ్లదగ్గరే ఉంటాడు.

నర:- మా ఎడ్లమీద ఓడిపోయింది ఎవరివిరా!

రాఘు:- (చుట్టపారవేసి) యింకెవరివీ? మన ఊరిషావుకారు గారివే, ఒసి వాటిపడిచావ! ఊరపందుల్లతెలిసి తెగ బలిసినైకాని కాడిగట్టగానే గ్రుడ్లుమిటకరించి ఎదురు తిరిగి నిలబడ్డయ్యేనరసయ్యన్నా.

నర:- (నవ్వి) ఆవి ఎప్పుడూ అంతేరా!

రాఘు:- ఈసంవత్సరం కొండదగ్గర అన్నివేల జనాన్ని మూర్చ పోగొట్టినై మీఎడ్లేననుకో! అరెరె ప్రతివాడు ముక్కు మీద వేలువేసుకొన్నారే నర్సయ్యన్నా! మీఎడ్లను చూట్టానకి వచ్చేజనం పోయ్యేజనం ఒహ్హొ! ఆతీర్థ ప్రజ లంతా యిరగబడిందనుకో! ఒకప్రక్కన తనయెద్లు ఓడి పోయినందుకు సిగ్గుపడిచావక పైగా సవాళ్ళుచేశారు షాహుకారుగారు.

నర:- మావాడు ఎదురు చేయలేదుగదా?

రాఘు:- అంతవరకురువచ్చినాక ఎవరూరుకొంటాడే! తలొక మాటా అన్నారు,

సుశీ:- ఎవరినీ?

రాఘు:- ఆజగన్నాథంగుంపునే.

నర;- మావాడుగూడా యేమన్నా అన్నాడా?

రాఘు:- ఏదోయిద్దరూ కీచులాడు కున్నారు. నువ్వెంతంటే, నువ్వెంతని?

నర:- బాగానేవుంది యిదా వాడు చేసిన ఘనకార్యం పందాలకు వెళ్ళిపోట్లాట తెచ్చాడు?

రాఘు:- వాడితప్పేముందే నరసయన్నా, వోడిపోయిందిచాలక వాళ్ళే సవాళ్లు చేశారు.

సుశీ:- వాళ్లు చేస్తే...

రాఘు:- ఏం? డబ్బుగలవాడైనంతమాత్రాన అభిమానం చంపుకొని అన్ని వేలమందిలో వాళ్ళచేత అడ్డమైన మాటలు పడమంటూారటే నర్సియన్నా?

నర:- బాగానేవుంది. మీరంతా వెళ్లి యిదట్రాచేసింది. వాడసలే తొందరమనిషి. పెద్దవాడివి నీకన్నా తెలియ నక్కర్లేదట్రా! రాఘువయ్యా?

రాఘు:- నన్నేంజేయమంటావే? ఎద్దు వోడిపోగానే నలుగురూ నాలుగన్నారు. దాంతో వాడికి శివమెక్కింది. ఆ జగన్నాథంగాడి పాలేరు నాలుగంటే మనవాడు రెండన్నాడు తప్పేముంది?

సుశీ:- ఈ తగాదాలు ఊరికినే పోతయ్యా బాబాయి?

రాఘు:- ఆ...ఏమిటి వాడుచేసి చచ్చేది.

నర:- వాడు తలుచుకుంటే ఏదైనా చేయగల సమర్థుడు. ఈ పడిన నిప్పుకణాలు ఊరికినే ఆరతాయ్యట్రా? (యింతలో సత్యం వస్తాడు. వయస్సు 24 సంవత్సరాలుంటయి. పైజమా, లాల్చి, రిష్టువాచీ కాళ్లకు సాదా చెప్పులు)

సత్యం:- ఎప్పుడొచ్చావు మావయ్యా కొండదగ్గరనుండి?

రాఘు:- రాత్రేవచ్చారా. అబ్బాయి నువ్వు రాలేదేరా?

సుశీ:- ఆయనగారికి దేవుడు లేడంట బాబాయి.

సత్యం:- సుశీలకు దేవుడున్నాడా? నువ్వు నిజంచెప్పు రాఘు వయ్య మావా? (చిరునవ్వుతో)

రాఘు:- (నవ్వుతూ) యింట్లో దేవుడుండగా మరొక దేవు డెందుకురా సత్యం?

నర:- (అర్థంకాక) యింట్లో దేవుడెవర్రా!

రాఘు:- (చమత్కారంగా) యింకా వేరే దేముడెందుకే మన సత్యం వుండగాను.

సుశీ:- (సిగ్గుతో) పో! బాబాయి. నీదంత చెతురు. (అంతా నవ్వుతారు)

సత్యం:- చతురేమిటిమావా! నాకన్నా మించిన...

నర:- ఆ...మీ పను లెంతవరకొచ్చినైరా సత్యం

సత్యం:- చాలావరకైనట్లే. రేపు రాత్రికి మన శివాలయం దగ్గర ఒక నాటక ప్రోగ్రాం ఏర్పాటుచేశాము. మీ రంతా రావాలి.

రాఘు:- అలాగే వస్తాంలేరా. ఒరేయ్ సత్యం నువ్వు వచ్చి నాకనే యీ పంచాయితీ పరిపాలనకాస్త బాగుపడింది

అదివరకు ఈ ఊరుని గురించి ఒక్క గాడిదకొడుకు పట్టించుకొన్నాడట్రా!

సుశీ:- (వెటకారంగా) ఆ... పట్టించు కొంటున్నాడు బాబా యి మీా అల్లుడు

రాఘు:- (అర్థంకాక) ఏమిటే!

సుశీ:- కంటినిండా బురద (అంతానవ్వుతాను) దొరగారల్లే రోజుకొక జతగుడ్డలు పాడుజేస్తును.

నర:- (చిరునవ్వుతో) సత్యం నువ్వు ఎంత పట్నంలో చదువు కున్నా మా సుశీల నీకంటె మాటల్లో తీసిపోతుందం టయ్యా!

సత్యం:- అందుకనే నుక్కూ మొహం ముడతలపడ్డ ముసలాడి కిచ్చి చేస్తే అమ్మాయితిక్క కుదిరేది.

సుశీ;- (గారాబంగా) చూడునాన్నా?

సత్యం:- సుశీ...కాసిని మంచినీళ్ళు తెచ్చిపెట్టు.

సుశీ:- ఆ... తెస్తా పాపం (తాగుదువుగాని వుండు.

నర:- పోయిరామ్మా (నవ్వుతారు సుశీలవెళ్లింది)

సత్యం:- రేపు మీారు తప్పకరావాలి మామయ్యా?

రాఘు:- అట్లాగే వస్తాంలేరా.

నర:- యిప్పుడు ఎంతడబ్బు వసూలు చేశార్రా!

సత్యం:- యిప్పటికి పదివేలు దాదాపు వసూలైయింది. నాలుగు వేల జనాభావున్న ఈఊరికి ఒక స్కూలుగాని, హాస్ప టలుగాని పదిమందీచేరి చదువుకొనేందుకు లైబ్రరీగాని లేవా? యివన్నీ కట్టించాలంటె కనీసం యిరవై వేలన్నా కావాలి,

రాఘు:–యిర్వై వేలే (ఆశ్చర్యంగా) అంతడబ్బువసూలవ్వద్రా

నర:– ఎందుకాదూ! నలుగురూ నాలుగుచేతులేస్తే ముప్పై నలభై వేలవరకూ తేలిగ్గా వసూలౌతుంది,

సత్యం:– ఊళ్లో కామయ్య జగన్నాథం లాంటి ఒకళ్ళిద్దరు యివ్వకపోతే మాత్రం మీలాంటివాళ్ళు మాకుఅండగా వుంటే అంతేచాలు మావా?

రాఘు:– జగన్నాధం ఏమన్నాడురా?

సత్యం:– ఏమంటాడు చదువుకునేవాళ్ళకు స్కూళ్ళేనా? చచ్చిన వాళ్ళకు సమాధులుకూడా కట్టిస్తారా? అన్నాడు. యిక ఆ కామయ్య మందుల దుకాణాలెందుకోయ్ మన ఊళ్ళో? అవి పెట్టినదగ్గరనుండీ మంచివాళ్ళకు కూడా మరనాడే మహావ్యాధులు పుట్టుకొస్తాయి అన్నాడు.

రాఘు:– యిచ్చిన డబ్బుతో ఒకడికి సమాధి రెండవ వాడికి శ్రాద్ధంచేయిస్తా ననకపోయావా– మెతుకుపోతే బ్రతుకు పోతుందనే యిలాంటి గాడిదకొడుకు లుండబట్టే ఈ ఊరి కీగతిపట్టింది.

నర– (అసంతృప్తిగా) అదేమిటిరా రాఘువయ్యా, వాళ్ళ కిష్టమైతే యిస్తారు, లేకపోతే లేదు. అందుకని వాళ్ళను తిట్టడం ఏంమర్యాదరా ?

రాఘు– చాల్లే ఊరుకోవే నరసయ్యన్నా. వాళ్ళుచేసి చచ్చేది లేకపోగా. సమాధులు కట్టిస్తారా ? అంటే ? తల్లి శిగ్గొయ్యా ! దానర్థమేమిటో ?

సత్యం– వాళ్ళన్నారని మనప్రయత్నాల్ని మానుకుంటామా ?

రాఘు— ఆంక్షలేరా, వెనకటికో ముసలమ్మ, నాకోడి నానిప్పూ లేకపోతే ఈఊరు తెల్లవారదందట పిల్లిద్దరూ యివ్వాక పోతే మునిగిపోమలే ఏదో యెద్దుముడ్డి పొడుచుకు నే మాకు ఇవన్నీ తెలిసి చావక కాని, లేకపోతే ఈఊరి కిలాంటి గతిపట్టేదా?

సత్యం;— తెలుసుకోవాలి మావయ్యా? రేపు రాత్రికి ఈగ్రామ పునరుద్ధరణ సహాయంకోసమే పట్నంనుండి నాటకాలు ఆడేవాళ్లను పిలిపిస్తున్నాను మీరు తప్పక రావాలి.

రాఘు:—నువ్వు ఇన్నిసార్లు చెప్పాలా! పదింటో వెళ్లి రా! వస్తాంలే (సత్యం లోపల కెళ్లిపోతాడు.)

నర;— బజారుకొస్తావట్రా రాఘువయ్యా,

రాఘు— దేనికి?

నర— నాకు ఆకరణంగారింటిదగ్గర పనుంది వెళ్లిరావాలి. (లేస్తాడు)

రాఘు— పద నాకూఆబళ్ల కాళ్యాణాదగ్గరపనుంది. (ఇద్దరూ వెళుతూ వుంటారు) యిదిగో నరసన్నయ్యా, సత్యం చాలా తెలివైనవాడే. అటాంటివాడు వూరుకొకడుంటే చాలదూ.

నర:— యివ్వాళ వాడి తల్లీ దండ్రి బ్రతికివుంటే ఎంత సంతో పించేవాళ్లో రా! (విచారంగా)

రాఘు:— నిజమే పాపం! కాని...ఆ లోటు నువ్వుతీర్చావులే. పదవే నరసయన్నా. (వెళ్ళిపోతారు. సుశీలవచ్చిచూచి ఆశ్చర్యపోతుంది. యింతలో సత్యం లోపలనుండి చక చకా బయటికి వెళుతుంటాడు.)

సుశీ:— ఏమండోయ్ దొరా! ఎక్కడికీ ప్రయాణం (బిగ్గరగా)
సత్యం:— వూళ్ళోకండి దొరసానిగారూ! (ఎగతాళిగా)
సుశీ:— తెల్లవారేటప్పటికి మీరు కాఫీలు, ఉప్మాలు మెక్కుకలో జోగాం అంటూ వూరట తిరుగుతుంటే మీ కోసం ఎంతఎరకని తిండీ తినకుండా వుండేది?
సత్యం:— నిన్ను ఎవరు తినవద్దన్నారు?
సుశీ:— మీరు తినకుండా నేనా?
సత్యం:— ఏం నేను తినకపోతే నువ్వు తినకూడదా!
సుశీ:— యింకా నయం. నలుగురూ ఏమనుకుంటారు?
సత్యం:— అయ్యగారి నెండబెట్టి అమ్మగారు భోంచేశారనుకుంటారు.
సుశీ:— మీ పరిహాసాల కేం గాని లే పదండి తిండితిని వెళుదురు గాని.
సత్యం:— యిదిగో సుశీ. నన్ను చేసుకి ప్రాణం తీస్తావుగాని నాకు ఆకలిగా లేదబ్బా!
సుశీ:— (ఎగతాళిగా) ఎట్లా వుంటుందబ్బా! తినేది అత్తవారింటిదగ్గర అరణమయ్యె.
సత్యం:— నీకంత కష్టంగా వుంటే నా పెట్టె బెడ్డింగు సర్దు. నేను పట్నం వెళ్లిపోతాను.
సుశీ:— (దిగులుగా) యిప్పుడు నేను యేమన్నానని?
సత్యం:— మీ నాన్నగారి యిల్లంతా గుల్లచేసి తింటున్నాడనటంలా?
సుశీ:— నే నన్నదాంట్లో అదా అర్థం? (కన్నీళ్లుపెట్టుకొంటు)
సత్యం:— అర్థం యేదైతేమట్టుకు నాకేంగావాలి. నే నీరాత్రికి

పట్నం వెళ్ళిపోతాను. (నటిస్తు)

సుశీ:- అయ్యో! ఎక్కడికెళతాన్ని. నేను తెలియకన్నాను

సత్యం:- (కోపం నటిస్తు) నేను తెలియకే వున్నాను.

సుశీ:- (ఏడుస్తు) నన్నుకూడా మీ వెంట తీసుకెళ్ళండి.

సత్యం:- నాకేం మడులా! మాన్యాలా! నేను నీకు అరణంపెట్ట గలనా? అందలాలు ఎక్కించగలనా?

సుశీ:- అయితే నన్ను చంపేసి మరీ వెళ్ళండి.

సత్యం:- (చాటుగాతిరిగి ముసిముసినవ్వులు నవ్వుతూ) నిన్ను చంపితే నన్ను జైల్లో వేయటానికా?

సుశీ:- (ఏడుస్తు) మరి మిమ్మల్ని విడచి నేనెక్కడుండేది?

సత్యం:- (నిర్లక్ష్యంగా) ఏమో నాకేం తెలుసు?

సుశీ:- (విచారంగా) పోనీ మీకు అంత బరువైతే నేనే దేని క్రిందనన్నా పడి చస్తాలెండి.

సత్యం:- (నవ్వుతూ తిరిగి) నీకు పుణ్యముంటుందిగాని ఆపని మాత్రం చేయకు

సుశీ:- (బెదిరిస్తు) మీకూ బరువైనాక నేనెందుకు బ్రతకాలి?

సత్యం:- (బుజ్జగిస్తు) సుశీ ఏదో ఎగతాళికన్నాలే? ఊరుకుందూ

సుశీ:- (పలుకదు)

సత్యం:- సుశీ...నాపైన కోపం వచ్చిందా! (బ్రతిమాలుతూ)

సుశీ:- (ముఖం త్రిప్పుకొని) కోపం, తాపం రానటానికి నే నెవరనీ? (వెళ్ళబోతుంది పట్టుకొని)

సత్యం:- అరే! నిజంగానే కోపమొచ్చిందే! ఆడవారికి కోపం ముక్కుమీద, ఏడుపు కళ్ళలోను పెట్టారు,

సుశీ:- (కోపంగా) పెడితే పెట్టార్లే.

సత్యం:- సుశీ...(బతిమాలుతూ)
సుశీ:- ఇక మీరు నాతో మాట్లాడకండి (విదిలిస్తు)
సత్యం:- అదేమిటి? యింతలోనే ఆజన్మవిరోధివై పోయావు? (ఆశ్చర్యముగా)
సుశీ:- లేకపోతే మీరు...
సత్యం:- (నవ్వి) పట్నం వెళతా నన్నానా! పట్నం లో ఏముంది? యిదిగో! నిన్ను విడిచిపెట్టి వెళ్లనుగా.
సుశీ:- తిండీ తిప్పలు లేకుండా తిరిగితే ఆరోగ్యంచెడిపోతే.
సత్యం:- (నవ్వి) వోహో!అదా!యిదిగో! నువ్వులెక్కపెడుతూ వుండు. పదినిముషాల్లో వచ్చేస్తాను. ఓ మైడియర్ సుశీ నిన్ను కష్టపెట్టటం నాకుమాత్రం యిష్టమా?
సుశీ:- అయిన ఆలశ్యం చాలుగాని యిప్పుడన్నా వెళ్ళి ఆ రాచకార్యం చక్కపెట్టుకురండి.
సత్యం:- ఆల్ రైట్ బ్రతికాను. (వెళ్ళబోయాడు. యింతలో జగన్నాధరావు కుమార్తె శ్యామల వస్తుంది. వయస్సు 15 సంవత్సరాలుంటాయి. క్రొత్తచీర, క్రొత్తజాకెట్టు తలదువ్వించుకోటానికి కొన్నిమల్లెపూలు ఒళ్లోపోసు కొని వస్తుంది.)
శ్యామల:- (వస్తు) ఏమిటన్నయ్యా వదిన పోట్లాడుతుంది.
సత్యం:- (నవ్వి) వదినలు పోట్లాడక మాట్లాడతారా? నన్ను తన సమిటచెంగుకు పెట్టికట్టివేస్తాను. కదలకుండా నాదగ్గర కూర్చోపమ్మా అంటుంది.
శ్యామ:- (నవ్వి) ఏం వదిన మా అన్నయ్యను కొంగుకట్టి నే టట్లున్నావే,

ఆ! కొబ్బరిబెల్లమని (అంతా నవ్వుతారు. సత్యం బయటకు వెళ్లిపోతాడు.)

వదినా! ఈ పూలుపెట్టి జడవేస్తావా?

(చిరునవ్వుతో) వంకెల జడేనా?

అబ్బ! పోమ్మా! నీకెప్పుడూ ఎగతాళీ.

అదేం వయ్యారమే. యిప్పుడే వయ్యారము వలక బొయ్యకూ మాఅన్నయ్య వచ్చిందాకా కాస్త దాయి నేను యింటికి వెళ్ళిపోతున్నాలే!

ఎందుకే ఈసింగారం? మాఅన్నయ్య వస్తున్నాడనేనా, (సిగ్గుతో తలవంచుకొని అదోలా మాస్తుంది) నేనింటికి వెళ్ళాలమ్మా!

(నవ్వుతూ) నాదగ్గరదాచినా మాఅన్నయ్య దగ్గర దాయ లేవుగా? రానీ చెప్తాను.

(కోపాన్ని అభినయిస్తు) పోమ్మా! నీకెప్పుడూ ఒకటే చెతురు. (వెళ్ళబోతుంది. వాకిట్లో కాలు పెట్టగానే చంద్రం హుషారుగా లోపలికొస్తుంటాడు. యిద్దరూ వాకిట్లో ఢీ కొంటారు. ఈసంఘటనకు శ్యామల ఒడిలోని పూలన్నీ చెయిజారి చంద్రం పాదాలమీదపడి చెదరి పోతయి, చంద్రం ప్రేమ పూర్వకమైన చూపులు శ్యామలను చక్కలిగింతలు పెట్టినట్లుగా చేస్తయి. శ్యామల సిగ్గు భయాలతో తలవంచుకుంటుంది. ఆకస్మికంగా యిద్దరిచూపులూ కలుస్తాయి చిరునవ్వులు పెదాలమీద నృత్యం చేస్తున్నాయి యిద్దరూ ఒక్కసారేవంగి ఆపూలు ఏరుకోబోతారు. యిద్దరితలలూ ఢీ

కొంటాయి. "అబ్బా" అంటూ యిద్దరూ లేస్తారు. శ్యామలకు సిగ్గూకోపం వస్తాయి. అక్కడనుండి దూరంగా వెళ్ళినిలబడుతుంది. ఒకచేతిలో కొండదగ్గర గెలుచుకొచ్చిన వెండికప్పు గంటలు మ్రోగే చంద్రకోల వుంటాయి. సుశీల యిదిచూచి నవ్వుకొంటూ లోపలకెళ్ళిపోతుంది. సుశీల లేకపోవటం చూచి శ్యామల కంగారుపడి లోపలకు పారిపోబోతుంది. చంద్రం శ్యామలను పట్టుకోబోతాడు. దొరకకుండా తప్పించుకుటుంది కాని శ్యామల దారికడ్డంగా చంద్రం నిలబడి అవతలకు ఏరిన పువ్వులు యివ్వబోతాడు శ్యామల సిగ్గు భయాలతో)

శ్యామ:- నాకొద్దుపో! (దూరంగా జరుగుతుంది చంద్రంనవ్వుతాడు) దారికడ్డంగా లే వెళ్ళాలి!

చంద్ర:- వదిలి పెట్టను పారిపోతావేం?

శ్యామ:-పారిపోక నీప్రక్కన కూర్చుంటాలే పాపం!

చంద్ర:- ఎప్పుడైనాతప్పదుగా!

శ్యామ:-(నవ్వునణచుకొంటూ) అప్పుడుకూర్చుంటాలే! దారికడ్డంలే నేనువెళ్ళాలి మళ్ళీ సుశీలవస్తుంది.

చంద్ర:-(నవ్వుతూ) వస్తేనేం?

శ్యామ-ఏమనుకుంటుంది; (భయంగా)

చంద్రం-మొగుడూపెళ్ళాలనుకొంటుంది,

శ్యామ-(కంగారుగా) సంతోషించావ్లే!

చంద్రం-సమ్మతించాంలే! (నవ్వుతాడు)

శ్యామ-దారివదలిపెట్టు. (కోపం నటిస్తు)

చంద్రం-పారిపోనని వట్టుపెట్టు (పట్టుసడలుతూ)

శ్యామ–అబ్బా వదలండీ! (జాలిగా)
చంద్రం–అబ్బ! ఏమ్పెట్టి డీ! (ఎగతాళిగా)
శ్యామ–సరే వెళ్ళండి! (కోపంగా)
చంద్రం–సరేవిడిచేనులే! (చిరునవ్వుతో)
శ్యామ–(దూరంగాపోయి నుంచుంటుంది. చంద్రం మెల్లిగా వెళ్ళి వెనక నిలబడతాడు) కళ్ళుమూసుకుని నడవటం మానుకోవాలి!
చంద్రం–అదేనువ్వు నేర్పుకోవాలి! (నవ్వుతూ)
శ్యామ–ఆ...నేర్చుకున్నాను. యికమీయింటికి రాకూడదని (కోపం నటిస్తు)
చంద్రం–(మృదువుగా) నామీద కోపంవచ్చిందా!
శ్యామ–(బెట్టుగా) నన్ను, నలుగురిలో (మధ్యలో)
చంద్రం–పెళ్ళిచేసుకుందామనుకొన్నాను. కాని మీనాన్న చెయ్యందే నేనే చేస్తాను.
శ్యామ–(నవ్వుతూ) ఎప్పుడో చేస్తాడు కర్రతీసుకొని. (తప్పించుకుని కిలకిలా నవ్వుతూ పారిపోతుంది లోపలికి.)
చంద్రం–(నిస్సహాయుడిలా బతిమాలుతూ) శ్యామలా! యిదిగో శ్యామలా! ఒక్కమాట, (వెళ్ళిపోయింది చంద్రంనోటితో ఏదో ఈలపాటపాడుతూ వచ్చి పట్టిళ్ళ చంద్రాకోలా ఆక్కడపడేస్తాడు. యింతలో సుశీల శ్యామల తిరిగివస్తారు శ్యామల వెనకనిలబడి దొంగచూపులు చూస్తుంది. సుశీల కోపం నటిస్తుంది)
సుశీ– ఏమిటన్నాయి యిదీ?
చంద్రం–(ఆశ్చర్యముగా) ఏమిటి?

సుశీ:-షాహుకారుగారమ్మాయిని పెళ్ళిచేసుకుంటానన్నా వటగా
చంద్ర:-(తెలియనట్లు) అబ్బే! ఆ అమ్మాయేనన్ను చేసుకుంటా నంటుంది.
శ్యామ:-అబ్బా పో! వదినా! (యింతలో నరసయ్యా వస్తాడు అంతా తేలు కుట్టిన దొంగల్లా వూరుకుంటారు)
చంద్ర:-యీ వెండికప్పు తీసుకు వెళ్లి బీరువాలో పెట్టమ్మాయి (యిస్తాడు)
సుశీ:- నాన్నా నాన్నా అన్నయ్య కొండదగ్గర గెలుచుకువచ్చిన వెండికప్పు యిదుగో!
నర:- (నవ్వుతూ) అది అన్నయ్య గెలుచుకొచ్చింది కాదమ్మా మనయింటపుట్టినఎద్దు గెలుచుకొచ్చింది.(కూర్చుంటూ) ఎప్పుడొచ్చావురా?
చంద్ర:-యిప్పుడేనాన్నా (యింతలో రాఘవయ్య పెద్ద పెద్దగా అరుస్తూ వస్తాడు బయటనుండి)
రాఘ:- తల్లిసిగ్గోయ్య, ఓడిపోయినందుకు ముండలల్లే మూలకూర్చోక సిగ్గులేక శివాలేస్తున్నాడు.
నర:- ఎవర్రా, ఎవరూ?
రాఘ:- యింకెవడు చచ్చాడే! ఆజగన్నాధంగాడే! (శ్యామలను చూచి నాలుక కొరుక్కుంటాడు శ్యామల మొఖం నల్లబడుతుంది, గబ గబా వెళ్ళిపోతుంది.) తల్లి సిగగొయ్య ఎంతబుద్ధితక్కువపనిచేశానే నరసయ్యన్నా
చంద్ర:-(కోపంతో లోపలకు వెళతాడు.)
సుశీ:- అన్నయ్యా. అన్నయ్యా (అంటూ సుశీల వెళుతుంది. అంతా ఆశ్చర్యముగా చూస్తుంటారు) [తెర]

# రైతుబిడ్డలు

## రెండవరంగం

-:[ తెర ]:-

సీను- (అది జగన్నాధరావు మేడ మేడముందు వరండాహాలు హాలులో ఒక పడకకుర్చీ రెండు సాదాకుర్చీలు. ఒక పొడుగుపాటి బెంచీబల్ల సింహద్వారపు చెక్కపైన కొన్ని బొమ్మలు, రెండుమూడు కాగితాల పూలచెట్లూ వుంటాయి. తెర లేవకముందే జగన్నాధరావు బయటనుండి వస్తూ భయంకరముగా అరుస్తూ వుంటాడు)

జగ- గెలిచారు లేవోయ్ ముండమోపులు అడ్డమైన గడ్డితిని ఎట్లాగైతేనేం? ఔనని పించు కున్నారే.

ఒకగొంతు-ఆయెడ్లను చూచుకొని ఆయన భూమ్మీద ఆగేట ట్టున్నాడా దొరా! యింతజరిగినాక రోషం లేనివాడు గూడా కత్తెట్టుకుని పొడుచుకుని చత్తాడే! వీరెట్టా భరించారంటా?

జగ:- (కటువుగా) యిల్లలకగానే పండగైయిందట్రా. ముం దుంది ముసళ్ళపండిగ.

ఒకగొంతు:-దొరా! దొరా! ఆడిముఠావాళ్లువత్తున్నారు. ఊరు కోండి. (తెరలో పెద్దగానవ్వులు మాటలు వినుపిస్తయి)

ఒకడు:-నూరుగద్దల్నితిన్న రాబంధు ఒక్కగాలిపెట్టుకు చచ్చిం దని) మనవాడు చంద్రం వీడికితగిన బుద్ధిచెప్పిపంపాడ్రా! (జగన్నాధరావు చమటలుకమ్మిన ముఖంతో లోపలికి వస్తాడు, బయట)

రెండవవాడు:-(పెద్దగానవ్వి) బుద్ధిచెప్పటమేమిటి. నీమొఖం ఒక్కదెబ్బతో నషాళానికంటింది. లేకపోతే ఈఅక్క పక్షికి ఎడ్లపందాలేమిట్రా?

ఒకడు:- బాగాచెప్పావు! (పెద్దగానవ్వులు. జగన్నాధరావు

ముఖం ఎర్రపడి కోపంతో నిప్పులురాలుతున్నట్లుంటుంది ఆవేశంతో వెళ్లి రొప్పుతూ కుర్చీలో కూలబడతాడు, వయస్సు 49 సంవత్సరాలుంటాయి. నల్లగా, బొద్దుగా వుంటాడు. కోరమీసం? చేతిలో వెండిపన్నుకర్ర, క్రూరత్వం ముఖంలో ప్రతిఫలిస్తూ వుంటుంది. మెడకు చుట్టుకున్న కండువా? తీసికుర్చీమీద విసురుగా పడేసి జారగిల పడ్డాడు)

జగ:- (పెద్దగా) అమ్మాయ్. శ్యామలా! (పెద్దగా) శ్యామలా (కొద్దిసేపు ఆగి) ఎక్కడచచ్చావే!

శ్యామ:- (లోపలనుండి) ఆ...వస్తున్నా నాన్నా.

జగ:- (విసురుకుంటూ) వట్టిచేతులతో దేనికే? కాసిని మంచి నీళ్లు పట్టుకురా!

శ్యామ:- (లోపలనుండే) అలాగేనాన్నా. (యింతలో కామయ్య వస్తాడు. ఎత్తుగా బక్కపలచగా వుంటాడు. క్రాపు అంతకుముందే చేయించి నట్లున్నాడు. మీసాలు పూర్తిగా తీసివేశాడు. కట్టుపంచ శీలమండల వరకూ వుంది. లాల్చీ-చంకలో సన్నని ముల్లుకర్ర-మెల్లగా చీమ చావనట్లుగా నడుస్తాడు సన్నని పుగాకు చుట్ట చుట్టు కుంటూ నీటుగా వచ్చాడు.)

జగ:- రారా! కామయ్యా! రా!

కామ:- (ఒకసారి జగన్నాథరావుని చూచి నవ్వుతూ వెళ్లి కుర్చీలో కూర్చుంటాడు. ముల్లు కర్ర ప్రక్కన పెట్టి నిశ్శబ్దంగా)

జగ:- (కోపంతో) విన్నావట్రా! ఊళ్లో వాళ్ళు చేస్తున్న అల్లరి

కామః— (నెమ్మదిగా) విన్నాను. (చుట్ట వెలిగించుచూ)

జగః— వాళ్ళకు పట్టపగ్గాల్లేకుండా వున్నాయిరా?

కామః— ఎన్నాళ్ళేం? ఈగాడిదరువులకు అంతకంగారు పడతా వేం? నేననగూడదు. గాని, వాళ్ళు చేయ గలిగిందంతా చేశారు. యిక మన వంతు వచ్చింది.

జగ— (నిరుత్సాహంగా) మనం ఏం చేయగలంరా?

కామ— (విమల నవ్వు నవ్వి)పిట్ట మనచేతిలో పడిందిగా యిక ఈ శిఖండి చేత ఏదైనా ఆడిస్తాను.

జగ— ఏంచేస్తావురా? ఆ రంగారావుగాడు ఏం చేసిసస్తాడు? దరిద్రుడు. వాడికి మొన్న అనవసరంగా వెయ్యి రూపాయలు యిప్పించావు.

కామః— మొన్న వెయ్యి రూపాయలతో తృప్తి పడాల! యివ్వాళ మళ్ళా నాలుగు వందల కోసం వచ్చాడు.

జగః— ఎక్కడ పోసి పెట్టి వున్నాయి. ఈ గాడిదలకు అడిగి నప్పుడల్లా అంచివ్వడానికి! యిప్పటికి జరిగిన అప్రతిష్ట చాలకనా?

కామః— నేననగూడదుగాని ఆ అభిమానం నాకుమాత్రం లేదంటరా! మీకెందుకు నే చెప్పినట్లు చేయండి. వాడి నెత్తి వాడి చేతులతోనే పగలగొట్టిస్తాను.

జగః— ఏం పగలగొట్టిస్తావో? యిప్పటికే వూళ్ళో తలెత్తుకో లేక చస్తున్నాం, (యింతలో శ్యామల వచ్చింది మంచి నీళ్ళగ్లాసుతో జగన్నాధరావు మంచినీళ్ళు త్రాగుతుంటాడు. శ్యామల కామయ్యనుచూచి బెత్తురుపోయింది. కామయ్య ఎదో నిగూఢమైన నవ్వునవ్వాడు. శ్యామల

ప్రకృతితో లగిపోయింది. ఇంతలో రంగారావు బయట నుండి వచ్చాడు.

రంగా:- బాబాయి! కామయ్య బాబాయి!

కామ:- అదుగో వచ్చాడు. పిలవమంటరా?

జగ:- (పలుకడు. ఆలోచిస్తూవుంటాడు.)

కామ:- రా!రా! రంగారావు! రా! బయటనుంచున్నా వేంరా (రగారావు లోపలకొస్తాడు.)

జగ:- (కోపాన్ని దిగమ్రింగి) రావయ్యా రంగారావు. అలా పరాయివాడికిమల్లే బయట నిలబడ్డావేం!

కామ:- ఓరి పైవితక్కువ పెద్దమ్మా! నేననగూడదు గాని ఎట్లా బ్రతుకుతావురా? యింత సిగ్గయితే!

రంగా:- అదిగాదు బాబాయి (మధ్యలో)

కామ:- నీ అవస్థ నాకు మాత్రం తెలియదట్రా! (నవ్వి) నేనన గూడదుగాని నీదంతా నీ తాతా పోలికరా. మీ తాతమట్టుకు మీతాత. వెయ్యితరాలు మారినా ఒకడు ఆలాంటివాడు దొరుకుతాడ్రా! ఎం మర్యాదా! ఎంత వినయం, అరే! ఎదటి వాడికి నొప్పి తగలనిచ్చేవాడా!

జగ:- (విషపు నవ్వుతో) వాళ్ళ తాత గౌరవాన్ని రంగారావే నిలబెట్టాలి.

కామ:- (నవ్వి) బాగా జెప్పారు. ఈ ఊళ్ళో యిందరు కుర్రాళ్ళున్నారు. వాళ్ళలాగా అడ్డగాడిదల్లే ప్రతి దాంట్లో పెద్దరికం పుచ్చుకోగా మనం ఎప్పుడన్నా చూచామా! కలిగిన వరకు కలో గంజో త్రాగి వాడి పనేమిటో వాడేమిటో! నేననగూడదు గాని అసలు వీడంటూ

ఒకడు ఊళ్ళో వున్నాడని ఎవరన్నా ఎరుగుదురా?

జగ:- మంచి వాడనుపించుకోవటం కష్టం చెడు వాడనుపించు కోవటాని కేంరా! క్షణం సేపు వట్టదు.

రంగా:-(సిగ్గుపడుతూ) అదంతా యిప్పుడెందుకు బాబాయి.

కామ:-(నవ్వి) నీకక్కరలేకపోయినా మాకు కావాలి గదరా! నేననగూడదుగాని. మొన్న షాహుకారుగారు నువ్వు వెయ్యి రూపాయలు కావాలి అనగానే ఎందుకిచ్చా డురా! అదంతా నీ మంచితనమేరా! పెద్దమ్మా!

రంగా:-నేను వెళ్ళాలి బాబాయి త్వరగా!

కామ:-(నిట్టూర్చినట్లు నటించి) నేననగూడదుగాని నిక్షేపం లాంటి రైతుబిడ్డవు. నువ్వతిన్నంతతిని యితర్లకింత పెట్ట వలసినవాడవు నే చెప్పకూడదుకాని ఎంత ఆస్థివుంటే నేం ఎంత యోగ్యతా మంచితనం వుంటేనేం అనుభవించే దారిలేక పోయినాక.

జగ:- అదేంటయ్యా అలా అంటావు?

కామ:-(నిట్టూర్చి) ఏమైతేనేంలెండి! కడుపు చింపుకుంటే కాళ్ళ మీద పడుతుంది నేననగూడదు గాని నాకొడుకున్నాడు ఎన్నడన్నా "నాన్నా" అన్న పాపాన పోతాడండి వాణ్ణతగలెయ్యా! ఏమాటకామాటే చెప్పాలి నేను కనపడ్డానంటే బాబాయి, బాబాయి అంటూ వెనవేసుక తిరుగుతాడు.

జగ:- రంగారావుకు యిబ్బంది వచ్చిందంటే మొన్న వెయ్యి రూపాయలు నాప్రాణంతీసి పట్టుకెళ్లియిస్తివిగా.

రంగా:-ఆవేళ నా పరువు దక్కించావే బాబాయి,

కామః—మరింక మేము బ్రతికెందుకురా! నేననగూడదు గాని,
యివ్వాళమాత్రం దక్కించే వాణ్ణ గాదూ! కాని...
రంగాః—(ఆతృతగా) ఏం జరుగింది బాబాయి చెప్పు.
కామః—చెప్పటాని కేముందిరా! మొన్న నేను నీకుడబ్బు
యిప్పించి నట్లు మీనాన్నా అన్నయ్యవాళ్ళకు తెలిసింది.
రంగాః—ఎట్లా తెలిసింది?
జగః— అదే ఆశ్చర్యంగా వుంది.
కామః—నేననగూడదు గాని, మీనాన్న అన్న మా షాహు
కార్ని నన్నూ అడ్డమైన బూతులు కూశారట.
రంగాః—ఎవరి దగ్గరా!
జగః— ఎవరిదగ్గరైతేం! పిల్లనిచ్చినా్నడబ్బిచ్చినా్న పగకొని తెచ్చు
కోమన్నారు. అంతటితో ఆగారా! ఎన్నిమాటలన్నారు.
ఛీ. ఛీ. పోనివ్వండి ఎవరి కర్మవాళ్ళది.
కామః—నీకు ఆస్థిలో దమ్మిడీ భాగం లేదట?
రంగాః—ఎవరంటారు, (కోపంగా) ఆమాట!
కామః—నేననగూడదు గాని, ఎవరో అంటే మనకు ఈచింతెందు
కురా. మీనాన్నే అన్నాడట! నాకు తెలియకడుగు
తాను, యిక్కడ పొలం అమ్మి అక్కడ కొనంగానే
స్వార్జితం అవుతుందట్రా?
రంగాః—(ఉద్రేకంతో) యిదంతా తన స్వార్జితం అయితే మా
తాత సంపాదించిన ఎనిమిదెకరాల కొంద్రేమయింది?
కామః—(నవ్వి) నన్నడుగుతావేరా! తెలివి తక్కువ సన్యాసి.
నేననగూడదుగాని, నీకంత ధైర్యం వుంటే ఈఅప్పులూ
సప్పులూ చెయ్యటం దేనికి? కాస్త గుట్టుగా బ్రతికే

పాపాలుకార్ని నన్నూ బూతులు కూయించటం దేనికిరా?
అంతమందికి వుండగా నీకు లేకపోయిందా?

జగ:- అలా చేస్తే ఎవ్వరికి ఏ భాధావుండదు, అలా చెయ్య రాదటయ్యా రంగాతావు?

రంగా:-చేయటానికేంగాని... అంతమంది గుంపు ఇంట్లో తినే వాళ్ళుండటం వలన యే సంవత్సరం అవేజు ఆసంవత్స రం ఇంటిక్రిందే సరిపోతుంది.

కామ:-(నెమ్మదిగా) అదేంట్రా సన్యాసి, అట్లామాట్లాడుతావు మీనాన్న పదివేల రూపాయలు నిలువచేసి నట్లుగా నాకు తెలుసు, నేననగూడదు గాని, మొన్నమీచెల్లి లికి వెయ్యి రూపాయలు పెట్టి చంద్రహారం చేయించా డట కదరా?

రంగా:-ఏమో నాకేం తెలుసే బాబాయి.

జగ:- అవన్నీ ఆ అబ్బాయి నడిగితే అతనేం చెప్పతాడు? (నవ్వుతాడు)

కామ:-ఓరి పెద్దమ్మా! యింట్లో ఏం జరుగుతుందో తెలియక పోతే నువ్వెందుకురా! అక్కడ

జగ:- (నవ్వి) ఎక్కడన్నా ఒకమ్మాయిని చూచి పెళ్లి చేయి. అప్పుడే అన్ని ఆరాలు తీస్తూ యింటిపట్టున వుంటాడు.

కామ:-అంతవరదాకా ఆ ఆస్థివుంటుందా అని? నేననగూడదు గాని నాకు నమ్మకం లేదు?

జగ:- అదేమిటయ్యా? కాస్తా, కూస్తా పదెకరాల కొండ్రా! నిక్షేపంలాంటి భూమి, ఎకరానికి 25 బస్తాల వరకూ పండే మాగానయ్యే, ఎందరు తింటే తరుగుతుంది?

కామ:- నేననగూడదుగాని, నాకు తెలిసినంతవరకు వీళ్ళనాన్న పెట్టే ఖర్చు చూస్తే నాకు గుండె పగిలి చస్తానేమో, ననిపిస్తుంది

జగ:- వాళ్ళింట్లో అంత విపరీతపు ఖర్చులేమున్నవి?

కామ:-వీడి బావకు అయిదారు వేలు పోసి పట్నంలో చదువు చెప్పించాడా? ఆదిశూద్ర మాలిన బిడ్డలకోసం సంవత్సరానికి రెండు వేలు ఖర్చు పెడుతున్నాడా! మన మంతా చెప్పినా వినకుండా కూతురు అయిదు రోజులు పెళ్ళి చేశాడా? అల్లుడికి కట్నంక్రింద రెండెకరాల నిక్షేపం లాంటి మాగాని చదివించాడా? వీడి బావ ఊరిని ఉద్ధరించటానికని అడిగితే మొన్న ఆరువందలు గ్రామ పునరుద్ధరణకని దానం చేశాడా? ఎక్కడనుండి వస్తాయ్యండి మనమేమన్న జమిందార్లమా! నే ననగూడదుగాని నువ్వు ఎట్లా బ్రతుకుతావురా పెద్దమ్మా!

భీము:- (వస్తూ) ఏదండి ఈయన బతికేది; ఈయనబదకాలన్నా ఆళ్లు బతకనీయొద్దండి. (భీముడి వయస్సు 36 సంవత్సరాలు. నల్లగా తుమ్మమొద్దల్లే వుంటాడు. మట్టగోచీ, చేతిలో కట్లకర్ర. కోరమీసాలు. భయంకరంగా వుంటాడు)

కామ;- నువ్వు యిట్లా యిల్లూ వాకిలీ అనకుండా ఊరివెంట తిరిగితే ఎట్లారా? నేననగూడదుగానీ. రేవు పెళ్ళయి పిల్లా జెల్లా వుడితే వాళ్ళకు ఎక్కడ తెచ్చి పెడతావురా

భీము:- ఏదండి ఈయన పెట్టేది? యీయనగారికి తింటానికుంటేనా పెళ్లానికి పెట్టటానికి?

జగ:- మీరంతా జేరి ఆ అబ్బాయిని అట్లా వేధిస్తే అతనేం చేస్తాడు?

కామ:- (నవ్వి) నేననగూడదుగాని, వాడిని చెడిపోమని చెపుతున్నామా? బాగుపడమంటున్నాం.

భీము:- మీరు లక్ష చెప్పండి. ఈయనగారు వాళ్లమాటినడని. వాళ్లకు కడుపుమంట.

రంగా:- (కోపంతో) వాళ్లమాటే వినాలి. ఎందుకూ ఈ చేస్తున్న ముండమొపి పని చాలకనా?

కామ:- నాకు తెలయకడుగుతాను యింతపెద్ద షాహుకారు ఒక్క దమ్మిడి ఖర్చు పెట్టడే. మీనాన్నేం దానకర్ణుడా ఊళ్లో చదువుకునే బళ్లకూ, సన్యాసుల మఠాలకూ ధారాపాతంగా ఈ రోజుల్లో డబ్బు విరాళాలు పార వేయటానికి? నేననగూడదుగాని, యిప్పుడు నీ చెల్లెలికి చంద్రహారా లెందుకురా? షాహుకారు లాంటివాడు కన్న కూతురుకు ముక్కు పుడుక చేయించటానికి ముందూ వెనకా ఆడుతున్నాడే. యిద్దరు రామలక్ష్మణుల్లాంటి కొడుకులుంటే నాలుగు చదువు ముక్కలు నేర్పించడం పోని, ఎక్కడో చెల్లెలు కొడుక్కు ఆరువేలు పోసి చదివించాడు- యింక ఎమిట్రా మీ నాన్న మిమ్మల్ని బాగుచేసేది?

జగ:- ఆ ఆస్థి నరసయ్య స్వార్జితం. అది అత నెలా తగలవేసుకోటానికైనా హక్కుంది.

కామ:- నీకు యింకా అప్పు కావాలంటావు? ఎవరిస్తారూ? ఎందుకిస్తారూ? ఎలాయిస్తారూ? నాకు తెలియకడుగు

తాను. నేననగూడదు గాని, నీకు ఆస్థి లేకపోతే నువ్వు యెట్లా తీరుస్తావురా?

రంగా:- బాబాయి నువ్వూ అలా పొరబడతావేం? నీకు తెలుసుగా? యిది మా తండ్రి ఆస్తో, మా తాత ఆస్తో,

భీము:- అయనికి తెలిస్తే ఆర్చేవాడా? తీర్చేవాడా? కందకు లేని దురద చామకా?

కామ:- ఓరేయ్ అబ్బాయి నేననగూడదు గాని, అసలు నీకు ముందు ఆస్థిలోభాగం వుందో? లేదో తేల్చుకోరా?

రంగా:- (ఉద్రేకంగా) చూస్తావుగా బాబాయి. రేపీపాటికల్లా వాళ్ళంతు తేలుస్తాను.

జగ:- తొందరపడితే పనులవుతయ్యా రంగారావు.

భీము:- దీపం వుండగానే యిల్లుచక్కబెట్టుకోవాలి. దీపం ఆరిం తరువాతేముంటుందండి అదంతా ఈపిచ్చిమారాజుకేం తెలుసుదండీ. ఏదోఏలకు యింత తిండి తిని తిరిగే ఆయనకి.

రంగా:- వస్తా బాబాయి. వస్తా (వెళ్ళాడు రివ్వున)

కామ:- ఒరేయ్ రంగారావు. మీ నాన్నా, నే ఓకప్పుడు బాగా బ్రతికాం. మమ్మల్ని బజారుపాలు చెయ్యకురా బాబూ?

భీము: దూదిలో నిప్పు పడ్డాక దూలాని కంటుకోకుండా వుంటుందా? నేననగూడదు గాని, (అంతా విరగబడి నవ్వుతారు)

జగ:- ఏం ఎత్తు వేశావయ్యా?

భీము:- తల్లిముండమొయ్యా? ఆయన అట్టుండాడనా చూత్తా

నికి. నొప్పిలేకుండా బతికుండాళ్ల గుడ్లు దీసే బాపతు కాదండి.

కామః— అఘోరించావు లేరా? అక్కుపక్షి వెధవ. వాడు కొండకు చచ్చేటప్పుడు ఎం జెప్పాను!

జగః— ఏం జెప్పారు?

భీముః— ఏం జెప్పారేంది! ఆ వాగులో దిగబోయేటప్పుడు బండి కష్టంపెట్టి బోల్తా కొట్టించమన్నారు.

కామః— మరి ఆ పని చేశారంట్రా? నేనన గూడదుగానిచేశారా అంట?

భీముః— ఎట్లా జేయమంటారండీ? మెము బళ్లు గట్టేసరికే ఆయన ఊరుదాటి పోయె.

కామః— మిణికారు లేరా? అడ్డగాడిదల్లే అడ్డెడు బియ్యపు కూడు తినటం తప్ప మీకు ఆవగింజంత తెలివి చచ్చిందిరా!

జగః— వీళ్లేక్కడింటారయ్యా మనమాట. మనుషులు చూడ బోతే ఆకలి దప్పిక తేరేటట్లుంటారు.

భీముః—(కోపంతో) ఒక్కడుగులో పోయింది, ఈసారి గుండె లుంటే రమ్మనండి, బరిమీదకి, మీసంగల మొగాళ్లైతే?

కామః—వెధవ మీసం, మీసాలకేమి లోవోయ్, నేననగూడిదు గాని, రొయ్యకు లేదూ తెగ బారెడు మీసం.

జగః— (నవ్వాడు)

భీముః— (చిన్నబుచ్చుకొని) కామయ్యగారు? మీ కైయిత్తం నాదగ్గర చెప్పమాకండి రోషం తక్కువ మాటలు చెవుతా రేంది? నా బొందిలో ఊపిరుండగా ఆ చంద్రం గోరిని ఏడు చెరువులు నీళ్ళు తాగించకపోతే నా పేరు

భీమన్న గాదు.

కామ:-ఈపేరుల కేంలేవోయ్, మేకపోతు గాంభీర్యం, అంతపర కెందుకురా! నేననగూడదుగాని, (నెమ్మదిగా) ఏదీ ఈ రాత్రి చూపించు నీ ప్రతాపం.

భీము:-(మీసందువ్వి) ఏం జేయమంటారు?

కామ:-నేననగూడదుగాని, ఆ నరసయ్య ఎడ్లకు మందు పెట్టి చంపిరా తెలుస్తుంది నీపస.

జగ:- భలే! భలే ప్లాను వేశావయ్యా, (సంతోషంతో) ఊఁ కానియ్యరా! అదిచేస్తే తగినంతబహుమానం తెలిసిందా!

భీము:-సరే! కానియ్యండి, యింత బతుకు బతికి యిటెనకాల జావమని, ఈ రాత్రి జూపిస్తా నా తడాఖా!

జగ:- నీ దెబ్బకు తిరుగేముందోయ్.

కామ:-ఏనుగంత మనిషివి, కాని బుద్ధిమాత్రం యాంగానీఖరీదు లేదురా! నేననగూడదుగాని, పొరపాటున వాడికి దొరి కావా! వళ్లీ పునర్జన్మకూడా వుండదు!

భీము:- యియ్యాల జత్తే రేపటికి రెండు! వుండేం ఊఁళ్ళేలు తున్నాం యేంది! ఆమాలకొండదగ్గర జరిగినపరాభవానికి కత్తెట్టుకుని పొడుచుకు చచ్చేవాణ్ణే! ఎందుకు బతికా నంటారండి? సమయం వస్తే చిన్నప్పుడు తాగిన దొం. డాకు పసరుగూడా బయటి కెల్లాలనే!

కామ:-అదీ చూస్తానుకదరా, నేననగూడదుగాని, ఏమంటా రండీ షావుకారుగారూ!

జగ:- ఊఁ.... కానియ్యండయ్యా! మీ దెబ్బకు తిరు గేముంది! కామయ్యచెప్పినట్టు కానియ్యరా! గొంగలి పురు

గుల్లా నలిగిపోవాలి, అసరసయ్య కుటుంబం కాస్తా (పరీక్షగా జూస్తూ) అదంతా మన భీముడి శక్తిమీద ఆధారపడి వుంది.

భీము:— చూత్తారుగా దొరా? భీముడంటే వట్టి పిరికి నాయా లనుకున్నారేమో? (గంభీరంపోజు పెట్టాడు)

కామ:— (నవ్వి) ఎవరన్నార్రా! నీ తాతను నేనెరుగుదును. నీ తండ్రిని, నీ పిన్నబ్బల్ని నేనెరుగుదును. వాళ్ళెంత విశ్వాస పాత్రలూ, ఎంత ధైర్యంకలవాళ్లు! ఒకసారి ఊళ్ళోవాళ్ళు మీ పిన్నబ్బలమీద తిరగ బడ్డారు. వాళ్ళయిదుగురూ కర్రలు తీసుకొని వీధిలోకొచ్చి నిల బడితే ఊళ్లో యిన్ని వేలమంది జనం కుక్కిన పేనుల్లే యిళ్ళల్లో దూరి ఊరుకున్నారనుకో! నేననగూడదుగాని, వాళ్ళు పంచపాండవుల్లా వుండేవాళ్లురా! నువ్వుమాత్రం వాళ్ళకు వారసుడవు కావట్రా? సరే. నువ్వు రాత్రి ప్రొద్దు పోయిన తరువాతలా తెలిసిందా?

భీము:— చిత్తం తెలిసిందండి దొరా!

జగ:— యిదుగో ఈ రెండు రూపాయలూ పట్టుకెళ్లి కాశినినీళ్లు గూడా పుచ్చుకో.

కామ:— (నవ్వి) వట్టి సారా త్రాగితేనే ధైర్యం వుంటుందం టూరా? ఒక కోడిపెట్టనుగూడ తింటే యిక ఆడుగుతా వీడి ప్రతాపం. నేననగూడదుగాని, యివన్నీపుచ్చు కొని ఏ కొంపలోనన్నా దూరేవు?

భీము:— (అంతా నవ్వుతారు,) కామందుగారి క్షేత్రం మా బాగా వుంటుందడి.

జగ;- యిదుగో ఈ రెండుగూడా తీసుకెళ్లు (యిచ్చాడు)
భీము:- చిత్తం (తీసుకుంటాడు)
కామ:- యిదుగోరోయ్. వట్టి గరుడపక్షిలాగా తిరిగి రావటం గాదు. పని కావాలి తెలిసిందా?
భీము:- చిత్తం. చూస్తారుగా!
జగ:- యిక వెళ్ళి పెందలలాడేరా? (వెళ్ళాడువర్జాగా యిద్దరూ నవ్వుకున్నారు. యింతలో శ్యామల బయటికి వచ్చి మంచినీళ్ళగ్లాసు తీసుకెల్తుతుంది. కామయ్య శ్యామల వంక తీవ్రంగా చూస్తాడు. శ్యామల తల వంచుకొని వెళ్లిపోతుంది. జగన్నాధరావు ఆశ్చర్యంగా చూస్తాడు)
జగ:- (అనుమానంగా) ఏమిట్రా కామయ్యా అట్లాచూస్తావు?
కామ:- ఆ...ఏమీలేదు. అమ్మాయి శ్యామలను గురించే నా ఆలోచన.
జగ:- అమ్మాయిని గురించి యింతగా ఆలోచించ వలసిం దేముంది?
కామ:- నేననగూడదుగాని, అమ్మాయి విషయంలో మీరు కాస్త జాగ్రత్త తీసుకోవాలండీ. ఎంతచెడ్డా నీ కుటుం బానికి, నరసయ్య కుటుంబానికి శత సహస్రం తేడా వుందా? మీ అంతస్థు ఎక్కడా! వాళ్ల అంతస్థు ఎక్కడా? అమ్మా వాడు గుండెలు తీసిన బంటండీ.
జగ:- (అర్థంకాక) ఎవడువాడు? ఏమిటి? చెప్పరాదటయ్యా అట్లా గ్రుడ్లప్పగించి చూస్తావు.
కామ:- నేననగూడదుగాని, చూడకుండా ఎలా చెప్పటం. అమ్మాయి ఆనరసయ్య కోడలు కాబోతుందనేవిన్నాను

జగ:- కామయ్యా (కోపంతో)

కామ:- నాకు తెలుసు. తమరి అభిమానం అందుకే చెప్పుతున్నాను. అమ్మాయిని నరసయ్యగారింటికి వెళ్ల నీయకండి.

జగ:- వాళ్లింటికి మా అమ్మాయి దేనికి వెళుతుంది!

కామ:- యింకా దేనికి వెళుతుంది? ఏదో ఆ నరసయ్యా కూతురు సుశీల స్నేహంకోసం వెళుతున్నట్లుంది. (వ్యంగ్యంగా)

జగ:- యిప్పుడదీ లేదుగా?

కామ:- లేకపోవట మేమిటి? నేననగూడదుగాని, ఈ పాపిష్టి కళ్లతో చూచాను. పోనీ. పోతేపోయింది. ఆ కార్పా గ్యాడితో సరసా లేమిటి,

జగ:- (కోపం పట్టలేక) ఎవడితో?

కామ:- ఆ చంద్రంగాడితోనే! నేననగూడదుగాని, ఈ కామయ్య దాపరికం లేనివాడు. కావాలంటే అమ్మాయినే అడగండి!

జగ:- (ఆవేశంతో) నిజంగానా?

కామ:- అబద్ధం ఆడవలసిన పనేముంది?

జగ:- (కోపంతో) అలాగా! (రివ్వున లేచి) శ్యామలా?(పెద్దగా) ఎక్కడ జచ్చావే?

శ్యామ:- ఆ...వస్తూన్నా నాన్నా. (త్వరగావచ్చింది)

జగ:- నిన్నవ్వు ఆ నరసయ్యగాడింటికి కెల్లావా?

శ్యామ:- (భయపడిపోయింది)

కామ:- (నవ్వుతూ) చెప్పమ్మా? నాన్నఅడుగుతుంటే దాస్తావెందుకూ?

జగ:- చెప్పవేమే? అలా దయ్యం పట్టిన దానిలాచూస్తావేం! (కోపంతో లేచాడు)

కామ:- మన యింటి వ్యవహారాలు తెలిస్తే అమ్మాయిమాత్రం వెళుతుందా? నీ అవమానం అమ్మాయికి మాత్రం అవమానంకదూ? నేననగూడదుగాని, యింక చిన్న తనం పాపం.

జగ:- (కోపంతో) నీ సోది ఆపవయ్యా! ఏ మే వెల్లావా!

శ్యామ:- (కన్నీళ్ళు తుడుచుకుంటూ) వెల్లాను.

జగ:- వెల్లావా? ఎందుకెళ్లేవే? ఒసి నిన్ను తగలెయ్యా? నా పరువు తీశావుకదే? నాకడుపున చెడబుట్టావుకదే? (కోపంతో) ఎవరెళ్ళమన్నారు?

కామ:- నేననగూడదుగాని వెళితే వెల్లావుకాని నువ్వు ఆ చంద్రంతో మాట్లాడటం దేనికమ్మా! నువ్వుచిన్నపిల్లవు కాదుగదా! పెళ్ళి కావలసినదానవు. అదేమన్నా, ఆలోచించా?

జగ:- (పళ్లునూరుతూ) ఆ చంద్రంగాడితో మాట్లాడావా?

శ్యామ:- (భయంతో) మాట్లాడాను!

జగ:- (అదరిపడి) మాట్లాడావా? ఒసి దిక్కుమాలినముండా! ఛీ. నీజన్మ తగలెయ్యా!

కామ:- నేను చెప్పకూడదుగాని, యింకా పెద్దవాళ్ళం మేము బతికేవున్నామా? డబ్బు, దర్పం, అంతస్థులూ-బేధం వుండనే వున్నయ్యా? నాన్న వుండగానే పెళ్లి గాక ముందేనువ్వు ఆ చంద్రాన్ని ప్రేమించటమేమిటమ్మా?

శ్యామ:- తప్పేముంది?

జగ:- (చెంపపగిలేటట్లు కొట్టాడు) తప్పులేదూ? ఎంత తెగించావే! యివ్వాళ నిన్ను నరికిపోగులేస్తాను.

కామ:- (నవ్వి) నువ్వు ప్రేమించటమేమిటమ్మాయి, యింక పదహారేళ్ళన్నా నిండలేదు నేను నమ్మలేను. వాడు నిన్ను మోసంచేశాడు. నేననగూడదుగాని నువ్వు ఆ మోసంలో పడ్డావు.

జగ:- ఇంకా ఎందుకు బ్రతికావే? దిక్కుమాలినముండా! పద. లోపలికి పద. నువ్వు నాచేతిలో యివ్వాళ చచ్చావులే పద.

కామ:- (అడ్డమెళ్ళాడు. జగన్నాధరావు నెట్టిపారవేస్తాడు.) యిదుగో షాహుకారుగారు. నామాట వినండి. చిన్న పిల్ల. ఈసారికి విడిచిపెట్టండి నేననగూడదుగాని అమ్మాయి తప్పేముంది? ఆదుర్మార్గుడే మోసంచేశాడు లేకపోతే ఈ యీడుకు ప్రేమేమిటి? పత్తి ప్రేమిటియింత వరకు ఆ ప్రేమేమిటో నాకు తెలిసిచావలేదు.

శ్యామ:- నానా...నాన్నా...

జగ:- నాన్నా (పళ్ళుకొరకి) రా! లోపలికిరా! (బటబటాలోపలకు లాక్కువెళతాడు. లోపల శ్యామల ఏడుపులు జగన్నాధరావుకొట్టిన దెబ్బలూ, ఆవేశపడటం వినిపిస్తుంది) యికవెళ్ళవుగా? నిన్ను తవ్విపాతేస్తాను. జాగ్రత్తా!

శ్యామ:- వెళ్ళను, వెళ్ళను నాన్నా. అమ్మో! నాన్నా! చంపకు చంపకునాన్నా! (కామయ్య పెద్దగా నవ్వుతూ బయిటకు వెళుతుంటాడు.

(తెర)

# రైతుబిడ్డలు

## మహాడపరంగం

-:[ తెర ]:-

సీను:- (అది నరసయ్యగారిల్లు అంతా వెనుకటి సీనే సుశీల బయటనుండి ఆందోళనగా ఏడుపు ముఖంతో వస్తుంది. చంద్రంలోపలనుండి బయటకు వెళ్ళిపోతుంటాడు.)

సుశీ:- అన్నయ్యా! మొన్నరాత్రే! (ఆగిపోతుంది)

చంద్రం:- ఊ...ఏమైయింది?

సుశీ:- శ్యామలను వాళ్లనాన్న కొట్టాడట?

చంద్రం:- దేః!?

సుశీ:- మనయింటికివచ్చిందని చానచితక కొట్టాడట! పాపం! తల పగిలిందట! నిన్నల్లా అన్నంతినలేదట. (కన్నీళు తుడుచుకొంది.)

చంద్రం:- హు. అలాగా? (నిట్టూర్చాడు బరువుగా)

సుశీ:- యికనెప్పటికీ మనయింటికి వెళ్ళొద్దన్నాడటన్నయ్యా! (దిగులుగా)

చంద్రం:- సరే! (బాధగా బయటకు వెళ్ళిపోయాడు. సుశీల లోపలకు వెళ్లిపోయింది. నరసయ్య లోపలనుండివచ్చి మంచంవాల్చుకొనికూర్చున్నాడు. ఇంతలో రాఘవయ్య వచ్చాడు. చుట్టకాలుస్తు)

రాఘు:- వంట్లో ఎలావుందే నరసయ్యన్నా!

నర:- యివ్వాళ కాస్త కులాసాగానేవుందిరా! రాత్రి కాస్త జ్వరంతగిలిందిగాని, వెంటనే తగ్గిపోయింది.

రాఘు:- ఈ సంవత్సరం ఏయింట్లోచూచినా ఒకటే రోగాలే

నరసయ్యన్నా! ఏం జ్వరాలేయివి. వట్టి విషజ్వరాలై
పోయినై.

నర:- గాలిపాటె సరిగాలేద్దన్నాడు. రాత్రి వైద్యుడు!

రాఘు:- అదిసరేగాని, రాత్రిఏమిటీ దొడ్లోగోల జరిగిందట?

నర:- ఆ...ఏముందిరా! నేను పన్నెండుగంటలప్పుడు గొడ్లకు మేతవెయ్యటానికని చావట్లోకెళ్లాను. ఇంకా నెలగూక లేదు. గొడ్లకు మేత వేస్తున్నాను. మా ఎడ్లగాట్లో ఎవడో పడుకోనివున్నాడు. ఎడ్లు బుసలుకొడుతున్నయ్ నేను ఏమిటోనని దగ్గరకెళ్లితినగదా, యింకేముంది? ఎవడో తుమ్మమొద్దల్లేవున్నాడు. నన్ను అమాంతంగా పడనెట్టి పారిపోయాడు.

రాఘు:- చేతిలో కర్ర లేదు?

నర:- చావిట్లోకంటా తీసుకువెళ్లి అక్కడ గోడకానించాను. చేతిలోవుంటే ఒక్కదెబ్బకు పండుకోబెట్టేవాడినే!

రాఘు:- అసలు వాడెందుకుకొచ్చి నట్లంటావు?

నర:- ఆ...ఎందుకొస్తాడురా! దొడ్లో ఎప్పుడూ ఏదో ఒకటి పోతూనే వుంటుందా? వాడేదో యెత్తుకెళ్లటానికేవచ్చి వుంటాడు

రాఘు:- ఓరి వాడితల్లీసిగ్గొయ్యా? యింతకూ యేమీం పోలేదు కదా?

నర:- యేమీ పోలేదు.

రాఘు:- నాకప్పుడే నిద్రపడుతుంది. నిన్నల్లా ఆగరువుదెబ్బదున్ని వచ్చేటప్పటికే వల్లంతా పులిసిందేమో? యెంతకూ నిద్రపట్టలా! నివ్వు అరిచేటప్పటికి నాకు మతిపోయిం

దనుకో! యింతకూ తల్లిశిగతరగ వాడిరోజులు బాగుండి పోయినైలే! (సత్యంవచ్చాడు)

సత్యం:- మామయ్యా నిన్ను కరణంగారు రమ్మన్నారు.

నర:- యెక్కడున్నాడురా?

సత్యం:- ఇప్పుడే యింటికి వెల్లాడు.

రాఘు:- దేనికే నరసయ్యన్నా?

నర:- అదేరా: ఆ తాళ్లతోపుదగ్గర ఖాలీస్థలం అమ్మానుగా? అది కొలిపించాలి,

రాఘు;- నేనూ ఆ మాదిగ వెంకడింటికి వెళ్లిరావాలిపద. వాడి తల్లిశిగ్గోయ్యా! పదిరోజులనాడు బండి పట్టెల్లుయిస్తే యింతవరకూ యిప్పడే నరసయ్యన్నా!

[ఇద్దరూ లేచారు వెళ్లటానికి. సత్యం లోపలికి వెళ్లి పోయాడు. బయటనుండి రంగారావు వచ్చాడు. ముఖం ఎర్రబడివుంది. రంగారావుని చూడగనే న ర స య్య ముఖం ప్రక్కకు త్రిప్పుకున్నాడు. రంగారావు కోపంతో]

రంగా:- యిదిగో! రాఘువయ్య బాబాయి. ఒక మాటాగు

రాఘు:- (ఆగి) ఏమిట్రా: రంగారావు

నర:- రారా వెళదాం!

రంగా:- కాదులే! వుండు బాబాయి.

రాఘు:- దేనికిరా?

రంగా:- నాకొక నాలుగొందల రూపాయలు కావాలి. ఇస్తాడో లేదో అడుగు.

నర:- (పోతున్నవాడల్లా ఆగి కోపంతో చూస్తాడు)

రంగా:- అడగవే బాబాయి. నాకు అర్జంటుగా కావాలి.

రాఘు:— దేనికిరా? నాతో చెప్పగూడదూ!

రంగా:— అది తరువాత చెప్తాగా!

రాఘు:— ఏం, నరసయ్యన్నా.

నర:— ఎవడిదగ్గరున్నయిరా! నాలుగొందలు. నాదగ్గరలేవు యిప్పుడు.

రంగా:— (కోపంతో) అందరికీ యివ్వటానికి వుండగాలేంది. నాకివ్వటానికి వుండవేం? బాబాయి.

రాఘు:— అది నన్నడుగుతావేంరా! దగ్గరున్నాడుగా, మీనాన్ననే అడగరాదూ!

రంగా:— ఎవరినడిగితేం నేం?

నర:— నాదగ్గర చిల్లిదమ్మిడీ లేదని చెప్పరా!

రంగా:— నాకవసరంగా కావాలని చెప్పు బాబాయి.

రాఘు:— (బిత్తరపోతాడు)

రంగా:— అలా చూస్తావేమిటి బాబాయి. యివ్వాళ నాలుగొందల రూపాయలివ్వకపోతే బాగుండదు.

నర:— ఒక్కదమ్మిడి నాదగ్గర తీసుకోలేదని చెప్పరా! (ఉద్రేకంగా)

రాఘు:— ఏమిట్రా రంగారావు! ఏమిటిది?

రంగా:— యిదంతా యెందుకు బాబాయి. నా ఆస్తి మర్యాదగా నాకు పంచమను !

నర:— (కోపంతో) ఈ ముండ సంపాదించిందివుంటే పంచు కెళ్ళమనురా!

రాఘు:— నరసయన్నా! నువ్వు తొందరపడతావేం! ఒరేయ్ రంగారావు. దేనికిరా యీ అల్లరి. నలుగురూ వింటే

ఏమంటావ్రా?

రంగా:- ఎవరోవింటారని ఊరుకోబట్టే యిలా అయింది.

రాఘు:- ఏమయిందిరా?

నర:- (రోషంతో) బెదరిస్తాడ్రటా? బెదరించి నాదగ్గర ఒక్క చిల్లిదమ్మిడి తీసుకుంటాడా? సిగ్గూసెరం లేకుండా అడ్డ గాడిదల్లే ఊరిమీదతిరిగి, చెడుస్నేహాలు పట్టింది చాలక బెదరిస్తాడు? ఒరేయ్ రాఘువయ్యా! వాడసలు నాకుపుట్ట లేదనుకన్నాను. మానమర్యాదలు పోయిన తర్వాత వీడి జన్మ తగలెయ్యా చచ్చేం బ్రతికేంరా!

రంగా:- (కోపంగా) ఈ వాగుడంతా నాకనవసరం నాకు కావలసిందల్లా డబ్బు, లేకపోతే నాభాగం ఆస్తి నాకు పంచమను. అంతే! యివ్వాళతో ఆటో యిటో తేలాలి.

రాఘు:- నా మాట వినరా! రంగారావు

రంగా:- నన్ను దేనికి బలవంతంపెడతా బాబాయి. యిక యీ ముండమోపికొంపలో ఒక్కక్షణంవుండను.

నర:- అసలు వుండమని ఏడ్చిందెవ్రరా? వెళ్ళమను. యిక మన ముఖం వాడికీ, వాడిముఖం మనకూ చూపెంచ వద్దని చెప్పు!

రంగా:- యిలాంటి పాపిష్టిముఖాలు చూడాలని యేడ్చిందెవ రూ? నా ఆస్తి నాకు పంచమను.

నర:- నాగొంతులో ఊపిరుండగా ఒక్కదమ్మిడీ పంచను.

రంగా:- అట్టాగా! నీఅంతు తేలుస్తాను.

నర:- ఎమిటాా్రిముండా? నువ్వుచేసేది! నువ్వుచచ్చి పిడికెడు బూడిదైనా ఒక్కఎకరిసి యాగాని యివ్వను. పో! నా

యింట్లో నుండి

రంగా:- (కోపంతో) నీయిల్లూ!

రాఘు:- రంగారావు! నలుగురూ వింటార్రా! ఊరుకోరా! నరసయ్యన్నా!......

రంగా:- మా బ్రతుకు నలుగురూ ఏనాడో విన్నారు. (యింతలో సుశీలా, సత్యం వస్తారు.)

సుశీ:- ఏమిటన్నయ్యా యిది? నాన్నకసలే ఒంట్లో బాగుండ లేదు. ఆయన మనస్సుని దేనికి అట్లా పాడుచేస్తావు?

రంగా:- (వ్యంగ్యంగా) ఔను, ఆయన ఆరోగ్యం చెడిపోతే నాకు చంద్రహారాలు చేయించడనా, పట్టుబట్టలు పెట్టడా?

సుశీ:- యిప్పుడు నిన్ను కాదని నేనేంటంటున్నాను.

నర:- అమ్మాయి నువ్వు యింట్లో కెళ్ళమ్మా!

రాఘు:- నువ్వు ఊరుకోమ్మాయి.

సుశీ:- (విచారంగా) అదికాదు బాబాయి. నాన్న నాకు చంద్రహారం చేయించాడనేగా అన్నాయికికోపం? (మెడలో నుండితీసి) యిదిగో కావాలంటే తీసుకువెళ్ళి అమ్ముకోండి!

నర:- నువ్వెందుకే ఏడుస్తావు? నాకిష్టమైంది. నేను చేయించాను. ఈమధ్యుండసంపాదించింది నేనేంఖర్చుపెట్టలేదు.

రంగా:- వింటునే వున్నావుగా బాబాయి.

సత్యం:- బావా! నామాటవిను.

రంగా:- విన్నాంలేవోయ్, పెద్దన్యాయస్తుడివి. బయలుదేరావు. చేసుకున్న పెళ్ళానికి తిండిపెట్టలేక కొంపలమ్మేట పూటకూళ్ళు తింటున్నాడూ? ఈయనగారు ఊరుని ఉద్ధరి

స్తాడట?

సుశీ:— (కోపంతో) అన్నయ్యా!

సత్యం:— (అవమానంగా) సుశీ! అదేంలాభంలేదు ఊరుకో! తప్పంతానాదే! వాళ్ళనని ప్రయోజంలేదు. యింతవరకూ వాళ్ళ అభిమానంతో యిక్కడుంటున్నామనుకున్నాం. కాని వాళ్ళకు కష్టంకలిగించేవిధంగా మనం యిక్కడెందుకుండాలి?

నర:— సత్యం

రాఘు:— చదువుకున్నవాడివి నువ్వుగూడా అలా తొందరపడితే ఎలాగురా సత్యం?

సత్యం:— పరిస్థితులు మనల్ని దాటిపోయినాకగూడా యింకా తొందరపడవద్దంటావేం? మామయ్యా!

సుశీ:— (ఏడుస్తూ) మాకుమాత్రం చీమూ నెత్తురూ లేవా? బాబాయి. ఆడపిల్లకు అత్తవారిల్లే పుట్టిల్లంటారందుకనే, అన్నయ్యా! నీదేమీతప్పులేదు. అంతా మాదే తప్పు, నీకు కోపంవస్తుందనుకుంటే ఏనాడో వెళ్ళిపోయేవాళ్ళం? నీతోపాటు నేను మగవుటుకపుడితే నువ్వు యిలా అనగలవా! నేనూ ఆస్తిలోసగం పంచుకొనేదాన్నేగా? రెండుపూటలు తింటానికే నోచుకోలేక పోయాను.

రంగా:— యిదేం ధర్మసత్రంగాదు. మీరంతా సంవత్సరాల తరబడి తింటానికి, యిదిగో రాఘువయ్య బాబాయి. నేను నిజంగానే చెపుతున్నాను. ఈభాగాలపంపిణీ తెగే వరకూ, ఈ యింట్లో వుంటానికిగాని, తింటానికిగాని,

ఎవ్వరికి అధికారంలేదు. జాగ్రత్త! మళ్ళిచెప్పుతున్నాను ఇది నాయిల్లు యిందులో నాకు భా గ ం వుం ది. ఈ దెబ్బతో చావో, బ్రతుకో తేలాలి, యికనుండీ ఎవరి దారి వాళ్ళుచూచుకోనటం మంచిది. (రివ్వున బయటకు వెళ్ళిపోయాడు. నరసయ్య మంచంలో కూలబడ్డాడు. రాఘవయ్య శిలాప్రతిమయ్యాడు. సత్యం అవమానంతో క్రుంగిపోయాడు. సుశీల దుఃఖంతో కూలిపోయింది)

సత్యం:– సుశీ, మనపెట్టెలూ బట్టలూ సర్ది వెళ్ళిపోదాం.

నర:– (విచారంగా) సత్యం

రాఘు:– సత్యం, పట్టుపట్టుమని ఇప్పుడెక్కడ కెళతార్రా?

సుశీ:– బాబాయి. ఈ ఇంటి విషయాలు చాలాదూరం వెళ్ళాయి. ఇక మేముండటంవలన ఈ ఇంటికి ఏ ఆపదలొచ్చినా అవి మా నెత్తిమీదపడతయ్యి, వాడిచేత మేము మెడ బట్టి గెంటించుకోనేదాకా దేనికుండాలి? బాబాయి. ఇప్పటికే ఆత్మగౌరవం నాశనంచేసుకుంటున్నాం?

(ఏడుస్తూ)

నర:– (దుఃఖంతో) సుశీ...

సుశీ:– నామాటకు అడ్డుచెప్పకు నాన్నా!

నర:– ఈ వృద్ధాప్యంలో నువ్వుగూడా నన్నువిడిచి వెళ్ళిపోతావా? తల్లీ? తల్లిలేకపోయినా నిన్ను ఇంతవరకూ ఎంతో అల్లారుముద్దుగాపెంచి పెద్దదాన్ని చేశాను. మీరే నా జీవితానికి వెలుగనుకొంటున్నాను. మీ పైననే నా సర్వఆశలూ పెట్టుకుని జీవించాను నన్ను

మీరుగూడా ఈదిక్కులేనిస్థితిలో విడిచివెళ్ళిపోతారా, తల్లి!

సుశీ:- అదికాదునాన్నా ! (చెప్పలేకపోతుంది)

సత్యం-నిన్నుకష్టపెట్టటం మాఉద్దేశ్యకాదు. మామయ్యా ! రేపు ఈసంసారానికి ఏదొచ్చినా మేము అపనిందలపా లవుతాము (కన్నీళ్ళు తుడుచుకుంటూ) నువ్వు చెప్పు రాఘువయ్య మామా? (సుశీల లోపలకు వెళ్ళిపోతుంది)

రాఘు- నిజమేరాసత్యం. (విచారంగా) నువ్వుచదువుకున్న వాడివి. నీకు నేను చెప్పాలట్రా ? నువ్వువచ్చిన తరువాతనే ఈ ఊరూ, ఈఇల్లూ. అంతాబాగుపడి, నాలుగు విష యాలు నేర్చుకున్నాం మేము. కాని యిప్పుడు మీరు మాత్ర యెక్కడికి వెళ్ళతారు ?

సత్యం- ఏదో ? మామయ్యా దయవలన చెప్పించిన విద్యాబుద్ధు లున్నాయి ఎక్కడన్నా ఉద్యోగంచేసుకుంటే పదిరాళ్లు సంపాదించు కుంటాను. కాస్తమేము ఒకచోట నిలబడ్డ తరువాత నిన్ను మా దగ్గరకు దీసుకు వెళ్తాం లే మామయ్యా !

రాఘు- ఎంత చల్లనిమాట చెప్పావురా! నరసయ్యన్నా, ఇంకా నువ్వు విచారించేదెందుకూ ?

నర:- అదికాదురా, నేను యింతకాలం దేనికి బ్రతకాలి ? నా యిల్లాలుపోయిననాడే నేనుచచ్చిపోతే యివ్వాళ ఈ దుర్మార్గచూడకుండా పారేస్తూవాడినేగా ? నన్ను భగ వంతుడు ఏంచేయమని యింతకాలం బ్రతికించాడో ?

సత్యం- అదేమిటి మామయ్యా ! నువ్వుగూడా అలా అధైర్య

పడిపోతే ఎట్లా? కష్టాలు కలకాలం వుంటయ్యా!

నర- కష్టాలు, ! ఎన్నికష్టాల్ని, ఎంతదుఃఖాన్ని భరించి దిగ మింగానో ఎవరికి తెలుస్తుంది ?

రాఘు- సత్యం, నేను ఒకటి చెవుతాగాని వింటావట్రా ! నువ్వుయిప్పుడు పట్టుపట్టుమని యెక్కడికి పరుగిడ. తావురా ? నీకభ్యంతరం లేకపోతే ఊరి మధ్యనున్న మాపాతయింటో కొంతకాలంవుండరా ? కొంత కాలం పోతే, పరిస్థితులు నెమ్మదించాక చూచుకోవచ్చు, నీకు యిష్టమేనట్రా ?

సత్యం;- సరేలే, మామయ్యా! ఈ ఇల్లుకాకుండా వుంటేసరి!

నర;- రాఘువయ్యా! ఇప్పుడు వాళ్లకు నువ్వేదిక్కురా! వాళ్ల కాఇల్లు బాగుచేయించిఇవ్వు. మిడిమేళంగా వెళ్లి వాళ్లె క్కడ అవస్థలు పడతార్రా?

రాఘు!- నువ్వుఊరుకో నలసయ్యన్నా! సత్యానికొచ్చిన భయం లేదు. నేనున్నాగా! ఆ. బజారుకెళ్లేపనే మరచిపో యాము. వెళదాం నస్తావటే నరసయన్నా!

నర:- పదరా! వెళ్లివద్దాం? (యిద్దరూ లేచి వెళ్లిపోతారు విచారంగా. సత్యంగూడా బయటకు వెళ్లిపోతాడు. చంద్రం వస్తాడు. సుశీల లోపలనుండి విచారంగావస్తుంది చంద్రంచూచి ఆశ్చర్య పోతాడు.)

చంద్రం:- ఏమిటమ్మా సుశీ అలావున్నావు?

సుశీ:- (చెప్పలేక కన్నీల్లు విడుస్తుంది.)

చంద్రం:- అదేమిటమ్మా! దేనికి ఏడుస్తావు? నాన్న ఏమన్నా అన్నాడా?

సుశీ:- అన్నయ్యా! (ఏడుస్తుంది)

చంద్రం:- (అర్థంకాక) ఏంజరిగిందిరి? నాతో చెప్పటానికేం? అబ్బే! ఏమిటా ఏడవటం? (కన్నీళ్ళు తుడుస్తాడు.)

సుశీ:- చిన్నాన్నాయీ, నాన్నా పోట్లాడుకున్నారు.

చంద్రం:- ఎప్పుడూ? (ఆశ్చర్యంగా)

సుశీ:- ఇప్పుడే! (కన్నీళ్ళుతుడుచుకొంటూ)

చంద్రం:- వాళ్ళిద్దరూ పోట్లాడుకుంటే నువ్వేడవటం దేనికి?

సుశీ:- మేముగూడా ఇక్కడనుండి వెళ్లిపోతామన్నయ్యా!

చంద్రం:- మీరా! ఎవరెవరూ? దేనికి?

సుశీ:- చిన్నాన్నఇ, బావను చాలామాటలన్నాడు. మేము గతిలేక మీ ఇంట్లో పూటకూళ్లు తింటున్నామట? అంతాఇప్పుడెందుకులే అన్నయ్యా! ఎప్పటికైనా మేము వెళ్ళవలసిన వాళ్ళమేగా?

చంద్రం:- ఈభాగ్యానికేనా? నేను కనుక్కుంటానుగా ఊరుకో! వాడికేనా! నాకుమాత్రం ఇల్లులేదూ! (ఇంతలో తెరలో నరసయ్యనౌకరు కోటిగాడు పరుగెత్తుకుంటూవస్తాడు)

కోటి:- చంద్రయ్యగోరూ! చంద్రయ్యగోరూ!

చంద్రం:- (అదిరిపడి) ఎవరూ?

కోటి:- నేనండీ కోటిగాడిని.

చంద్రం:- (లేచి) ఏమిట్రా! ఏమిటీ!

కోటి:- చిన్నదొరగారు ఆ పాలబట్లఎద్దుని తోలుకెళ్లి ఆ కామయ్యగారింటికాడ అమ్ముకుంటున్నాడు దొరా!

చంద్రం:- నిజమేనా?

కోటి:- నిజమేనండిదొరా! నేను పొలాన్నుండి గడ్డిమోపు

తెచ్చేసరికి గాటిని ఎద్దులేదు. దీనిపడిచావ, ఊడదీసుకు పోఇందేమోనని ఎతకటాని కెల్లా? యింకేముందీ ఆశామయ్యగారి దొడ్లో వుంది. పోయిచూద్దు నుగందా చిన్నదొరగారు డబ్బుతీసుకుంటున్నారు. నేను అడగబోతే కర్రతీసుకుని నావెంటపడ్డాడండీ?

చంద్ర:- సరే! పో! (నౌకరి వెళ్ళిపోయాడు. చంద్రం మంచం మీాద కూలబడ్డాడు, ముఖం ఎర్రబడింది, ఉద్రేకంతో రివ్వున లేచాడు. మూలనున్న ముల్లుకర్రతీసుకుని వెళ్ళ బోయాడు. సుశీల పెద్దగా అరుస్తూ అడ్డువచ్చింది.)

సుశీ:- అన్నయ్యా? అన్నయ్యా?

చంద్రం:- లే, అడ్డులే, ఈవేళ వాడిచావో? నాచావో తేలిపో తుంది. యిన్ని జరిగినాక బ్రతికేం చచ్చేం?

సుశీ:- అన్నయ్యా! నామాట వినన్నయ్యా! (ఏడుస్తూ)

చంద్రం:- సుశీ, నన్ను ఆపకు, యిలాగనే వాడినీస్థితికి తెచ్చాం ఒక్కసారి కాలో, చెయ్యోవిరిచివేస్తే చచ్చినట్లుపడి వుంటాడు.

సుశీ:- వాడు నీయంతవాడయ్యాడు. నువ్వు ఇప్పుడిలాచేస్తే లోకం మెచ్చదన్నాయ్యా!

చంద్రం:- (రోషంతో) అదంతా మించిపోయింది. వదులు. వదులుతావా లేదా! సుశీ (అరిచాడు)

సుశీ:- (గంభీరంగా) అన్నయ్యా! వాణ్ణిచంపేముందు నన్ను చంపి మరీవెళ్లు.

చంద్రం:- సుశీ...(పెద్దగా అరిచాడు మళ్ళీ)

సుశీ:- ఔనన్నయ్యా! నువ్వు నన్ను చంపిమరీ వెళ్ళు. నువ్వుతొందరపడితే మనసంసారం బజారుకెక్కుతుంది. ఒక్కటాలోచించన్నయ్యా! నువ్వువాణ్ణిచంపివేస్తేలోకం ఏమంటారు? ఆస్తికోసం వాణ్ణీమనం చంపామంటుంది నిజానిజాలు లోకానికి తెలియవు. (కాళ్ళుపట్టుకొని) అమ్మకడుపున మనముగ్గురం పుట్టాము. అమ్మకడుపులో చిచ్చుపెట్టకన్నయ్యా! మన కుటుంబాన్ని నిందలపాలు చేయకన్నయ్యా! వాడిపద్ధతులు మనకు నచ్చకపోతే మనం దూరంగావుందాం! లోకం మెచ్చదన్నయ్యా! ఈనింద నాకొస్తుంది. (ఉద్రేకంతో) మీకంత కొట్టు కోవాలనివుంటే నేనీఇంట్లోవుండగా మాత్రం వీల్లేదు.

చంద్రం:- (కర్రజారి క్రిందపడిపోయింది ఆవేశం తగ్గిపోయింది. మంచంమీద కూలబడ్డాడు. ముఖంచేతులతో కప్పు కున్నాడు. కళ్ళవెంట నిప్పులకుబదులు నీళ్లువచ్చాయి) ఏంపనిచేశావే సుశీ ...ఛి...వెధవబ్రతుకు. ఆ ఎడ్లను యెంతప్రాణంగామెపాను అవి మనఇంటికి యెంతటి పేరు ప్రతిష్టలు తెచ్చినై, (యింతలో రంగారావే వచ్చాడు నోటితో ఈలపాట పాడుకుంటూను సుశీల వెళ్లిపొమ్మని సైగచేసింది. కాని, అదిపట్టించుకున్నట్లులేదు. సరాసరి దర్జాగా లోపలికొచ్చాడు. చంద్రానికి ఆవేశం మళ్లీ పొంగింది సుశీల వణికిపోతుంది)

చంద్రం:- ఎద్దేమైయిందిరా?

రంగా:- (నిర్లక్ష్యంగా) అమ్మేశాను.

చంద్రం:— (ముఖం ఎర్రబడింది) యెవరినడిగి!
రంగా:— నాయిష్టంమీాదనే! (గంభీరంగా)
చంద్రం:— నీయిష్టంమీాదనేనా?
రంగా:— (రెట్టిస్తూ) ఔను
చంద్రం:— ఎందుకమ్మావురా?
సుశీ:— అన్నయ్యా!
చంద్రం:— (కోపంగా) నువ్వూరుకో సుశీ, ఎందుకమ్మావురా?
రంగా:— నాకు డబ్బుఅవసరముండి.
చంద్రం:— గడ్డితినకపోయావు?
రంగా:— (పలుకడు)
చంద్రం:— ఎవరినడిగమ్మావు! పలుకవేం?
రంగా:— (కోపంతో) చెప్పాను. నాఇష్టమేనని!
చంద్రం:— నీ పెత్తనమేనన్నమాట?
రంగా:— ఔను. నాఆస్థిమీాద నాపెత్తనంలేకపోతే, ఇంకెవరికుంటుంది? నువ్వెవ్వడివి అడగటానికి?
చంద్రం:— అంత బరితెగి పోయావన్నమాట?
రంగా:— మిమ్మల్నిబట్టే?...
చంద్రం:— ఆ...మాదర్చోద (లేగాడు పెటపెటా గూబపగిలేటట్లుగా కొట్టాడు. ఆవేశంలో రొప్పుతూవుంటాడు. సుశీల భయంతో లోపలికి పారిపోయింది.)
చంద్రం:— తిత్తితీస్తాను. జాగ్రత్త! ఛీ. వెధవబ్రతుకు. ఎందుకురా వెళ్లొచ్చినై, నీపుటక తగలెయ్యా! (ఆగలేక లోపలకు వెళ్లిపోబోతూవుంటాడు. రంగారావు నిశ్శబ్దంగా

నలువైపులాచూచాడు. (ప్రక్కనున్న ముల్లుకర్ర తీసు కుంటున్నాడు. ఇంతలో నరసయ్య బయటనుండివచ్చి చూచి కంగారుపడ్డాడు. రంగారావు రోషంతో వుండ టం గమనించాడు. చంద్రాన్ని కొట్టబోతున్నాడని గ్రహించాడు ఆవేశంతో)

నర:- ఏమిట్రా! అది? ఒరేయ్ రంగడూ? (పెద్దగా అరుస్తూ) మధ్యకు పరుగెత్తాడు. రంగారావు కర్ర విసురుగా వెళ్లి బలంగా నరసయ్యా తలమీద పడింది. ''అమ్మో'' అంటూ క్రింద పడి పో యా డు. రక్తంలో మునిగి పోయాడు. చంద్రం పోతున్నాడల్లా వెనుదిరిగిచూచి తండ్రిని పట్టుకున్నాడు. రంగారావు కర్రక్రిందపారవేసి నిశ్శబ్దంగా బయటకు వెళ్లిపోయాడు. సుశీలవచ్చిచూచి కెవ్వున కేక వేసింది.

చంద్రం:- నాన్నా ...నాన్నా...(క్రిందపడ్డ కర్రతీసుకుని బయ టికి పరుగెత్తాడు. సుశీల అన్నయ్యా! అంటూ అరి చింది.)

(తెర)

# రైతు బిడ్డలు

## నాల్గవరంగం

—:[తెర]:—

సీను:- (అది నరసయ్యగారి యిల్లు. అంతా వెనుకటిమాదిరిగానే వుంటుంది. బయటనుండి చంద్రం వస్తాడు. వీధినుండిపాటవినపడిద్ది.)

### పాట

ఈ బ్రతుకులే యింతేనురన్నా
మన బాధలకు అంతమేదన్నా॥
మనిషి మనిషికిమధ్య
మమతలే త్రెంచుకొని
శోకిస్తె ఏముందిరా
లోకమే యింతేనురా? ॥ఈ॥
అన్నపై తమ్మునికి
అనుమానమేరన్నా
తండ్రిపై కొడుకుకి
తగని దేషంబన్నా
గుండె గుండెకు మధ్య
ఘోషించు ద్వేషాలు
ఆరిపోయే దెన్నడన్నా—మన
ఆత్మలకు శాంతిలేదన్నా ॥ఈ॥

(యింతలో నరసయ్యగారి పాలేరు కోటిగాడు వస్తాడు)

కోటి:- చంద్రయ్యగోరూ

చంద్రం:- (తలెత్తి) ఏమిట్రా!

కోటి:- ఆ పాడిగేదలు అల్లాడి చస్తున్నయ్యండి

చంద్రం:- దేనికి!

కోటి:- ఆటిని నిన్నా యియ్యాలా పాలుదీసినాళ్ళే లేరండి.

చంద్రం:- ఓ...అదా! (నిట్టూర్చాడు)

కోటి:- పాడిగేదలు కట్టుగొయ్యలదగ్గర అల్లాడిచత్తున్నయ్యండి

చంద్రం:- నేనేం చేచేదిరా!

కోటి:- అట్టాగంటే ఎట్టాగండిదొరా? చిన్నప్పాటునుండీ ఆ గొడ్డాగోదా మంచిచెడ్డల్ని చూత్తుంటి మీగేనయ్యే పెద్దదొరగారు మంచంపట్టిరి, చిన్నదొరగారు ఈసందు కై గాల ్లగిచూడ్డాయే ఆదొరసాని నెమ్మగారు ఊరిమధ్య కెళ్ళిపోయిరి. అంతా అట్టాగంటే ఎట్టాగండిదొరా?

చంద్రం:- (విసుగ్గా) ఏమిటిపోది?

కోటి:- నిన్నల్లా పాలుతియ్యకపోతిరి. యియ్యాలన్నా ఆటి ముఖం చూసినాళ్ళు లేకపోయిరి. పొద్దుగూకొత్తుంది. ఆ గేదలు రెండూ కట్టుగొయ్యల దగ్గర గొడలుపగిలే టట్లు అరిచి చత్తుండయ్యండి.

చంద్రం:- చస్తేచావనీయి. అందరికిపీడా విరగడైపోతుంది.

కోటి:- ఆ లేగదూడలు నిన్నల్లా అరచి అరచి యియ్యాల అడ్డం పడిపోయినైయండి. ఆ పాడిగేదలు తాళ్లు త్రెం పుకుపోతున్నయి.

చంద్రం:- వెళ్లి ఆదూడల్ని పాలకువదిలిపెట్టు. అవ్వయినా తాగి బ్రతుకుతై.

కోటి:- ఆ పాలన్నీ అయ్యేక్కడ తాగిచత్తయండి. ఒక్కొక్కటి నాలుగు శేర్లపాలు యిచ్చే గేదెలయ్యె, యిదివరకు సుళీ

లమ్మగారు సుబ్బరంగా పాలుతీసినా యింకా ఆ దూడ
లకు పాలెక్కువై జబ్బుచేసినైకదండి?

చంద్రం:– పోనీ, మా రాఘవయ్య బాబాయిని తీసుకెళ్ళమని
చెప్పిరా?

కోటి:– ఆ రెండు గొడ్లపాడి ఆ రాఘవయ్యగోరు తీసుకెళితే
ఏమొత్తుందండీ? మీంకిష్టమైతే...సుశీలమ్మగారికి చెప్పి
వస్తాను.

చంద్రం:– నీకుకాదురా చెప్పేది! నువ్వెళ్ళి చెప్పినపని చెయ్య
రాదూ?

కోటి:– సరే! అట్టాగే లెండిదొరా! (వెళ్ళిపోతూ మళ్ళీ తిరిగి
వచ్చాడు)

చంద్రం:– దేనికిరా మళ్ళీవచ్చావు?

కోటి:– (నసుకుతూ) పెద్దదొరగారికి ఎట్లావుంగండి వంట్లో!

చంద్రం:– ఈ రెండురోజులనుండే ఆయనపరిస్థితి ఆందోళనగానే
వుంది. యివ్వాళకాస్త కులాసాగావున్నాడు.

కోటి:– (విచారంగా) పోనియ్యండిదొరా! ఆ మారాజు ఈ గం
డం తప్పి బతికి బయటపడితే అదే పదివేలు. పదేళ్ళ
నుండే ఈదొడ్లో నౌకరి చేస్తున్నాను. నన్ను ఎన్న
డన్నా ఒక్కమాట అనియెరుగా? ఏందో పెద్దమ్మోరు
ముసించుకొచ్చి అంతఘోరం జరిగిపోయింది. (అమా
యకంగా) ! యింకా సుశీలమ్మగోరు యిక్కడకురాదా
దొరా!

చంద్రం:– యింకా అదెందుకొస్తుందిరా! దానికి యిక్కడేం

యిల్లూవాకిలా? పడిపంచల బ్రతుకైపోయింది,

కోటి:- నలుగురుండాక మాటా మాటారాకుండా వుంటుందా దొరా! సుశీలమ్మగారుపోయినాక ఈ ఇంటికళే పోయిందండి!

చంద్రం;- నాన్న సంపాదించిన గౌరవమర్యాదలు పోయినై. బంగారంలాంటి ఎద్దుపోయింది. ఇన్నాటివరకూ కళకళలాడుతూవుండే ఇల్లంతానూ నాశనమైపోయింది. ఇప్పుడు "దినదిన గండం, దయ్యాలపోరు" లాగుంది.

రాఘు:- (వస్తూ) ఒరి, వీళ్ళతల్లికిగ్గొయ్యా! వాళ్ళకు మరీ పట్టపగ్గాల్లేకుండా వున్నాయిరా? ఈకొంపకీగతిపట్టిందంటే, నేను ఏమిటోననుకున్నాను. కాని, ఈగోడచాటు గుసగుసలుచూస్తే యిప్పుడర్థమౌతుందిరా?

చంద్రం:- ఏమిటిబాబాయి? ఏమిటి? (కోటిగాడు వెళ్ళాడు.)

రాఘు:- ఒరి, నీమేళాం పాడుగాను, నువ్వువట్టి పిచ్చాడివిరా? వాటితల్లికిగ్గొయ్యా! ఆ ఎడ్లపందాలవల్ల వచ్చిచచ్చిందేముంది? పండంటికాపురం పాడుచేశావు!

చంద్రం:- (ఆశ్చర్యంగా) బాబాయి.

రాఘు:- ఆ యదవలుయాళ్ళు మనముదనష్టపోడిని బుట్టలోవేసుకుని యిట్లాపగహాదిస్తారని నేనెప్పుడూ అనుకోలేదురా

చంద్రం:- అసలు ఏంజరిగిందో చెప్పుబాబాయి.

రాఘు:- ఆ...ఏంజెప్పిచచ్చేదిరా! అది తలుచుకొంటే ప్రాణం తరుక్కు- పోతుంటేను. ఆ ముదనష్టపు ఎడ్లపందాలదగ్గర జరిగిన పోట్లాట యింతకాడకి తెస్తుందనుకోలేదు వీడు!

దేనికి తెచ్చినట్లు పదివేల రూపాయలు ? వాళ్ళ కక్ష
సాధించటానికి మంచి అవకాశం దొరికిందిరా ?

చంద్రం:- శ్యామలను కనుక్కుంటే యింకా ఏమైనా సంగతులు తెలుస్తాయేమో ?

రాఘు:- ఎట్లా కనుక్కుంటావురా ? ఈ రాత్రికి దాని పెళ్ళయ్యె. మిరా. యింటికి వస్తుందని దాన్ని చచ్చేటట్లు బాదాడట వాడు బాబు ముండాకొడుకు. ఈ పెళ్ళిసంబట్లో ఎట్లావీలు పడుతుందిరా ?

చంద్రం:- (బరువుగా నిట్టూర్చి) యివాళ రాత్రికి పెళ్ళి. అవును ఆ మాటే మరచిపోయాను.

రాఘు:- (వినపడక) ఏమిట్రా అంటావు ?

చంద్రం:- ఆ...ఆ...ఏమీ లేదు బాబాయి. నాన్న కెలావుంది ?

రాఘు:- యివ్వాళ మధ్యాహ్నంనుండి కొద్దిగా జ్వరం తగిలిందట ! వెళ్ళి చూసిరాక పోయావా !

చంద్రం:- వెళ్తాలే బాబాయి. యిదిగో బాబాయి. మా పాడి గేదెల్ని పాలు తియ్యలేదు నువ్వు తీసుకెళ్ళు,

రాఘు:- నాకెందుకురా ? మా పాడి గొడ్లపాలే త్రాగేవాళ్ళు లేకపోయారు.

చంద్రం:-అవి ప్రొద్దుటినుండి అరచిచచ్చిపోతున్నయి బాబాయి

రాఘు:- ఓరి నీమేళాంపాడుగాను ఆమాట చెపితే నేను తీసిచ్చి పొయ్యేవాడినేగా ?

చంద్రం:- పోనీ యిప్పుడు తీసుకెళ్ళు.

రాఘు:- ప్రొద్దుగూకవచ్చింది. యికనన్నా దీపం వెలిగించరా ? నేను వెళ్ళిపాలుతీసి యిచ్చివస్తాను. ఒరి వాళ్ళతల్లి శిగ్గొయ్యా. బంగారంలాంటి సంసారాన్ని ఎలాపాడు

జేశారా? (రాఘవయ్య వెళ్ళిపోయాడు. చంద్రంఅలాగే దిగులుగా కూర్చున్నాడు. ఇంతలో బయటనుండిసన్నాయిమేళాలధ్వని వినిపించింది. కంగారుపడ్డాడు. ఆందోళనతో బాధపడుతూ కూర్చున్నాడు. మళ్ళీ లేచాడు. లోపలకువెళ్లాడు. మళ్ళీవచ్చి కూలబడ్డాడు. ఇంతలో శ్యామల వచ్చింది. పెళ్ళికూతురు ముస్తాబులో వుంది. ముఖం అంతా ఏడుపుతో ఎర్రబడివుంది. శ్యామలను చూడగానే చంద్రం రివ్వునలేచివెళ్ళాడు. శ్యామల దుఃఖం ఆపుకోలేకపోయింది.)

చంద్రం:– శ్యామలా!

శ్యామ:– చంద్రం...(ఇద్దరూ కలిసిపోయారు. ఒకక్షణం గడిచింది. బయట సన్నాయిమేళం మళ్ళీవినిపించిందిఇద్దరూ అదిరిపడ్డారు.)

చంద్రం:– నిన్ను ఎవరూచూడలేదా? శ్యామలా!

శ్యామ:– లేదు.

చంద్రం:– మీనాన్న లేడా ఇంట్లో?

శ్యామ:– వున్నాడు!

చంద్రం:– నువ్వు వచ్చినట్లు తెలిస్తే!

శ్యామ:– చంపేస్తాడు! అంతేగా!

చంద్రం:– అంతేనా!

శ్యామ:– కాకపోతే ఇంకా ఏంచేస్తాడు? తనపగ సాధించుకోటానికి నాజీవితాన్ని పాడుచేస్తున్నాడు. (ఏడుస్తుంది.) ఈ పెళ్లికన్నా నన్నేంచేసినా నేను చింతించను.

చంద్రం:– ఏడుస్తున్నావా శ్యామలా?

శ్యామ:– అంతకంటే ఆడదాన్ని నేను చేయగలిగిందేముంది?

నన్నుయిలా అన్యాయంచేస్తూవుంటే నువ్వుచూస్తూ పూరుకుంటావా?

చంద్రం:- నన్నేజేయమంటావు శ్యామలా? అవతల మానాన్న మృత్యుముఖంలోవున్నాడు. ఈ ఇంట్లో ‚‚నా,, అనే వాళ్ళులేరు. లేకపోతే...(ప ళ్ళు కొ రు కు తా డు. కోపంతో)

శ్యామ:- లేకపోతే నేను ఈమనస్సులేని మనువుకువెళ్ళి కుళ్ళి కుళ్లి యేడవాలసిందేనా!

చంద్రం:- లేదు. నువ్వు ఏడవనక్కరలేదు.

శ్యామ:- అంతభాగ్యంకూడానా! ఇప్పుడునన్ను ఎంచేసినా నీదే భారం. నిన్నుయెంతగా ప్రేమించానో ఎ వ్వ రి కే ం తెలుస్తుంది? నా ఆశలన్నీ అడుగంటి పోతున్నయి నన్ను...నన్ను ఇలా పరాయిదాన్ని చేస్తుంటేచూస్తూ పూరుకుంటావా? చంద్రం!

చంద్రం:- (ఆవేశంతో భాధపడుతూ) నన్నుకాస్త ఆలోచించు కోనీయి శ్యామలా? అవతల మానాన్న మృత్యు ముఖంలోవున్నాడు. ఒకవైపున మా కుటుంబమంతా ముక్కలైపోయివుంది. నను...నన్ను అర్థంచేసుకో శ్యామలా?

శ్యామ:- నిన్ను అర్థంచేసుకున్నానుకాబట్టే పెళ్లి పీటల మీాద నుండికూడా లేచివచ్చాను. మానాన్నచేత ఎన్నో హింసలు పడ్డాను. నువ్వూ నన్ను కాదంటే ఈగుక్కెడు ప్రాణంపోవటానికి చాలామార్గాలున్నయిలే చంద్రం.

చంద్రం:- (ఆవేశంతో) శ్యామలా!

శ్యామ:- నిన్నటివరకు తియ్యటి కలలుకన్నాం, ఈ జీవితానికి

అక్కడజచ్చింది దేనికిరా?

శ్యామ:- నేను...(ఏడుస్తుంది)

రామ:- నాన్నకు నేనుమాత్రం నిన్నుఅప్పగిస్తానా? నేననగూడ దుగాని. నా కూతురొకటి, నువ్వొకటీనా? రా! పరవా లేదులే! రామ్మా! (ఇంతలో రఘువయ్యవచ్చాడు. రాఘువయ్యనుచూచి బలవంతంగా లాక్కెళ్ళబోతాడు)
- అలానిలబడితే ఎలాగమ్మా! అవతలపెళ్ళిముహూర్తం గూడ సమీపిస్తుంది. పద.

రాఘు:- ఒరినీతల్లి శిగతరగ! యిక్క శీకిరాడా దాపురించా వ్రటా!

రామ:- రాఘువయ్యా కాస్త జాగ్రత్తగా రానీయి మాటలు.

రాఘు:- ఎందుకు రాముండా! నీకుమల్లే చంకల్రకింద మట్టినలిపి లోకులకాపురాలు పాడుచేసేరకం కాదురానాది! ఛీ. నీ జన్మతగలెయ్యా! (పైనవస్తాడు రామయ్య ఒక్క సారి కోపంగాచూచి శ్యామలను బలవంతాన లాక్కె ళ్ళాడు. యింతలో చంద్రంవచ్చి చూచాడు. మూల నున్న కర్రకోసం పరుగెత్తాడు. రాఘువయ్య పట్టుకొని ఆపుతూ)

రాఘు:- చంద్రం. చంద్రం. ఏమిటిరా! ఏమిటిది! ఈ పిచ్చి ఆ వేశం? (ఇంతలో బయట నుండి శ్యామల "అమ్మో నాన్నా...నన్ను చంపకు. నన్ను చంపకు...పదవేదిక్కి మాలినముండా. పద,, అన్నమాటలు వినిపిస్తాయి.)

చంద్రం:- బాబాయి. నన్నువదులు. ఇవ్వాళతో వీళ్ళ గోరీ కడతాను ఇంతజరిగినాక ఇంకా బ్రతుకెందుకు బాబాయి

రాఘు:- ఓరి. పిచ్చిముఖమా? తొందరపడితే పనులవుతయ్యా!

అవతల నాన్నకు జ్వరంలో సంధిగుణాలుగూడా ప్రవేశించినైయటు. త్వరగా అక్కడకుపద.

చంద్రం:- (చంద్రం కర్రక్రిందపడవేశాడు. మంచంమీద కూలబడ్డాడు) ఎంతపనిజరిగింది బాబాయి.

రాఘు:- ఒరి వీళ్లతల్లిశిగ్గోయ్యా! మీ బ్రతుకుల్ని కాస్తా పాడు చేస్తున్నారుగదా? (ఇంతలో బయట సన్నాయి మేళం వినిపిస్తుంది. చంద్రం ఆవేశం మరీ పొంగుతుంది.)

చంద్రం:- బ్రతికిసాధించాలి. ఏంసాధిస్తాను. నా ఆఖరిప్రయత్నం గూడా విఫలమైపోయింది. నాబ్రతుకే భగ్నమైపోయి ంది.

రాఘు:- ఏమీకాలేదురా. నాన్నదగ్గర కెళ్లొద్దాంరా? అక్కడ సుశీల వక్కతే ఏడుస్తూకూర్చునివుంది. వెళదాంపదరా (ఇంతలో నరసయ్యనౌకరు కోటిగాడువచ్చాడు ఏడుస్తాను.

కోటి:- చంద్రయ్యగోరూ!

రాఘు:- ఏమిటిరా?

కోటి:- చిన్నదొరగారూ కొట్టాడండి.

చంద్రం:- దేనికి?

కోటి:- వామిలో గడ్డిదుయ్యటానికి వెళతేను. దుయ్యటానికి వీల్లేదని కొట్టాడండి.

చంద్రం:- అట్లాగా! (ఆవేశంతో లేస్తాడు)

కోటి:- యికనుండి వామిచాయలకొస్తే పూడ్చిపెడతానన్నాడండి.

చంద్రం:- విన్నావుగా బాబాయి? ఎంతవరకని తలవంచుకొని పొయ్యేది? వరేయ్, నువ్వువెళ్ళిగడ్డిదుయ్యి, ఎవడడ్డ

మొస్తాడో చూస్తాను.

రాఘు:— ఒరేయ్ చంద్రం నువ్వు తొందరపడతావేమిరా? అవతల నాన్నకు ప్రాణంమీదకొచ్చింది. ముందు అక్కడకుపదరా?

(యింతలో రంగారావే వచ్చాడు. కోటిగాడు పారిపోయాడు)

రంగా:— యిదిగో! రాఘువయ్యబాబాయి. ఈపోలికేకలకుబెదరిపొయ్యే వాళ్ళెవరూ లేరిక్కడ! యివ్వాళనుండీ ఆ వామిలో గడ్డిదుయ్యటానికి వీల్లేదు!

చంద్రం:— ఎట్లా వీల్లేదో చూస్తాగా?

రాఘు:— నామాట ఎవరన్నా వింట్యారా! మీరు యిద్దరూ తగువుపెట్టుకోని ఆనోరులేని పశువుల్ని చంపుతారట్రా

రంగా:— బాబాయి. నువ్వు మావిషయాల్లో కలుగజేసుకోకు, యిదిగో! ఈ యింటికిగూడా తాళం వేస్తున్నాను. బాగాలపంపిణీ అయినతరువాతే ఈ కొంపలో ఎవరున్నాను. అంతవరదాకా ఎవరిదారివాళ్ళు చూచుకోవటం మంచిది!

చంద్రం:—ఆమాత్రం గుండెలుంటే వచ్చి యింటికి తాళంవెయ్యమను తెలుస్తుంది?

రంగా:—(వుద్రేకంగా) ఎవరికి గుండెలున్నదీ యిప్పుడే తేలుస్తాను రమ్మను ఎవడడ్డమొస్తాడో? (వెళ్ళి యింటికి తాళం వేస్తాడు. చంద్రం మూలనున్న పలుగుదీసి తాళం బద్దలుకొట్టబోతాడు. రాఘువయ్య అడ్డమొస్తాడు.)

రాఘు:— నామాట వినండిరా రంగారావు! అంతాపంచుకోవాలంటే శాస్త్రగుట్టుగా పంచుకోండిరా? యిలా నలు

గురూ నవ్వాలటరా!

చంద్రం:- మానమర్యాదలు మట్టిలో కలిసినాక బ్రతికేందుకు

రంగా:- పెద్దమర్యాదకలవాడివి దొరికావులేవోయి. యిదిగో బాబాయి. మళ్లీ తాళంతీస్తేమాటదక్కదు.

చంద్రం:- బాబాయి అడ్డంలే!

రంగా:- తాళంమీద చెయ్యివేసి బ్రతుకు తెలుస్తుంది?

రాఘు:- రంగారావు!

రంగా:- బాబాయి. మళ్లీ చెప్తున్నాను. మా విషయాల్లో జోక్యం కలుగజేసుకోకు. ముసలాడ్ని మంచిజేసుకొని ఆస్తంతా కాజేయాలనిచూస్తారూ చూద్దాంగా?

చంద్రం:-ఏమిట్రా? నువ్వుచూచేది! (పైకెళ్లబోతాడు)

రంగా:- రానీయి. ప్రాణంమీద తీపివుంటే, (ఇంతలో బయట నుండి సన్నాయిమేళం తీవ్రస్థాయిలో వినుపిస్తుంటుంది. కోటిగాడు పరుగెత్తుకుంటూవస్తాడు. చంద్రం తాళం బ్రద్దలుకొట్టటానికి రెండుచేతులతో పలుగు పైకెత్తు తాడు.)

కోటి:- రాఘువయ్యగోరూ. పెద్దదొరగారు, పెద్దదొరగారు,

చంద్రం:- ఏమిటిరా; (పలుగుదించాడు)

కోటి:- చచ్చిపోయాడు (ఏడ్పాడు)

చంద్రం:- (చేతుల్లోనుండి పలుగుజారి క్రిందబడింది దుఃఖంతో) నాన్నా (బయటకు పరుగెత్తాడు)

రాఘు:- యింకాచూస్తావేం! పదరా. దక్కమాలినాడా! (త్వరగా వెళ్ళబోయాడు. రంగారావు నిలబడ్డాడు.)

(తెర)

# రైతు బిడ్డలు

## అయిదవ రంగం

-:[తెర]:-

సీను:- (అది జగన్నాథరావు మేడ—ముందు వరండా హాలు. అంతా వెనుకటిసీనే—శ్యామలకుర్చుని విచారంగా పాట పాడుతుంది. క్రొత్తచీరె—మెడలో మంగళసూత్రం రాత్రి తలలో తురిమిన మల్లెపూలు వాడిపోయింవుటయి కన్నీటితో ముఖమంతా కందిపోయివుంటుంది.)

**పాట**

శ్యామ:- తుదిఆశ మొదలంట
తెగిపోయె ఈరాత్రి
కారుమేఘపు తెరలు
జారెనే మననడుమ
బ్రతుకంత నీరాత్రి
దుఃఖభరమై తోచె ॥తు॥
మధుర స్వప్నాలన్ని
మటుమాయమైపోయె
మోయరాని హృదయబాధ
మరువలేని వలపుగాథ
మిగిలిపోయెనా? జీవితమే
పగిలి కూలెనా? ॥తు॥

(పాటఅయిపోయేసరికి తెరలో జగన్నాథరావూ, కామయ్యా పెద్ద పెద్దగానవ్వుతూ వస్తుంటారు. శ్యామల

కన్నీళ్లు తుడుచుకొంటూ లోపలకు వెళ్లిపోతుంది.
బద్ధకంగా వస్తాడు)

జగ:- ఆ... (కూర్చుంటూ) పంచాయతీ యేంజరిగిందిరా?

కామ:- ఇంకాజరిగేదేమిటీ (నవ్వుతూ కూర్చొని) నేననగూడదుగాని. మళ్లీ వాళ్లకు స్వరాజ్యమంటూ ఒకటి వుంటుందా? అని (నవ్వి) ఏమో. నాకు నమ్మకం లేదు.

జగ:- కొంతవరకు ఆ చంద్రంగాడికి పట్టుపగ్గాలున్నాయ్యటయ్యా! నాకు ఎంతసంబరాల్లో గలిస్తే మాత్రం. పెద్దా చిన్నా తారతమ్యం వుండనక్కర్లా?

కామ:- అందుకేగా అనుభవిస్తున్నాడు. నేననగూడదుగాని. "చేసుకున్నవాడికి చేసుకున్నంతమహాదేవా" అన్నారు పెద్దలు.

జగ:- అదిసరేగాని, ఆ రాఘవయ్యగాడికీ, వీళ్లకూ ఏమిట్రా సంబంధం?

కామ:- ఆ... సంబంధం ఏముందీ! ఏదో ఇంటిప్రక్క యిల్లు. నేననగూడదుగాని ఆ సరసయ్యంటే వాడికిచచ్చేంత అభిమానం. అంతకంటే ఏముంటుంది?

జగ:- ఈ రాఘవయ్యగాడికి కూడ దాపురించాడయ్యా! మనకు శనిగ్రహమల్లేను.

కామ:- నేననగూడదుగాని. పట్లో ఎవరిదేవాడికి గడ్డిసరకు లాధారం సరిపోతుందా?

జగ:- బాగాజెప్పావు. (నవ్వి) అదిసరేగాని ఈ సంవత్సరం భూమిసాగు పాడుబెట్టినట్టేనా?

కామ:- నాగేట్లూ తోట్లా, చెట్టుకొకటి పుట్టకొకటి అయిపోయి

నరయ్యా! ఆ నరసయ్యచావుతో భాగాలపంపకాలకోసం ఇంటికి తాళాలు వేశారా! నేననగూడదుగాని. నరసయ్య సంపాదించిన ఐశ్వర్యాలు గంగలో కలిసినై ఇవ్వాళ ఊళ్లో గుక్కెడు మంచినీళ్లు పుడతయ్యండి వీళ్లకు?

జగ:- ఇప్పుడు ఈ చంద్రంగాడు చెల్లెలుదగ్గరకు చేరాడటగా?

కామ:- అంతకంటే వాడికి దిగేముంది? నేననగూడదుగాని రంగారావు ఇంతలేసి అఘాయిత్యాలు చేస్తాడని నేను కలలోగూడా అనుకోలేదు.

జగ:- వాడికి నువ్వుబోధించినబోధ అలాంటిది. మరి...

కామ:- (నవ్వుతాడు) ఎద్దీ, ఆపాతపైగాంలోది ఒక నాలుగు పుగాకుతుంపు లిలాపడనెయ్యి.

జగ:- అదిసరేగాని. రేపు ఈ గ్రామపంచాయితీ ఎలక్షనులో ఈ సత్యంగాడు మనకు అడ్డమొచ్చేలాగున్నాడురా?

కామ:- వాడిమొహం. వాణ్ణిచూచి భయపడతారేమిటి?

జగ:- ఈ ఊళ్లోవున్న కుర్రవెధవలంతా వాడివెంట పడుతున్నారయ్యా.

కామ:- నేననగూడదుగాని కుర్రవాడికేం తెలుసురా. వుండేలు దెబ్బని నోరువాయిలేని ఈకుంకలేంజేసి ఎడుస్తారంటావు?

జగ:- అలా అనగూడదురా! వాడేదో ఈమధ్య గ్రామపునరుద్ధరణ కార్యక్రమం బుజానవేసుకొని స్కూళ్లని, లైబ్రరీలనీ, హాస్పటలులనీ, వాడికార్థం అని ఈ పిచ్చి జనానికి మందు వేశాడుకదరా?

కామ:- అదే నేనూ ఆలోచిస్తున్నాను. నేననగూడదుగాని. రంగారావుగాడిద్వారానే మనం వాడికి పుటంపెట్టాలి

జగ:- (ఆలోచనాపూర్వకంగా) అదే ఎట్లాగని?

కామ:- అసలు వాడినిరానీ ఇక్కడికి. నేననగూడదుగాని. ఊళ్ళో అనేకకులాల వాళ్ళున్నారు?

జగ:- (వుగాకిస్తాడు) వుంటే?

కామ:- కులపెద్దల్ని పట్టుకున్నామంటే ఆకుర్రకుంక లేంచేస్తారు. నేననగూడదుగాని, పెద్దవాళ్లే మనపక్షానచేరితే పిల్లకు ఇంటిదగ్గర తిండీగూడా పుట్టకుండాచేయగలం.

జగ:- (నవ్వి) నువ్వు అంతటివాడివి కాదనికాదు కాని ఆ పెద్ద వాళ్లు మనపక్షానికిరావటం ఎట్లాగా అని.

కామ:- (నవ్వి) ఆ,..దానికిగూడా ఒపెద్ద ఆలోచన దేనికి? "డబ్బుకు దాసుడు కానివాడిని ఈ భూప్రపంచంలో చూశావా? అని. నేననగూడదుగాని. అదంతా మన చేతిలోవుంది.

జగ:- డబ్బుపోతేపోయింది. ఓడిపోతే పరువుపోతుందికదా? అని.

కామ:- అ... నేనుమాత్రం ఆలోచించటంలేదంటారా? ఈ ఊళ్ళో మనకమ్మజనాభా యెంతవుందో. అంతమంది నాయుళ్లున్నారు. నేననగూడదుగాని. వాళ్ల నాయకుడిని? చీల్చామా? యింకా ఆ సత్యంగాడికి ఒక్కవోటు వస్తుం దండీ?

జగ:- అంత తేలిగ్గా వాళ్లుమాత్రం మనతరుపుకు రావద్దూ?

కామ:-ఎందుకురారండి? ఒక్క వెయ్యిరూపాయలు వాళ్ల మొ ఖాన పారవేయండి. తరువాత నేనాడిస్తాను వాళ్లని. ఒకాట నేననగూడదుగాని. ఆ నాయుడు నాంచారయ్య మాటంటే అంతావింటారు?

జగ:- ఆ నాంచారయ్య కొడుకుగూడా సత్యంతో కలిసి ఎలక్ష నులో నిలుస్తాడటగా?

కామ:- (నవ్వి) నేననగూడదుగాని. మనం నాంచారయ్యనే నిలబెడదాం?

జగ:- అతను ఒప్పుకోవద్దూ?

కామ:-నేను ఒప్పిస్తాగా? మీ కెందుకా భయం. (భీముడొ చ్చాడు)

జగ:- ఏరా! మాలపల్లెలో ఎలావుందిరా యెలక్షను ప్రచారం?

భీము:- మా జోరుగావుందండి! ఏందో! ...కవనాయాళ్ళు! ఆసత్యంగోరువత్తెగొర్రలగుంపల్లే వెంట ...తున్నారండి!

కామ:-మరి, మీసంఘపెద్దలంతా ఏమైనట్లురా? నేననగూడదు గాని. ఈకుర్రకారుకు పెత్తనంయిస్తే యింకా ఒక్క రోజు మనంవూళ్ళో బ్రతకటానికేనా?

భీము: -అందుకే నేనూ యింటింటికీతిరిగి చెప్పానండి, ఒక్క యదవనాయాలూ నామాట పట్టించుకుంటేనా?

జగ:- అయితే మీపల్లెలోఓట్లు మాకేం వట్రా?

కామ:-ఆ...ఎందుకురావు. నేననగూడదుగాని, వాళ్ళుమాత్రం మనుషులుగాదండి. ఏదో నాలుగురూపాయలు వస్తే ఉప్పుకూ పప్పుకూ వస్తయ్యనే వాళ్ళేడుపు.

భీము:- మాబాగా జెప్పారు, ఎక్కడికిపోతారండి మనల్ని కాదని.

జగ:- ఒక్కసారి మీకులపెద్ద నాగాయిని యిక్కడికి రమ్మని చెప్పరా?

కామ-ఒక్కనాగాయేనా? (నవ్వి) నేననగూడదుగాని ఈభీముడు గూడా ఒకప్పుడు కులపెద్దల్లోవాడే?

భీము:- ఆరోజులన్నీ పోయినైయండి. మాకుర్రనాయాళ్ళంతా ఎక్కొచ్చినాక మాపెద్దర్కీ లేమన్నా సాగనిత్తన్నా గా? చత్తున్నారా?

కామ:- వాళ్ళు సాగనిచ్చే దేమిటిరా? నేననగూడదుగాని, అట్లా సాగించుకొనేశక్తి, మీలోచావ, శ్రద్ధని చెప్పరాదూ! ఒరేయ్, నేనొక్కటి చెపుతానువిను, తెల్లవారిలేస్తే షావుకారుగారి చేలోకిరాకతప్పదు, మీ మాలపల్లి చుట్టూదొరగారిచేలేనయ్యే వాళ్ళు సక్రమంగా వినకపోతే వాళ్ళకుతగినశాస్తి జరుగితీరుతుంది. నేననగూటదుగాని. ఏదో పేదముండాకొడుకులు మంచినీళ్ళకుకూడా ముఖం వాచి చస్తున్నారని, మీపల్లెమధ్య బంగారంలాంటి మంచినీళ్ళభావిగూడా తవ్వించాడుకదరా! ఆపాటి కృతజ్ఞతన్న లేదేంరా? మీకు?

భీము:- అదేందండి. నన్నంటారు? మీరుచెప్పింది ఎప్పుడుచెయ్య లేదంటారు?

జగ:- కామయ్య చెప్పిందాంట్లో మాత్ర తప్పేముందిరా? మీ కుల పెద్దలంతా కుర్రాళ్ళకునచ్చచెప్పండి. అవసరమైతే డబ్బుపారేద్దాం మొఖాన.

భీము:- అట్లాగేనండిదొరా!

కామ:- అంతేగాదురా! పల్లెలో కాస్త నోరుకలిగినవాళ్ళని కాస్త్రతాగుడు అలవాటున్న వాళ్ళనుగూడా చేరని య్యాలిరా! నేననగూడదుగాని, మీకు పొట్టపొడిచినా వెలివి కనుపించదేంరా? యింకా కులపెద్దనండావు?

భీము:- కామయ్యగోరూ! మీ్కెక్రాలకేంలెండి. ఆసత్యంగా

రొచ్చి మా యెదవ నాయాళ్ళను వురేక్కించిందాకా పురుగులల్లేనే పడుండారు మా కాళ్ళదగ్గర!

జగ:- వస్తాడురా! వస్తాడు! (పళ్ళుకొరికి) మనతో విరోధం పెట్టుకుని చంద్రంగాడు ఏమయ్యాడో! యిప్పుడు వీడి పనీ అంతేఅవుతుంది. వీళ్ళు మనకెక్కడ దాపురించారయ్యా! ప్రతివక్కడూ కత్తిపట్టుకు[illegible]టున్నాడు!

కామ:-గొర్రెతోకొవ్వెందల్లా గొల్లవాడికేమంచిదని, వాళ్లెంతవర కొస్తారో కానివ్వండి. నేననగూడదుగాని ఈవూళ్లో నరసయ్య కుటుంబమో లేక షావుకారుకుటుంబమో, ఒక్కటే వుండాలి.

భీము:- మాబాగా చెప్పారండి. అంతే నన్నుమట్టుకు నన్నుఎన్ని మాటలన్నారండి, యియ్యాల అనమను [illegible] ఆచంద్రంగాడిని.

జగ:- వాళ్లకేం సిగ్గా ఎగ్గా. ఎప్పుడైనా అంటారు.

కామ:-ఒరేయ్ ఆసత్యంగాణ్ణి అణచివేసే మార్గంఏమీలేదట్రా!

భీము:- ఆయన్ని ఏంచేస్తాం దొరా! మనిషి మానిప్పు లాంటి వాడయ్యా.

జగ:- ఆమార్గం కామయ్య ఆలోచించాలి.

భీము:- నేను మొట్టమొదటే చెప్పాను గదండి, ఆయన బదికుండాడి గుడ్లుతోడేరకం కాదండీ యీయన.

కామ:-అఘోరించావులేరా! ఎధవ ఆవేళ ఎడ్లకు మందుపెట్టి రః మ్మంటే గరుడపక్షిలాగ తిరిగి వస్తివిగా! నేననగూడదుగాని యిక మీవల్ల అయ్యే పనులేమున్నాయిరా!

భీము:- అయ్యాల నేను చావిట్లోకెళ్ళేసరికే ఆ నరసయ్య గారు

వచ్చాడు. ఆయన్ని పడనెట్టి పారిపోయి వచ్చాను. ఈల్లేకపోతే ఎట్లాచేత్తారండి?

కామ:- నేననగూడదుగాని ఏదీ యివ్వాళ చూపించు. నీకు రోషం ఏమన్నా వుంటే?

భీము:- ఏంచేయమంటారేంది?

జగ:- కామయ్య చెప్పినట్లు కానియ్యావోయ్. నీవల్ల అర్ధణా ఆదాలేదు మాకు.

కామ:- ఆసత్యాన్ని కాస్తా వీధి మొఖంచూడకుండా చెయ్యాలి?

భీము:- అదే ఎట్లాగండి?

కామ:- ఎట్లాగేమిటిరా? మీ లోపల్లెలో దేనితోనో సంబంధం వుందని నేరంఆరోపించి ఒక రాత్రి (ఆగి) ఆ రెండు రెక్కలు విరిచివేసెయ్యి నేననగూడదుగాని ఈ మాత్రం తెలియకపోతే నువ్వేయింకా కులపెద్దవెట్లాగయ్యావురా

జగ:- (నవ్వి) కామయ్య లాంటివాడు నీకు సలహాదారుడైతే యింకా ఆలోచిస్తావేంరా!

భీము:- సరే! కానియ్యండి. మీాపుప్పుపులుసూతిన్న ఈభీముడి తడాకా? (యింతలో రంగారావు వచ్చాడు. అంతా నిశ్శబ్దంగా వున్నారు కామయ్య నవ్వుతూ)

కామ:- రా! రా! రంగారావు! రా! నేననగూడదుగాని నాలుగు రోజులనుండి మరీకంటికి కనుపించటమేమూ నేశావేంరా?

రంగా:- ఏదీ తీరికదొరకటంలేదు బాబాయి రావాలంటేను.

భీము:- యింకా ఆయినెందు కొత్తాడండి అస్తిపంచుకోమంటే అయ్యనేపంచాడు

రంగా:- నోర్మూయ్ (కోపముతో అరచాడు)

కామ:-(కామయ్య నవ్వుతూ) వాడు అన్యాయంగా చంపితే, నువ్వు చేసివచ్చిన ఘనకార్యం మాత్రం ఏముంది? మీ అమ్మని కొట్టి చంపి దాని పేరునున్న అరెకరం మాగాని అమ్మి కల్లుదుకాణానికి ధారపోస్తివిగా?

భీము:- నేను చంపానేంది. అదేచచ్చింది చూచేదిక్కులేక.

జగ:- ఎట్లాచస్తేనేం. మొత్తంమీద చచ్చిందిగా! (నవ్వి) నువ్వూరుకోరా! కామయ్యకు కోపంవచ్చింది?

కామ:- దేనికండి వీడికి యిన్నేళ్ళువచ్చినై. నేననకూడదుగాని అనేమాట అననిమాట తెలియొద్దా? వాడుమాత్రం కావాలనిచేశాడా? పేరుమాత్రం వాడికొచ్చిందిగాని, ఎవడిచావుకు ఎవడుకారణంరా? అంతాకర్మ?

భీము:- ఏదోబుద్ధితక్కువై అన్నా లెండి.

రంగా:- బాబాయి నీతోమాట్లాడాలి ఒకసారి ఇంటికొస్తావా?

కామ:- వస్తాలే! కాస్తాగు వెళదాం? అదికాదురా! నేననకూ డదుగాని నలుగురిలో అంత అల్లరిపాలయ్యావేంరా! దేనికిరా బాగాబ్రతికిన మమ్మల్ని యిట్లా బజారుపాలు చేయటం? అంత పంచుకోవాలనేవుంటే మూడవకంటి వాడికి తెలియకుండా చేసుకోకూడదట్రా? అది నీకు మాత్రం పరువా? మీ అన్నకు మాత్రం పరువా? ఓరిపెద్దమ్మా! ఎంతపని చేశావురా?

రంగా:- దేనికి బాబాయి ఈసోదంతాను అట్లాంటి వెధవలతో నాకు మంచేముంది చెడేముంది?

జగ:- నువ్వు చంద్రాన్ని వెనకేసు కొస్తున్నావుగాని, అతను మాత్రం చేసినతప్పేముంది? తనఆస్థిని అపహరిస్తుంటే

చూస్తూ ఎవరైతేమటుకు ఏట్లావూరుకుంటారు?

భీము:- సత్యం చెప్పారండి.

కామ:- నువ్వునోర్మూయ్యవోయ్. పెద్ద సత్యవేత్తవు బయలు దేరావు. యివ్వాళవీధిలోకొస్తే నలుగురూ అనేమాటలు వింటుంటే కడుపుతరుక్కుపోతుంది. నేననగూడదుగాని. నీకేం ఊడగొట్టిన నాగటిమేకల్లే పయవా! మర్యాదా?

రంగా:- అదంతా యిప్పుడెందుకులే పోనియ్యి బాబాయి. నీతో మాట్లాడాలి వస్తావా?

జగ:- వెళ్ళవయ్యా! రంగారావు అలానిలబడేవున్నా వేంకూర్చో

రంగా:- పరవాలేదులెండి నేనువెళ్లాలి. త్వరగాను.

కామ:- (నవ్వుతూ జగన్నాధరావుకు సైగచేస్తాడు) అలాగే నిలబడ్డావేంరా? వెళదాంలే కూర్చో? నేననగూడదుగాని యింత అమాయకుడివైతే ఎట్లాబ్రతుకుతావురా పెద్దమ్మా?

రంగా:- (మాట్లాడడు)

భీము:- మీరుండగా ఆదొరకు భయమేమిటండి! (నవ్వాడు)

జగ:- (ఆగమని సైగచేసి) ఏమయ్యా రంగారావు. కాస్త లెక్కచూచి ఆనోటుతాలూకూపైకం పంపుతావా? నాకుచాలా అవుసరంగా కావాల్సొచ్చింది! యిప్పుడు

రంగా:- యింకాపదిరోజు లాగండి. ఈభాగాల పంపిణీ తెగితే మీ బాకీఅంతా సుప్తాగాయిచ్చేస్తాను.

జగ:- అంతా యివ్వనక్కరలేదులే. అందులో సగం యివ్వు. ఈయిబ్బంది గడుస్తుంది.?

రంగా:- ఇప్పుడు నాదగ్గర ఐదువందలుమట్టుకు ఎక్కడవున్నయి

జగ:- అయిదువందలేమిటయ్యా రంగారావు?

రంగా:- నోటువ్రాసింది వెయ్యిరూపాయలకేఅయినా, ఇప్పుడు ప్రస్తుతం అయివందలు చెల్లవేద్దాం మనుకుటుంన్నాను!

జగ:- అదేమిటయ్యా! నోటు వెయ్యిరూపాయల కేమిటి? పదివేలకై తేను. మరచిపోయినట్లున్నావే?

రంగా:- (అదరిపడి) పదివేలకా? అంతడబ్బు ఎప్పడిచ్చారునాకు

జగ:- నేను అబద్దంవ్రాయించుకున్నానంటావా? ఈ భీముడు చేతనేగా నీకు తొమ్మిదివేలూ కావాలంటే పంపింది?

భీము:- ఔనండిదొరా? ఆరూల నాచేతులతోనే తీసుకెళ్లి యిచ్చాను.

కామ:- (మొదలకుండా చుట్టకాలుస్తుంటాడు.)

రంగా:- నోర్యాయ్. వెధవ! అబద్దం ఆడావా! డొక్క పగల దీస్తాను.

భీము:- (కోపంగా!) అబద్దం ఆడాలిసిన పనినాకేం వుందండి. తీసుకోని లేదని మీరే అబద్దం ఆడుతున్నారు!

జగ:- కావాలంటే నోటు చూచుకో ఎంతకు వ్రాశావో తెలుస్తుంది.

రంగా:- (కోపంతో) చూచుకుంటే ఏముంటుంది. వ్రాసుకుంటే వుంటుందిగాని. ఇలా ఎంతమంది కాపురాలుతీస్తావు అన్యాయంగా నోటులు వ్రాయించుకొని.

కామ:- ఈ దుర్గొరా పెద్దమ్మా! నేనులేకుండా నువ్వు నోటు వ్రాయటం దేనికి? యిప్పుడు ఏడవటం దేనికి? అన్ని తెలివితక్కువపనులు చేసుకుని అఘొరించి యివ్వాళ

ఏడిస్తేలాభమేముంది? నేననగూడదుగాని. షాహుకారు మాత్రం అబద్ధం ఆడత్తాడా? చెప్పు?

రంగా:– (కోపంగా) అయితే: నేను తీసుకెళ్ల లేదంటున్నా నా?

కామ:– నన్నడుగుతా వేంరా? నేననగూడదుగాని. నేనున్నా నా? నోటు వ్రాసినప్పుడు?

రంగా:– నాకు చదువురాదని మీాయిష్టం వచ్చినట్లు నోట్లు వ్రాయించుకుంటారూ? ఛీ. ఈఅబద్దాల గడ్డి తినక పో తే నేం?

జగ:– (పెద్దగా) నోర్మూయ్. పళ్లుదగ్గర పెట్టుకుని మాట్లాడు జాగ్రత్తా!

రంగా:– అట్లాగా? నీ అంతు తేలుస్తాను బజార్లోకిరా! యిట్లా ఎందరి కొంపలార్పుతావు! (కామయ్యతో) అట్లా నంగి నంగి కూర్చున్నా వేం! ఇంతకిరాత కేంచేస్తా గా!మీాకంటే కుక్కలు నయ్యం

జగ:–(కోపంగా) భీముడు!

భీము:– పదవయ్యా బయటకు. ఊరికేవాగావంటే చచ్చిన కుక్కకు మల్లే కాళ్ళకు తాడుగట్టి కట్టమీాదకీడుస్తా!

రంగా:– గుండెలుంటే అడుగుముందుకు వెయ్యమను తెలుస్తుంది

జగ:– నెట్టి వేయండిరా! బయటకు. ముండ! వీడిచ్చే దేమిటి? కేపీపాటికికల్లా నెత్తురుబొట్లుతో సహా కక్కిస్తాను.

రంగా:– అదే. తొందరపడకు తెలుస్తుంది.

జగ:– ఏమిటోయ్ తెలిసేది. నీబాబుతో చెప్పుకోపోయి అట్లా చూస్తా వేంరా! నీకాడు చెప్పేది?

భీము:– ఇక్కడనుండిపోతావా? మెడమీాద కర్ర వేసి నెట్టమం

టావా? (భీముడుదగ్గరకు వెళతాడు. రంగారావు చెయ్యియెత్తి కొట్టబోతాడు. కామయ్యవచ్చి వదిలించ బోతాడు రంగారావు వదిలించుకుని రివ్వునా వెళ్లిపో తాడు కోపంతో. అంతా వెనుకనుండి విరగబడి నవ్వు తుంటారు. ఇంతలో తెరలో జగన్నాధరావు నౌకరు పెద్దగా అరుస్తూవస్తాడు.)

నౌక:- దొరగారూ! దొరగారూ! శ్యామలమ్మగారు బావిలో దూకింది. తొందరగా రాండి దొరా!

కామ;- భావిలో దూకిందా?

జగ:- అమ్మాయ్. (లోపల కెళ్లిపోయాడు) యెంత పని చేసిందిరా!

కామ:- పదరా! ఇంకా అట్లాచూస్తావేం? నిన్నుకాదురా! దున్నపోతల్లే కదలవేం? నేననగూడదుగాని. మిమ్మల్ని దేనికిపుట్టించాడురా దేముడు. (వెళ్ళిపోయాడు లోప లకు)

భీము:- మీకుమల్లే కొంపలార్పమని పుట్టించలానన్ను. (రో షంతో లోపలకు వెల్లాడు.)

(తెర)

# -: రైతుబిడ్డలు :-

## ఆరవ రంగము

[ తెర ]

సీను:- (అది సత్యంవుంటున్న రాఘవయ్యగారి ఇల్లు. సుశీల విచారంగా ఆ సాయంత్రంవేళ మంచాలు బయటకుతేర వేస్తూవుంటుంది. (పక్కచుట్టలు తెచ్చి మంచంమీద పడ వేసి కొద్దిసేపు విచారంగాకూర్చొని, కన్నీరుకారుస్తూ మెల్లగా పాట పాడుతుంది.)

సుశీ:- (పాట)

ఏమౌనో! మా బ్రతుకేమౌనో!
ఏమి తెలియదాయెగా
వెలుగు కానరాదుగా
ఏమౌనో.........||ఏ||
ఏనాటికానాడు ఏటిలోపడవలా
చుక్కాని తెరచాప ముక్కలైపోయి
నడిఏటిలో మునుగునో, ఈనావ
నదితీరమే జేరునో! ||ఏ||
ఎందుకో మాపైన అంధకారపునీడ
మూదైన లేదేకుటు పాడువెన్నెలజాడ
ఎదపైన వ్యథలాయెనే!
మదిలోన దిగులాయెనే! ||ఏ||

(పాట అయిపోయేసరికి చంద్రంవచ్చి వెనుకనిలబడి విచారిస్తూవుంటాడు. గడ్డం పెరిగివుంది. ముఖంచిన్న బోయివుంది. సుశీల కన్నీళ్ళుతుడుచుకుంటూ వెనుదిరిగి చూచి దుఃఖాన్ని ఆపుకోలేక చంద్రంహృదయంమీద వాలిపోయింది!)

సుశీ:- అన్నయ్యా ! (ఏడుస్తోంది)

చంద్రం:- సుశీ... (కన్నీళ్ళురాలాయి) దేనికిఏడుస్తావు ఊరుకో అంతా అయిపోయింది. చేతులారా సర్వ నాశనం అయిపోయాము. పరులచేతులలో కీలు బొమ్మలమైపో యాము. ఈ పడి పంచలలో తల దాచుకుంటున్నాం. వీధిలోకివెళితే సిగ్గుతో తలవాలి పోతూవుంది.

సుశీ:- అన్నయ్యా ! (దూరంగా వెళ్ళి నిలబడ్డాడు. కన్నీళ్ళు తుడుచుకుంటూను. దుఖంతో మాఃఖంకష్టపడుతున్నాడు.)

చంద్రం:- నీ అన్నలు సరైనవాళ్ళయితే నీకు యిలాంటి గతేం దుకొస్తుందే సుశీ... —— ——

సుశీ:- అదంతా నా దురదృష్టమే అన్నయ్యా !

చంద్రం:- ఎవరి దురదృష్టమైనా అనుభవిస్తుంది మన మేగా ? ఆనాడు నేను ఎడ్లపందాలకు వెళ్ళకుండావుంటే ఈనాడీ ఘోరం జరిగేదికాదుగా ?

సుశీ:- నువ్వుమాత్రం కావాలని చేశావా ?

చంద్రం:- ఎందుకు చేయలేదు? మనకు తగనివిషయాల్లో తల దూర్చటంమాత్రం తప్పుగాదూ? (సత్యంవచ్చాడు)

సత్యం:- "చేతులు కాలినాక ఆకులుపట్టుకుంటే", యేముంది? యిందులో అంతా భాగస్థులమేగా? ఒకరి సి ఒకరు అర్థంచేసుకోలేక యిలా నాశనం అయ్యాం, గత జల సేతుబంధనం, జరిగినతప్పుల్ని మరచిపోకుండా, ముం దైనా జాగ్రత్తగానడిస్తే యిలాంటి బాధలురావు.

సుశీ:- ఎలా మరచిపోతాము. బంగారంలాంటి సంసారం పాడ య్యింది. నాన్ననుపోగొట్టుకున్నాం. పదిహేనుపుట్లు

ధాన్యంపండేపొలం సాగులేకుండా పాడుపెట్టుకున్నాం.
(కన్నీళ్ళతో గొంతుపూడిపోయింది.)

సత్యం:- ఆ...విన్నావా చంద్రం. రాత్రి శ్యామల భావిలోపడి చచ్చిపోయింది.

చంద్రం:- (పలుకడు. కన్నీళు జారిపడ్డయిక్రింద)

సుశీ:- ఎంతపనిచేశారు! దుర్మార్గులు. దాన్నిబతుకుని పాడు చేశారు. అన్నయ్యను చేసుకోవాలని యెంత అరాట పడింది.

(చంద్రం నిలవలేక లోపలకు వెళ్లిపోతాడు.)

సత్యం:- సుశీ! నేనువచ్చేసరికి చాలా పొద్దుపోతుందేమో! మీారు నాకోసం ఎదురుచూడకండి.

సుశీ:- అసలే చీకటిరోజులు. మీారు పెందలాడే రాకూడదూ! మనపరిస్థితి బాగాలేదయ్యో. (విచారంగా అంటుంది.)

సత్యం:- మరేంపరవాలేదు తొందరగానే వచ్చేస్తాను. చీకటి పడింది వెళ్లి దీపంవెలిగించు. (వెళ్లాడు.) సుశీలలోప లకువెళ్లి లాంతరు వెలిగించుకొచ్చింది. రాఘవయ్య వచ్చాడు.)

రాఘు:- ఓరి వాళ్ళ తల్లి శిగ్గొయ్యా! యెంతపనిచేశార్రా చివ రకు.

సుశీ:- ఏమిటి బాబాయి?

రాఘు:- ఆ! ఏముంది. మనరంగడ్నే మెడబట్టి బయటకుగెంటా రంట.

సుశీ:- దేనికి?

రాఘు:- అదే! ఆ డబ్బుదగ్గర పేచీయే. వెయ్యిరూపాయలిచ్చి

పదివేలకు నోటు వ్రాయించుకున్నారని చెప్పానుగా?
ఇవ్వాళ వీడు కర్రపట్టుకొని ప్రొద్దుటినుండి ఊరిమీద
తిరుగుతున్నాడు దేనికోసరి?

సూరీ:- ఏదన్నా అఘాయిత్యం చేస్తాడేమో బాబాయి. ఊళ్ళో పోలీసులుగూడా వున్నారు!

రాఘు:-నేను పిలిచినా వినకుండా తూరుపువైపుగా బడివెళ్ళాడు. సత్యం ఎక్కడవున్నాయి?

సూరీ:- ఎలక్షను ప్రచారంకోసం పల్లెలోకి వెళ్లాడు. (బయట ఉరుములు, మెరుపులు వినిపిస్తాయి.) వర్షం వచ్చేలా వుంది. అసలే చీకటి, ఎక్కడే వెళ్లాడు.

రాఘు;- నేనూ వెళ్లొస్తా లేవ్వింకు.

సూరీ:- కాస్త వెళ్లిరా బాబాయి. అసలే నా రోజులు బాగా లేవు. ఈ పాడు ఎలక్షను మా కోసమే వచ్చినట్లుంది. వారికి నిద్రాహారాలు లేవు.

రాఘు:- వాడు అట్లాచేస్తున్నాడు కాబట్టే ఇవ్వాళ ఆ జగన్నాధంగాడికి ఒక్క ఓటు పడేట్టు లేదు.

(మళ్లీ శబ్దాలు వినిపిస్తాయి)

సూరీ:- (కంగారుగా) త్వరగా వెళ్లిరా బాబాయి.

రాఘు:- వెళుతున్నాలే (వెళ్ళాడు. చంద్రం వచ్చాడు.)

సూరీ.- ప్రొద్దుపోతుంది. భోంచేద్దువుగాని లే అన్నయ్యా!

చంద్రం:- నాకు ఆకలిగా లేదు సూరీ

సూరీ:- ప్రొద్దునెప్పుడో అయినట్లు పోయినట్లుగా తిన్నావు. యిట్లా ఆరోగ్యం పాడుచేసుకుంటే ఎట్లాగన్నయ్యా!

చంద్రం:- (నిట్టూర్చి) నన్ను బాధపెట్టకు. నువెళ్లి భోంచెయి.

చంపావు, పరువు మర్యాదల్ని పాడుపెట్టావు. యింకా నీకు దాహం తీరలేదు? నా యీ తాళిబొట్టు కూడా త్రెంచి తేకాని నీకు నిద్రపట్టలేదా?

రంగా:-(కర్ర క్రిందపడిపోయింది, కన్నీళ్ళలో ముఖం తడిసిపోయింది) సుశీ నన్ను మీరందరూ అలాగే అపార్థం చేసుకున్నారు, నేనూ అలాగే అర్థం చేసుకున్నాను. అందుకే యింతవరకూ నా కసి మరుస్తున్నాం, కాని నేనెంతరాక్షసుడి నైనా, నీ మంగళసూత్రం త్రెంచలేనమ్మా?

సుశీ:- ఛీ, యింకా సిగ్గులేక మాట్లాడుతున్నావా? పో! నా యింట్లోనుండి పో! (ఏడుస్తూ కూలబడుతుంది)

(చంద్రం పరుగెత్తుకుంటూ వచ్చాడు, రంగారావును చూచి అదిరిపడ్డాడు, రంగారావుతో ఏదో చెప్పబోయి చెప్పలేకపోయాడు)

చంద్రం-బాబాయి, వీడిని పారిపొమ్మను పోలీసువాళ్ళు వస్తున్నారు, కామయ్యను చంపేసివచ్చాడు, త్వరగా వెళ్ళమను.

రాఘు:-కామయ్యనా?

చంద్రం-ఔను.

సుశీ:- ఎంతపని చేశావన్నయ్య వెళ్ళిపో త్వరగా,

(అంతా ఆశ్చర్యపోతారు)

రంగా:-అక్కర్లేదు, రానీయి బాబాయి, నేను అవివేకంతో చేసిన పనులకు ప్రాయశ్చిత్తం అనుభవించాలిసిందే (కన్నీళ్ళు కారుస్తాడు)

చంద్రం-అవన్నీ తరువాత చూడొచ్చు త్వరగా వెళ్ళమను, బావ కొట్టింది భీముడట, వాడిని పట్టుకున్నారు, కామయ్య చచ్చి

పోయాడు, పట్టుకుంటే వురిశిక్ష వేస్తారు వెళ్ల మను.

సుశీ:- అన్నయ్యా! వెళ్లన్నయ్యా! త్వరగా వెళ్లిపో.

రాఘు:-ఓరి పెద్దమ్మా! యింకా ఆలోచిస్తావేం వెళ్లరా! చివరకు ఎంతకాడికి తెచ్చావురా! (బయటఅంతాగోల, పోలీసుల విజిల్సు వినుపిస్తుంటాయి)

రంగా:-(రంగారావు ముఖం పొంగింది, ఆవేశంపట్టలేక) అన్నయ్యా! నన్ను క్షమించు, (కాళ్లమీాదపడ్డాడు)

చంద్రం-అదితరువాత చూచుకుందాం, లే పారిపో, (లేవ దీస్తాడు) బాబాయి డాక్టరొస్తున్నాడు, బావకు కట్టు కట్టించు, పదరా, పద. (చెయ్యిపట్టుకుని లాక్కు వె ళ్ళాడు దొడ్డిదారిని)

సుశీ:- బాబాయి, (అంటూ సుశీల పడిపోయింది)

[ తెరలో పాట ]

ఎవరు ఏలినా, ఎవరు రాలినా
ఏమున్నది ఈ స్మశానంలో
శౌర్యం? కార్పణ్యం, దౌర్జన్యం
కలిగించిన మారణహోమం
గుండె గుండెకుమధ్య
ఘోషించు ద్వేషాలు
ఆరిపోయే దెన్నడన్నా
మన ఆత్మలకు శాంతిఏదన్నా.

[ తెర ]

శ్రీసాయి ప్రింటింగ్ ప్రెస్, షరాబ్ బజార్, తెనాలి.

"స్తుతి, నింద, పరకృతి మరియు పురాకల్పమని యర్థవాదము నాలుగు విధములు. 1 విధివాక్యమును ప్రశంసించుట స్తుతియనబడును. స్తుతిచే ప్రవృత్తి గలుగును. (పురుషార్థమొనర్చి దేవతలసురుల జయించిరి. మొదలగునవి) 2 అనిష్టఫలము నిందయనబడును. 3 మానవకర్మలలో పరస్పర వైరుధ్యమును జూపు వాక్యములను పరకృతి యందురు. 4 ఇతిహాసయుక్తమగు విధిని పురాకృతమందురు. (జనకుడు సంసారములో నలిప్తుడగుటచే మహాయశస్వి అయ్యెను మనము అప్లేకావలయును)

"విధి విహితస్యాను వచనమనువాదః" (న్యాయ. 2-1-64)

విధి విహితమగు "అనువచనము" అనువాద మనబడును. మొదటిది 'శబ్దానువాద'మనియు రెండవది 'యర్థానువాద' మనియు జెప్పబడును. ఉదా:- సంధ్యచేయుము" ఇది విధివాక్యము. దీనితో శారీరక, సామాజిక,ఆత్మికోన్నతి గలుగును" ఇదిఅర్థవాద మనబడును. "అందుచే సంధ్యన వశ్యమొనర్పుము, సంధ్యన వశ్యమొనర్పుము" ఇదియనువాద మనబడును. దీనిని పునరుక్తి యనరు ఉటుల జెప్పినచో నది యనెడి వారి దోషమేయగును. కాని యది వేదముదికాదు న్యాయదర్శన మిటుల వేదమును సమర్థించి, దాని విరోషత్వమును నిర్ణయించినది.

2 వైశేషిక దర్శనము:- ఈదర్శనము, సామాన్య, విశేష పదార్థముల గురించి చర్చించుచున్నది వేదములు స్వతఃప్రమాణములని యీదర్శనకారుడు తలంచి, తన సిద్ధాంతముల బలపఱచుటకు వేదాశ్రయమును బొందినాడు. దర్శనముయొక్క యారంభములోనే "తద్వచనాదామ్నా యస్య ప్రామాణ్యం" (1-1-3) ఈశ్వరవచన మగుటచే వేదము ప్రమాణమని తెలిపినాడు. వేదములోని వాక్యరచన, బుద్ధిపూర్వకమని మరొకచోట వ్రాసినాడు.

"బుద్ధిపూర్వావాక్య కృతిర్వేదే" (6-1-1)

షవేకాక ననేకసూత్రములు వేదముల, నంతిమ ప్రమాణ ములుగా గ్రహించుటకు తెలుపబడినవి.

1. 'తస్మాన్నాగమికం' (2-1-17)
"అందుచే శబ్ద ప్రమాణము సిద్ధించును"

2. 'తస్మాదాగమిక' (3-2-8)
"ఈకారణమున వేద మంగీకరింపబడును"

3. "వేద లింగాశ్చ" (4-2-12)
వేద ప్రమాణముపలన కూడా (అయోనిజయోని నిరూపితమగును)

4. "వేదికంచ" (5-2-10)
(అగ్నియోషధుల గర్భమని) వేదము కూడా సిద్ధాంత మొనర్చుచున్నదు.

5. 'శాస్త్రసామర్థ్యాచ్చ' (3-2-21)
(ఆత్మలనేకములవి) శాస్త్రము సమర్థించుటచే"

4 యోగ దర్శనము:- యోగదర్శనములో "తత్రనిరతిశయం సర్వజ్ఞబీజం"(1-25) అని గలదు. ఈశ్వరునిలో సర్వజ్ఞత్వము నిరతిశయముగానున్నది అతనికన్న నధికముగా నితరమైన యే పదార్థములో నిదిలేదు.

ఈ విధముగా సమస్త జ్ఞానమునకీశ్వరుడు శ్రోతస్సని తెలిపి యటుల మరల తెలుపుచున్నాడు. "సపూర్వేషామపి గురు: కాలేనాఽనవచ్ఛేదాత్" (1-26) ఈశ్వరునకు కాల విభాగములేనందున నతడు పూర్వఋషులకును గురువే.

పరమేశ్వరుడు జగదారంభమున వేదరూపజ్ఞానము నొసంగి మానవులను సుశిక్షితుల గావించినాడు. వేదమీశ్వరీ జ్ఞానమగుటచే ప్రమాణమని యీదర్శనముకూడా ప్రతిపాదించుచున్నది.

5 పూర్వమీమాంసా-దర్శనకారుని ఉత్తర ప్రత్యుత్తరము లు మిక్కిలి ఆకర్షణీయములుగా నున్నవని "మాక్సుముల్లరు" వ్రాసినాడు. ఇందలితర్కము విశుద్ధతాదృష్టిచే నద్వితీయమైనదని యు నతనియభిప్రాయము.

కోల్ బ్రూక్ మీ మాంసనుగురించి యిటుల వ్రాసినాడు. "మీ మాంసలోని తర్కము శాసన సంబంధమైన తర్కము. నాగ రిక మరియు ధార్మికనియమముల అర్థములదెలిసికొను విధులిందు చూపబడినవి. ప్రతివివాదాస్పదమైన విషయమును మీమాంసకారుడు పరీక్షించి వాని నిర్ణయముల సార్వత్రిక నియమముల కనుకూలము గ నొనర్చినాడు. ఇటులేర్పరచిన నియమములు దర్శనములో సం గ్రహింపబడినవి వీనినునియమిత ప్రబంధముగాంచిన శాసన సం బంధమైన దార్శనికజ్ఞానము కలుగును. వాస్తవికముగ మీమాంస లో నిటులచేయు ప్రయత్నమేగలదు.

మీమాంసను గురించిన పైయభిప్రాయముల నెరింగిన పిమ్మట నది వేదములగురించి యేమి తెలుపుచున్నదో గ్రహించు ట యవసరము. మీమాంసాకారుడు మొదటి సూత్రములో ధర్మ మును దెలిసికొను జిజ్ఞాస ప్రకటించినాడు. విధి ప్రతిపాద్యమగు అ ర్థమే ధర్మమని రెండవసూత్రములో చెప్పినాడు. "చోదనాలక్షణోఽ ర్థోధర్మః" (1-1-2)

చోదనా లక్షణముగలది ధర్మము, ఏ వాక్యమువినిన ప్రేర ణ గలుగునో నది చోదనయనబడును. చోదనము, నోదనము, ప్రేరణ, వేదాజ్ఞ, ఉపదేశము, విధి, యివన్నియు సమానార్థక శబ్ద ములే. దేనినికోరుదుమో యనియే అర్థము లేక సుఖమనబడును. మూడవసూత్రములో నిటుల తెలిపినాడు.

"తస్య నిమిత్త పరీష్టిః" (1-1-3)

"అధర్మనిమిత్తమైన పరీక్షగావించబడును" ప్రత్యక్షము కేవలమింద్రియ విషయమగుటచే నది ధర్మమునెఱుంగుటలో ప్రమాణముకాజాలదని నాల్గవ సూత్రములో ప్రకటించినాడు. అనుమాన ప్రమాణము కూడా ప్రత్యక్షప్రమాణములోనే సమ్మిళితమై యున్నదని గ్రహించవలెను. అట్లైన ధర్మము నెఱుంగుటకు సాధనమేది? ఈప్రశ్నకుత్తరువు ఐదవ సూత్రములో నిట్లొసంగినాడు.

"ఔత్పత్తికస్తు శబ్దాస్యార్థేన సంబంధస్తస్య జ్ఞానముపదేశోఽవ్యతిరేకశ్చార్థేఽనుపలబ్ధే తత్ప్రమాణం బాదరాయణ స్యానపేక్షత్వాత్" (1-1-5)

శబ్దార్థములకు నిత్యసంబంధమున్నది. అందుచే ధర్మజ్ఞానమునకది (వేదము) సాధనము. ఈశ్వరునిచే నది ఉపదేశింప బడినది. మఱియు (ప్రత్యక్షాది (ప్రమాణములచే) ఉపలబ్ధి కాజాలదు. (దానిలో దానియొక్క)వ్యతిరేకములేదు, బాదరాయణుని మనస్సులో నా(వేదవాక్యము) ప్రమాణముల నపేక్షించకున్నను స్వతః ప్రమాణమైనది,

ఈ సూత్రములో నాలుగు విషయములున్నవి. 1 శబ్దార్థములకు నిత్య సంబంధముకలదు. 2 ఆదిఈశ్వరుని యుపదేశము 3 ప్రత్యక్షాదులచే నుపలబ్ధిగాని దర్మము వేదములచే నుపలబ్ధమగును. మఱియు 4 బాదరాయణుడు వేదముల స్వతఃప్రమాణముగా నంగీకరించినాడు. అందుచే మీమాంసదృష్టిలోకూడా వేదములు స్వతః ప్రమాణములే.

6 ఉత్తరమీమాంస (వేదాంతము):- వేదాంత దర్శనములోని యారంభ మూడవ సూత్రమగు "శాస్త్రయోనిత్వాత్" లో "ఋగ్వేదాదుల రచించినకారణమున నా బ్రహ్మకలదు. వేదాదుల రచన నిమిత్తహేతువున బ్రహ్మయొక్క యస్తిత్వ మంగీకరింప

బడినది. అతడు వేదోత్పాదకుడు జగదారంభమున ఋషులకు వేద ముల నొసంగినాడు. ఇట్టి శిక్షయే వేదాంతదర్శనములో పలుసూత్ర ములందు కన్పించును.

ఈ షడ్దర్శనములు వేదములయొక్క ఉపాంగములు. ఇవి ఐక్య కంఠమున వేదమును ప్రమాణముగా నంగీకరించినవి. వైదిక సాహిత్య వివరణానంతరము "తర్కము" 'శ్రద్ధ' యనుశబ్దము ల పరస్పరసంబంధము దెలుపబడును అందువలన తర్కప్రధాన ములగు దర్శనములే వేదోపాంగములవి గ్రహింపనగును.

## తర్కము మరియు శ్రద్ధ



1. సంస్కృత సాహిత్యములో తర్కమునుగుఱించి యనేక నిందావాక్యములు కలవు. మహాభారతములో నిటులున్నది.

"నతర్కశాస్త్ర దగ్ధాయతథైవ పిశునాయచ"

(మహాభారతము. శాంతి. అ. 246)

"చాడీలుచెప్పు దుష్టులకు, తర్కశాస్త్ర దగ్ధులకు ధర్మప్రాప్తి గలుగజాలదు.

2. వాల్మీకిరామాయణములో నిటులున్నది. 'ధర్మశాస్త్రేషు ముఖ్యేషు విద్యామానేషు దుర్బుధాః। బుద్ధి మాన్వీక్షికీం ప్రాప్యనిరర్థ ప్రవదంతితే॥ (వాల్మీ. రా అయో సర్గ: 100)

"ముఖ్యములగు ధర్మశాస్త్రములుండగా ,దుర్బుద్ధులగువారు తర్కవిద్యను నేర్చి వ్యర్థప్రలాపములు గావింతురు.

3. మహాభారతములో నిటులవ్రాయబడియున్నది. "నాస్తికులు" సమస్తమును శంకించువారు, వేదనిందకులు, మూర్ఖులై తమను పండితులుగా భావించువారు శృగాలజన్మల నెత్తుదురు"

[మహాభారతం. శాంతి. అ. 180]

4. మనుస్మృతిలో "తర్కమునాశ్రయించి వేదమును నింధించు నాస్తికుల సాదుసమాజమునుండి తొలగించవలెనని" కలదు.

(మను 2-11)

5. గౌతమఋషి ప్రణీతమగు తర్కశాస్త్రము నాధారముగా జేసికొని, యన్నింటిని సందేహించువారు నక్కజన్మల నెత్తగలరని "గాంధర్వతంత్ర" ములోగలదు.

6. స్కాందపురాణయులో గౌతమమహాముని నిదించబడినది. "తర్కయుచే శాస్త్రముల ఖండించిన గౌతముడు, మునులచే శపింపబడి నక్కజన్మను పొందగలడు"

(స్కాంద. కాలికా ఖండము అ 17)

పై యుదాహరణలలో తర్కసాస్త్రమును బాగుగా నిందింప బడినది. కానివాస్తవమునతర్కముగాని, శ్రద్ధగాని చెడ్డవికావు మనుష్యుడు తర్కమునువిడిచి 'శ్రద్ధ' నాశ్రయించినచో, నందవిశ్వాసయు గలవాడగును. శ్రద్ధనువీడి కేవలము తర్కము నాశ్రయించినవాడు 'కుతర్కి'యనబడును. అందుచే నీరెండును నవసరములే. ఈ రెండింటి పరిధుల గ్రహించి వానినాయామేరలలోనే వినియోగించుటవసరము

## తర్కము మరియు శ్రద్ధల పరిమితులు

యాజ్ఞవల్క్యుడు తనభార్యయగు మైత్రేయి కుపదేశించుచునిటుల తెలిపినాడు. "ఆత్మను దెలియగోరువారు మూడు కార్యముల నాచరింపవలెను. అవి యివి 1. శ్రవణ దర్శనయులు. 2. మననము. 3. నిధిధ్యాసము"

1. శ్రవణదర్శనములు:- ఇంద్రియయులతో జగత్తుయొక్క యథార్థజ్ఞానమును, శ్రవణచక్షురింద్రియయులచే పొందవలెను.

మిథ్యాజ్ఞానము సంపాదింపవలదు.

2 మననము:- తర్కముచే, నింద్రియముల కతీతమగు విషయముల చింతించి, వాపియథార్థ జ్ఞానము సంపాదించవలెను.

3 నిదిధ్యాసము:- శ్రవణ, దర్శన, మననములవలన గలిగిన జ్ఞానము నాత్మచే గ్రహించవలెను దీనినే శ్రద్ధా లేక విశ్వాస మందురు. ఇంద్రియములకార్యక్షేత్ర మింద్రియానుభూత జగత్తు వరకేపరిమితమైయుండును తర్కముయొక్క మేర, యంగీకరించదగు జగత్తు వరకు పరిమితమైయుండును నిమ్మటనిదిధ్యాసముగావించుట యాత్మయొక్క పని. నిదిధ్యాసమనగా అనుభవ పూర్వకముగా గ్రహించుటని యర్థము. మననము గావింపజేయుట "తర్కము" యొక్క పని అత్మక్షేత్రమునకు తర్కము ప్రవేశింపవలదు. ఇటుల జరిగిననది కుతర్కమనబడును. అ కుతర్కము మనుష్యుని, శ్రద్ధా విశ్వాసములనుండి తొలగించగలదు. అంతఃకరణకార్యమును గమనించిన, నీవిషయము తేటతెల్లమగును

అంతఃకరణ కార్యము:- మస్తిష్కమునకు పై భాగమున నిచ్ఛా శక్తియుండి తన కార్యమును సాగించును. దీనికి కొంచెము క్రిందుగా, మస్తిష్కముపై "మేధావీబుద్ధి" యుండును. దానికి క్రింద మస్తిష్కమధ్యమున "తార్కిక బుద్ధి" కలదు. మస్తిష్కముయొక్క క్రిందిభాగము, మనో సంబంధమైన సందేశతంతువుల స్థానమనబడును. హృదయమునకు పైన 'మనసు'(ఇంద్రియముల నియంత) యొక్క స్థానమున్నది. హృదయము మఱియు నాభి యొక్కమధ్యలో "చిత్త"ముండును. దీనికి క్రిందసూక్ష్మప్రాణము లుండును. ఈ అంతఃకరణములతో "విశ్వాశక్తి"పని చేయును. బుద్ధితోజ్ఞానము మఱియు తర్కపూర్ణవిచారము, మనస్సుతోనింద్రియముల వ్యాపారము, చిత్తముతో ముద్రేకాదులు, మరియు ప్రాణములతో భోగకార్యములు గావించబడును. అంతఃకరణముల

కార్యములు సరిగా జరిగినప్పుడిచ్ఛా శక్తియొక్క కార్యములో నాటంకములుగల్గి శక్తి వికాస,వృద్ధులగాంచును. ఇవన్నియునాత్మకుయంత్రాంగములవంటివి. ఇచ్ఛాశక్తివిద్యుత్తు (గతిశక్తి) వంటిది. ఈ కార్యమున నీక్రింది విధముగా నాటంకములు సంభవించ గలవు.

1 సూక్ష్మప్రాణములు, ఇంద్రియవ్యాపారములగు భావవిచారములలో జోక్యము కలిగించు కొన్నప్పుడు, మనుష్యుడు కోరికలకు దాసుడగును.

2 చిత్తము, ఇంద్రియ వ్యాపారములలో సంబంధము పెట్టుకొనిన, భావుకతవృద్ధిచెంది మనోబుద్ధులు నిష్క్రియములగును.

3 మనస్సు బుద్ధి యొక్క కార్యములో జోక్యముగొన్న, మానవుడింద్రియాదుల జ్ఞానమును విచారింపజాలడు. ఇంద్రియజ్ఞానముతో నాతడు భ్రమాదులనెరుంగక నిర్ణయముగావించుచుండును.

4 ఇటులనే తర్కముకల్పనా స్మృతులయొక్కయు, మేధావిబుద్ధియొక్కయుకార్యములలో జోక్యంగల్పించుకొన్నచో, మనుష్యుడు కుతర్కముగలవాడై విజ్ఞానము, శ్రద్ధ, మరియువిశ్వాసములనుండి విముఖుడైయుండును అనుమానాదులలో తగుల్కొని యుండును.

5 బుద్ధి, ఇచ్ఛాశక్తిపనిలో సంబంధము పెట్టుకొనినచో నాత్మ పరమాత్మల నైక్యమొనర్చు శక్తినుండి మానవుడువంచితుడగును

6 ఇచ్ఛాశక్తి కార్యములో మరొక విఘ్నముకలుగగలదు. అది అల్పజ్ఞతచే సంభవించును. అల్పజ్ఞతవలనమానవునిలోసందేహము అసఫలత మొదలగు స్వభావము లేర్పడును. ఇది, శక్తివికాసములో గొప్పయాటంకములు గలిగించును. ఇట్టిస్వభావములు గలుగకుండా యుండుటకు మిక్కిలి యత్నించవలెను. మనో బుద్ధి చిత్తాదులు తమతమ సీమలలోపనిజేయుచు, నితరములలో సంబంధము పెట్టుకొననప్పుడు, మానవుడు శ్రద్ధా తర్కములచే లాభంగాంచగలడు

ఓం ఇతిశమ్



## -: వెలువడిన గ్రంథములు :-

| | | |
|---|---|---|
| 1. | భగవద్గీత వేదానుకూలమా? | 0-20 |
| 2. | ఈశ్వరుడున్నాడా? | 1-00 |
| 3. | మంత్రిప్రగడ వారి మాట వినుడి | 0-50 |
| 4. | అవినీతి నిర్మూలించుటెట్లు? | 0-50 |
| 5. | మన సంస్కృతి | 0-20 |
| 6. | పతితోద్ధారణ | 0-20 |
| 7. | విడిపోయిన సోదరులు | 0-20 |
| 8. | అగ్నిశబ్దమహాత్మ్యము | 0-25 |
| 9. | ఏది సుగతి? | 0-50 |
| 10 | భారతీయ స్వాతంత్ర్య సందేశము | 0-63 |
| 11. | దయానందుడు, 14వ సముల్లాసము | 0-75 |
| 12. | మనదేశ సేవ | 0-20 |
| 13. | ఈశ్వరుడెందు కవతరించును? | 0-50 |
| 14 | ఆర్యుల పండుగలు | 8-00 |
| 15. | వైదిక దినచర్య | 3-00 |
| 16. | మనుష్యుడ వగుము | 0-25 |
| 17. | భగవద్భక్తి వలన ప్రయోజనయేమి? | 0-15 |
| 18. | వేద రహస్యము | 1-50 |
| 19. | సప్త రహస్యములు | 1-25 |



అనృత మాడియైనను స్త్రీలయందు నీవు
తగు ప్రవర్తన మాపుట తగునునీకు॥ 16

అబలల యెడ నమ్రత వారి యనుసరణము
వారి హృదయముల బంధించు పాశమగును
గుణములే మైత్రికిని గారణము లగును
మానమునె కోరుదురెపుడు మానవతులు॥ 17

కావున సుదార దర్శన! కాంతలందు
నీ మనసు పరాఙ్ముఖమై చరించుచున్నఁ
గాని, యీ రూపమునకనువైన యట్లు
మిగుల దాక్షిణ్యముగ నుండఁ దగును గాదె॥ 18

దాక్షిణ్యమె భూషణమగు
దాక్షిణ్యమె యౌషధంబు దయితల యెడలన్
దాక్షిణ్య శూన్యరూపం
బీక్షితియందు ఫలపుష్పహీన వనంబౌ॥ 19

దాక్షిణ్య మాత్ర భావము
నీక్షించి యయినన్ బరిగ్రహింపుము వీరిన్
ఈక్షితి దుర్లభ విషయము
లీక్షణమునఁ బొంది ధిక్కరించుట తగునే॥ 20

పురుషార్థములఁ గామమును శ్రేష్ఠముగ నెంచి
యింద్రుఁడున్ గౌతమునింతిఁ గోరె
ఋషి యగస్త్యుఁడు సోము నింతినిగోరి
యట్టి లోపాముద్ర నతివఁ బొందె
మఱి యుతథ్యుని భార్య మరుతు కూఁతు మమతఁ
బడసి గీర్పతి భరద్వాజుఁ గనియె
తగు బృహస్పతిభార్య తారను గాంక్షించి
పూర్వము చంద్రుఁడు బుధుని గనియె

కలిసెను పరాశరుఁడు మత్స్యకన్యఁగాళి
నా వసిష్ఠుఁడు మాతంగి నక్షమాలఁ
గలిసియుఁ గపింజలాదుని గనియె మునుపు
వయసు చనినన్ యయాతి విశ్వాచిఁ గలసె॥ 21

స్త్రీని గలియఁ జావగునని తెలిసికూడ
పత్ని మాద్రిఁ గలిసి చనెఁ బాండురాజు
బ్రాహ్మణ సు న్ హరించిన కరాళజనకుఁ
డతనువికి వశుండయి యుండు నలరలేద॥ 22

ఇటులు నింద్యమయ్యు విషయాతిమహాత్ము
లనుభవించిరి నీవా న్యాయ్యంబులైన
వీనినె తిరస్కరించెద, వద్దియేమి
పైఁగ యువకుఁడవు సురూపి వధిక బలివి॥ 23

ఇటులన్ మిత్రుఁ డుదాయి వాకొనఁగ నా పృథ్వీశ పుత్రుండు నం
తట నాలించుచు మేఘగర్జన సమానంబైన గంభీర వా
క్పటు తన్ వాకొనె మిత్ర! నీవనిన వాక్యంబైతె యోగ్యంబ నే
నిట వాక్రుచ్చెడు మాటగూడ విని నీయిష్టంబు వాక్రువ్వుమీ॥ 24

విషయంబుల్ నిరసింప; నే నెఱుఁగుదున్ విశ్వంబు లెల్లప్పుడీ
విషయాలన్ బడియుంట యస్థిరము లీవిశ్వా లనిత్యంబులౌ
విషయాలన్ రుచిలేదు నామది; రుజావృద్ధత్వ మృత్యుల్ భువిన్
విషమం చెంచక సంతసిల్లుదు నవే నిత్యంబులే యైనచో॥ 25

నెలఁతల మేని యందములు నిత్యము లేయగునేని కామముల్
పలువిధ దోషముల్ గలిగి వర్తిలినన్ మదినేను వానిలోఁ
గులుకుచు నుండు వాఁడఁగద, కోమలి రూపము వార్థకంబుచే
నిల నెపుడైతె గ్రింగఁబడు నెట్టు లసహ్యపు మేనఁ జొక్కుదున్ 26

ఎపుడైతే-నిటులైనఁగాని-యవికాంక్షింత్రొక్కొ, వ్యామోహమే
యపుడౌ, వ్యాధిజరామృతుల్ గలుగు మర్త్యవ్రాతమేయట్టిరో

గవుదేహాలు జరామృతుల్ గలుగు నాకాంతాళితో నుంద్రా వా
రవు డింకన్ బుపపక్షతే యగుటలో నాశ్చర్య మేమున్నదే 27

ఆ మహాత్ములు గూడఁ గామాత్ములగనె
యయి రనుచు నంటి, వారి విషయంబు నందు
వారికి క్షయమైనప్పుడవ్వారియందు
చూపవలయును సంవేగ రూపమెపుడు. 28

వారు మాహాత్మ్యములు గల వారదెట్లు
క్షయము సామాన్యముగ నెల్ల జనుల కగును
సంయతాత్ముల కెపుడు నాసక్తి యుక్తి
కలుగఁబోవు వానికి వారు కారు వశము 29

అనృతముక నైనస్త్రీలలోఁ దనరవలయు
ననుచు నెదియంటి వటువంటి యనృత మెఱుఁగ
మఱియు దాక్షిణ్యమునఁగాని మసలవలయు
నన్నదియు నేను సరిగా నరయ లేను 30

ఎందు ఋజుతయు నుండదో యందుదాని
ననుసరించు చుండుట నాకు ననభిమతము
అన్ని యెడహృదిన్ సంపర్క మలర కున్న
దానిగూర్చి ధిక్కారమె తలప వలయు. 31

ధైర్యమది లేనివానిని శ్రద్ధ దనరు వాని
కరము నాసక్తు, దోషముల్ గనని వాని
మిగుల ననురాగములతోడ మెలఁగువాని
వంచనము చేయరాదని యెంచవలయు॥ 32

ఒండొరులు ననురాగములతోడ నుండి మిగుల
వంచనము చేసి కొనుచుండి వరలు నెడల
అట్టి పురుషులు స్త్రీలను నరయరాదు
అట్టి స్త్రీలును పురుషుల నరయదగదు 33

ఇట్టులైనప్డు దుఃఖార్తినిట్లు కుంది
జరయు మరణంబు పొందగాఁ జాలునట్టి
నన్ను నిద్యాముతై యెప్పు నట్టి యుట్టి
కామముల మోసగి చుట యుక్తంబుగాదు 34

చంచలములైన కామాల సారమెంచు
నీ మనస్సెంత ధీరమై బలమై మెలంగు
మరణ పథములఁ జనియెడి నరులఁగనుచు
భీతిఁగని కూడ విషయాల వెంటఁబడెదు 35

వ్యాధి జరలను మృత్యుభయాల నెంచి
నే నయితె భీరునయి, తైతివ్యాకు లుండ
వహ్నిచే జగంబు తగులంబడుటఁగనుచు
శాంతి పొందను ధృతిపొంద సౌఖ్యమొంద॥ 36

మృత్యువది యవశ్యము వచ్చునెఱుఁగు నరుని
హృదిని రాగఁబు జనియించునేని యింక
నెవఁడతి భయాల ముదమొందు, నేడ్వొకుఁడు
న[illegible]ని చైతన్యమె యయోమయంబయనెదు॥ 37

అనుచు రాకొమరుఁడు కామ హంతయైన
నిశ్చయాత్మక భావాన నెగడియుండె
జనములకు లోచనంబయి దనరునట్టి
సూర్యుఁడో యస్తగిరి గుహఁజొచ్చె నింక 38

విదప భూషలు మాలికల్ వృథగఁ దాల్చి
కళలు ప్రేమల్ గుణములు నిష్ఫలము గాఁక
నిజ మనమున స్త్రీలు స్మరుని గ్రహించి
భగ్న నిజమనో రథలై స్వావసతిఁజనిరి॥ 39

ఇఁకఁబురోద్యానమున నున్న యెల్లజనుల
శ్రీలు సంజను నుపసంహరింపఁ బడఁగ

ఎల్లెడల ననిత్యతను దర్శించు చుండి
క్షితిపతి కుమారుఁడంత స్వగృహముఁ జొచ్చె 40

తన పుత్రుండు సమస్తభోగ విముఖత్వం బొందు టాలించియా
జనపాలుండు-హృదిస్థ శల్యమున క్లేశంబొందు నేనుంగు తీ
రున-నారేయియు నిద్రపట్టకయె పుత్త్రున్ నిల్పు మంత్ర్యాదులన్
గని యాలోచన చేసి భోగముల కన్నున్ గాంచఁ జేయుక్తులన్॥ 41

ఇది
పదవ యాశ్వాసము



# బుద్ధ భగవానుని చరిత్ర

# పదునొకండవయాశ్వాసము

## సిద్ధారుని యుద్వేగము

అటు సిద్ధార్థుఁ డనర్ఘభోగములచే నాకర్షితుండయ్యు నిం
కటు వైపేగఁడు, ధైర్యమొందఁడు సుఖంబందండెదన్ శాంతి వి
మ్మటు పోవన్ విషదిగ్ధ బాణహత సింహంబట్టులై శాంతి కు
ద్భటు మిత్రాదులు రాఁగ-చూడఁ జనెఁ బిత్రాజ్ఞన్ వనీదృశ్యముల్ 1

క్రొంబసిఁడిగంట మువ్వాలు మ్రోగుచుండ
చామరంబులు పైఁడి భూషలును గదల
ఛంధకుఁ డుత్రోల కంథ కాశ్వంబు నెక్కి
వెడలి సిద్ధార్థుఁడటః దున్ను పుడమిఁజూచె॥ 2

నాగలి దున్నుచుండఁగఁ దృణంబులు దర్భలుపైకి లేవ నా
నాగలి క్రిందఁ జచ్చి పడినట్టిమహాక్రిమి కీట సంతతిన్
వేగని రాసుతుండపుడు వీనుఁ గులౌస్వ జనాల, గాంచిన
ట్లే గని లోన లోనఁ గుమిలెన్ మది శాంతిని కోలుపోయెనున్ 3

దున్నుచు నెండ వేడిమికి ధూళికి మేనులు వాడి వత్తలై
వన్నె తఱుంగు పూరుషుల, నాగలిలాగఁగలేక స్రుక్కునా
దున్నల నెద్దులన్ తొరగఁ దోలుచు వారల కొట్టు దెబ్బలన్
తన్నులఁగూలు నా హృదయదారక దృశ్యము చూచి వెంటనే 4

ముందుకుఁ బోవలేక విభు పుత్త్రుఁడు గుఱ్ఱమునుండి చట్టునన్
గ్రిందికి దూకి దుఃఖమెదఁ గేవలమాపు కొనంగ లేక యే

కుంచుము నెఱచె “నింపుఁబ్రజకూయిడి యెంతగ దారుణ వ్యాకన్
డిందు నెడంద దైన్యము గడిందిగ గాంచుచు నుందురో కదా॥ 5

ఒంటిగ నతఁడుండఁ దలఁచి
వెంటఁబడు సఖుల వలదని వెనుక నిలిపి తా
నొంటిగఁ బోయి, దళంబులు
మింటిఁగదలు నేరెడుదరి మెల్లఁగఁ జేరెన్॥ 6

పచ్చజాల వంటి పచ్చిక బయలున
శుచిగ నొప్పు నట్టిచోట నతఁడు
జగము సృష్టి లయము సంగతి చింతించె
మనసు స్థిరతఁ గూడఁగని గ్రహించె॥ 7

మనసు వెంటనె స్థిరతను గన నితండు
విషయవాంఛ మనోవ్యాధి విడిచి యపుడు
మదిని సవితర్క చింతలఁ బదిల పఱచి
త్వరగ ద్వేషరాగరహిత ధ్యానియయ్యె 8

మఱి వివేకముచేఁ గల్గు పరమ సుఖము
గల మన స్సమాధినిబూని శాక్యసుతుఁడు
మనసుచే లోక గతిని శోధనముచేసి
హృదిని ధ్యానించి చక్కఁగ నిటులు తలఁచె॥ 9

“జనులు స్వయముగ రోగము జరయుఁ జావు
నొందు వారౌట నవశులై యుండికూడ
వృద్ధు రోగిని మృతు దీన దృష్టిఁజూచి
హృది మదించి యజ్ఞత ననహ్యించు కొంద్రు॥ 10

ప్రకృతిగా నేను నిటువంటి వాఁడ నైన
ఇట్టి వానిని నేనసహ్యించు కొంటె
ఇట్టి ధర్మమ యిదియని యెఱుఁగు నేను
ఇట్లు దలఁచుట తగదు మేలిదియుఁ గాదు 11

ద్ధార్థుని యుద్వేగము

ఇటుల నున్న దున్నట్లుగ నెల్ల జగతి
జరను రోగాల మృతిని దోషములు చూచు
నతని మదినుండి క్షణములో యౌవనమునఁ 12
గలుగు మదమెల్లయును నీరు గారిపోయె

హర్ష మొందఁడు ననుతాప మందఁడతఁడు
సంశయింపఁడు గనఁ డలసత్వమేని
నిద్ర చెందఁడు కామాల ముద్రగనఁడు 13
ద్వేష మొందఁడు నెవని నిందింప లేఁడు॥

ఇటుల నా మహాత్మునికి నంతేని రజను
లేని బుద్ధియై శుద్ధమై వృద్ధిపొందె
ఇంతలో దైవ వశమున నెవఁడో యొకఁడు 14
భిక్షు వేషంబుతో సమీపించె నతని॥

కరుణన్ నిండియు సుప్రసన్నములెయౌ కండ్లన్ విలోకించుచున్
మెఱుగుంబంగరు మేని కాంతులు దిశల్ నింపన్ జివుళ్లట్టులే
యరుణంబై తగుకాషాయిదాల్చి, విమలంబౌ నాస్య పద్మమ్ముతో
పరమ ప్రేమ తరంగ పూర్ణహృదిఁ జూపట్టెన్ వనిన్ మౌనియున్ 15

మౌని నాతని గన్గొని క్ష్మాపసుతుఁడు
యాతఁడెవఁడు సూత! యెటుల నీతఁడుండె
అని యడుగ నప్పుడాసూతుఁడనియె నిటుల
"ఈతఁడు మహాభాగ! పరిశుద్ధ హృదయుఁడెపుడు 16

అతి పవిత్రశీలుఁడు పరమార్థ గురువు
వాసనలతోడ సర్వపాపముల వీడి
జరయు మొదలౌ వికారాలు సర్వమడఁచి 17
భవజలధి దాటి నిర్వాణ పదముఁ బొందు॥

అనుచు సూతుఁడు చెప్ప సిద్ధార్థుఁడపుడు
అతని నడిగె నీ వెవ్వఁడ" వనఁగ మౌని

యిటులననె "నరవర! జన్మ మృత్యు భీతి
క్రమముఁదైతి మోక్ష మొంద సంన్యసింతు॥ 18

క్షయమె ధర్మముగాఁ గల జగతి మోక్ష
మొదవ శుభమక్షయ పదంబు వెదకుచుంటి
స్వ పరజనముల సమబుద్ధి వడసి నేను
విషయముల రాగదోషంబు విడిచినాఁడ 19

ఏదో యొకచెట్టు క్రిందనో, యెవరు లేని
చోటనో, గిరినో, ఏ వనవాటి యందో
వాసముండుచు నిచ్చినప్పటికిఁ గొనక
ఆశ విడి, భిక్షగొనుచుఁ బరార్థమునకు 20

అనుచు భిక్షువు సిద్ధార్థుడరయు చుండ
ఇచ్చ వచ్చినచోటికి నెగిరి పోయె
ఇటులె యిటు వీడ సిద్ధార్థుఁడెంచి పురికి
విస్మితుఁడయి పోయె వనికొ వెళ్ళఁడయ్యె 21

జరయు మరణంబు రోగాలు క్షయము చేయు
సాధనకు వనిం దపమును జలుపఁ దలఁచి
అడవులకుఁ బోవ దృఢ నిశ్చయంబు చేసి
కామమునఁగాక ముక్తికై కదలెఁ బురికి 22

పురిని బాటల నాతండుపోవ, దారి
నంతనొక రాజకన్య సిద్ధార్థుఁజూచి
ఇట్టి పతిగన్న యాయింతి యెంతధన్య
యెంత సుఖురాలో యని యంజలించి యనియె॥ 23

అపుడ సిద్ధార్థుఁ డాపలుకాలకించి
తన ప్రయత్న సఫలతకై తన్వి యనియె
ననుచు మెడలోని హారము నామె కిచ్చె
అతఁడు ప్రేమించి యిడెనంచు నామె తలఁచె 24

అంత

బంగరు శైలంపు శృంగమున్ బోలిన
మేని కాంతులు దిశల్ మేలుకొలుప
ఏనుంగు తొండముంబోని బాహులు గల్గి
ఘన గర్జనము వంటి ధ్వని దలిర్ప
వృషభ చక్షులఁ బోలి యింపారుకనులొప్పి
పూర్ణచంద్రుని మించుమోము మెఱయ
సింహ విక్రమ మొప్పి సింహపు నడకల
నక్షయ ధర్మంపుఁ బక్ష మెసఁగ

గృహముఁ జేరి-మంత్రులతోడ గృహము నందు
నెసఁగి-మరుతులతో నున్న యింద్రుఁ బోలు
తండ్రికి-సనత్కుమారుఁ బోల్ తనయుఁ డతఁడు
ఎంతో నమ్రత మ్రొక్కుచు నిట్టులనియె॥ 25

"ప్రియజనక! దేవ! యనుమతి
దయచేయుము మోక్ష మొందఁ దరలెద నని, కె
ట్లయున జనులకు వియోగం
బాయవశ్యము జరగితీరు భువి నెల్లెడలన్॥ 26

అని కుమారుండు తనయనుజ్ఞ వేడుటయు రాజు వినియిట్లనెను. "నాయనా; యీ ప్రయత్నంబు నుండి విరమింపుము ఇది ధర్మాచరణంబు నకుఁ దగిన కాలంబు కాదు. నీవు చిన్నవాఁడవు బుద్ధి చంచలము గాన దోషము లెక్కువ సంభవించును. అందుచే ధర్మాచరణము కష్టమ్ము విషయ. బులందుఁ కుతూహలముగల యింద్రియములు గలవాడయి ప్రతి కష్టంబులందు స్థిరయ బుద్ధిలేని యువకుండును వివేకమున విశేషించి జ్ఞానము లేనివాఁడుగాన వాని మనస్సు చలించును నీకు ధర్మములనఁ బ్రియములని యెఱుంగుదును మా బోంట్లకిది ధర్మాచరణకుఁ దగిన గాలము యోగ్యుఁడ వైన నీయందు రాజలక్ష్మి నుంచి నేను తపో వనంబులకు వెళ్లవలయు ఓ స్థిర విక్రమా! పరాక్రమము నీకు ధర్మము. తండ్రిని విడచి వెళ్లుట

ధర్మముగాదు. కావున నీ వీనిశ్చయంబు మానుము గృహస్థ ధర్మమున నిరతుఁడవై యుండుము పురుషుఁడు వయస్సున సుఖములనుభవించి పిదప తపోవనమును బ్రవేశించుట రమణీయమైన పని " అని ఇట్లు తండ్రిపలుక విని ఆ రాకొమరుండు పావురంపు సవ్వడిబోని మధుర మందస్వరముతో నిట్లనియె.

"నివి నాల్గిటియందు బాధ్యత వహింతేన్ నేఁదపోవాటికిన్
పోవన్ మానెద, మృత్యునోఁటబడకే పోఁజాలుదేన్, రోగముల్
జీవిన్ మేనుసడల్పవేని, జరయున్ జెన్నారు నీ దేహమున్
వేవే మ్రింగద యేన్ విపత్తిగననేన్ నేనుండుఁదండ్రీ! యిటన్॥ 27

అనియిట్టుల్ ప్రకృతిన్ విరుద్ధమగు వాక్యంబుల్ సుతుండాడఁగన్
ని శుద్ధోదనుఁడిట్లనెన్ "ఇదుము తండ్రీ! యిట్టి యుద్దేశముల్,
కను నీ కోర్కె క్రమంబులేని; దెచటుం గానీ మనోవాంచ తీ
రునదే, యిందపహాస్యమే యగును కోర్కుల్ కోరకీరీతిగన్॥ 28

అనఁగ మేరు ధీరుండు సిద్ధార్థుఁడపుడు
చెప్పె గురుతోడ "ఇటుఁ గ్రమంబొప్ప దేని
ఇట్టులాపకుము తగులబెట్టఁబడెడు
నింటి వెలువడునరు నాపుటేమి తగునె॥ 29

జగతిని వియోగమే యవశ్యంబె యైన
ధర్మమునకై వియోగముత్తమ వరంబు
స్వార్థమది తీరకయె ముందె యవశునన్ను
మృత్యువే విడఁదీయును నిది నిజంబు॥ 30

అని వచింప భూపతి. మోక్షమునె వరించు
తనయు నిశ్చయమును విని "వినుముఁగాని
తను విడిచి వెళ్ల" డటంచుఁ దలచి మదిని
కట్టు దిట్టాలు చేసి భోగాలె గూర్చె 31

సచివులును గుసట్టులు శాస్త్ర రీతి
స్నేహముం నుపదేశముల్ చేసిరవల
కనుల నీళ్లు గాఱఁగ వలపనియెఁ దండ్రి
యింక సుతుఁడా శోకించుమన్ గృహము చొచ్చె॥ 33

మోములను కు తలంబులు ముద్దులిడఁగ
కమలి నిట్టూర్పులన్ బొమ్ము కంపమొద
దీనముగ భీతనేత్రాల స్త్రీల చేత
చిఱుత లేళ్ళచే బలె నతండరయఁబడియె॥ 34

మేరు గిరిపోలె ధవళమౌ మేనిచేత
కోమలుల హృదిన్ బిచ్చినిగొల్పి యతఁడు
వాక్కుచే వీనులను నోడల్ స్పర్శ చేత
కనులఁ దనుకాంతిచేఁ గాంతలను హరించె॥ 35

అంత సిద్ధార్థుండు కోర్కెలనుబోలె సూర్యుండు తనకరముల నుపసంహరించుకొని ప్రశాంతి గైకొనుటయు నంత

తన ప్రాసాదము చేరి స్వర్ణమయమై తళ్కొప్పు సింహాసనం
బునఁ గూర్చుండియుఁ నల్గడన్ పరిమళంబుల్ గుప్పుధూపాల, నం
గన లింపారఁగఁ జూపు నృత్యగతులన్ గండ్లన్ సమర్పించుచూ
చునెగానీ రమియింప డందు ముదమున్ జూపం డుదాసీనుఁడై॥ 36

తమ నృత్యంబులు గుప్పి చూపినను నుత్సాహంబు చూపింపకే
యమనస్కుండయి యొద్దు మొద్దువలెనే యైపోవు సిద్ధార్థునిన్
తమి మీఱన్ గనిపాడి యాడియు నిరుత్సాహాన నాయ్యార్లు నృ
త్యములున్ పాటలు మాని నిద్రకు వశంబై సోలిరచ్చోటనే॥ 37

ఒకతె సోకి వణంకెడు స్వకరమందు
చెక్కిలిని నాన్చి బంగరు చిత్రరేఖ
దనరు వీణను నిష్టమైనను త్యజించి
కోపమునఁబోలె నోడిజార్చి గుఱ్ఱుపెట్టె॥ 38

ఒకతె వాయించు వేణువునుంచి కేల,
పయఁట క్రిందికి వడి జాఱిపడఁగ సోలి
మఱఁగి తుమ్మెదల్ వ్రాలు తామరల నొప్పి
నుఱుగుచే నవ్వఁగల్గొప్పు సరసిఁ బోలు 39

మెఱుఁగు పసిఁడి నగలు దరిసిరాయనొకర్తె
యబ్జ మధ్యమముల నతిమృదువగు
కేలుదోయిఁ బ్రియునిబోలె మృదంగమున్
గుచ్చి కౌఁగిలించుకొని పరుండె॥ 40

నవ సువర్ణ రంజిత భూషణములఁ దాల్చి
విలువలేని పచ్చనిపట్టు వలువ లూని
యంగన లొకంద్రు నిద్రచే నవశలగుచు
గజము విఱిచిన జేల శాఖలుగనైరి॥ 41

చానయొక్కతె కిటికీని నానుకొనుచు
ధనువు వలెవంగు నడుమునఁ దనరియుండె
లీల ముత్యాల సరములు వ్రేలుచుండ
తోరణపుసాల భంజిక సౌరులొలుకు॥ 42

మణుల కుండలాల్ చెవుల కమ్మలను గఱవ
వేఱొకతె వంగిన మొగంపు నీరజంబు
వ్రాలికారండవపుఁ బక్షివంచ నగము
వంకరగుతూడుగల తమ్మివలెఁ దనర్చు॥ 43

బొమ్మ బరువులమేను నమ్రమ్ము కాఁగ
కొందఱు లలనల్ కూర్చుండి క్రొంబసిండి
కంకణంబులుగల తమకర యుగాల
నొండొరులఁ బొదువుకొని పరుండిరచట 44

ఒకతె బంగారు హారంబు లూగుచుండ
సప్తతంత్రుల వీణె మూర్ఛనలు చేసి

నిద్ర ముంచుకొనుచురాఁగ నెయ్యురాలి
నటులఁ గౌగలించుకొనియె యటఁ బరుండె॥ 45

యువతి యొకర్తె స్వీయబాహువుల నుండి
పణవమును దానిదే పాశమును విదిర్చి
సోలుకాంతుని తొడలలోఁ జొచ్చినట్లు
చానివి నిద్రకు లోఁబడి కునికె నంత॥ 46

అంతఁ గొందఱింతులు విశాలాక్షులయ్యు
కదలు కన్బొమ్మలలరఁయుఁ గనులు మూసి
భానుఁడస్తమించఁగ సర్వపద్మకోశ
ములను ముకుళపనొప్పెడు నళినులైరి॥ 47

కురులు చెల్లచెదరుకాఁగ, మెఱయు నగలు
చీరయును నంత మొలనుండి జాఱ నొకతె
కంఠహారాలుఁ జెదరఁగ గజము విఱువ
భువిని పడిదారలెడి యింతి బొమ్మఁబోలు॥ 48

ధీరలయ్యును సుందర దేహలయ్యు
అవశలై నిగ్గువిడి యసభ్యముగ సోలి
చేతు లిటునటు పాఱవేసియును గుఱ్ఱు
పట్టి యావలించుచు స్త్రీలు వ్రాలిరొకరు॥ 49

అలరు దండలు నగలిటునటులు చెదర
చీర ముడుఁగును విడిపోవ స్మృతులు లేక
కదలకయు మూయుతెల్లని కనుల నొకరు
నిదురకును లొంగి శవముల కదువులైరి॥ 50

ఒకతె నోరు తెఱచి పడియొడలు పెరుగ
చొంగ కార్చుచు పైకి గుహ్యాంగ మెదల
నిద్ర మత్తున సడలియునేలఁగూలె
ఒడలు వికృతమై యసహ్యమొదవఁజేయ 51

ఇటుల వారివారి యస్వీయ ప్రకృతుల
కనుగుణముగ నటుల నటఁ బరుండి
పెనుతుపాను వీచి విఱిచి మెల్వొట్టిన
తమ్మికొలను పోలెఁ దరుణులైరి॥ ౯౨

అందమైనరూపు మధురమైన నుడులు
గలుగువారయ్యు సుదతు లక్కడఁ బరుండి
చటుల చేష్టలై వికృతలై యటుల సోల
నృప సుతుఁడు చూచి మదినేవగించుకొనియె॥ ౯౩

కామినుల యా ప్రకృతి జగంబునందు
అశుచి వికృతంబు; భూషణాదికముల
పూరుషుడు వంచితుడగుచు పొలతులందు
రాగమోహంబులను బొంది రక్తుఁడగును॥

## సిద్ధార్థుఁడు ఇల్లు విడిచి పోవుట

మనుష్యుఁడైనవాఁడీ తరుణుల స్వాప్నవికారస దృశమైన యీ స్వభావమును పరిశీలించి నిజముగ వీరి యెడలఁ బ్రమాద పడరాదు గుణ సంకల్పములచే హతుండయి రక్తుఁడగును. అని యిట్లు తెలిసికొని నిద్రించిన యువతులను లోన నేవగించుకొను నతనికి అపుడే రాత్రియందు ఇల్లు వీడఁ దలఁపు గలిగెను. అపుడతని భావమును గ్రహించి దేవతలును భవనద్వారమును తెఱచిరి ఇంతలోఁ జివరిసారిగఁ దన యశోధరయగు యశోధరను చంద్రుని వంటి రాహువువలె ఆకర్షించు రాహులుని జూడఁగోరి యంతఃపురంబులోనికిం జని నిద్రించు తన యర్ధాంగికిఁ జెప్పిపోవువాఁడై దరికిఁ జనియు లేపినచో తన ప్రయాణమునకు ఏమి విఘ్నంబు సంభవించునోయని పతి యర్ధాంగిని కుమారుని జూడకయ వెనుకకు మరలి ప్రాసాద తలంబు నుండిదిగి నిర్వాశంకుఁడయి మొదట * భవన కక్ష్యను బయలు వెడలెను అట్టు వెడలి

* రాహులుఁడు పుట్టిన దినమే సిద్ధార్థుఁడు ఇల్లు వీడినట్లు బౌద్ధ గ్రంథములు.

అశ్వచోదకు ఛందకు నంతవేడి
యిట్లనియె ఛందకా! త్వరగ హయంబు నిపుడె
తీసికొని రమ్ము యమృతంబు తెచ్చుకొఱకు
నిచ్చటు నుండి పోవలయు నిపుడరమ్ము॥ 54

నాకిపుడ హృదయమున నానందమొదవె
మనసులో నాకు నిశ్చయ మతిజనించె
జనరహితవని నాకు నాశ్రయము దొరకు
ఎదుట నాకులక్ష్యంబు సిద్ధించె నిపుడ 55

సిగ్గును వినయంబును విసర్జించి యెట్లు
యువతులును నా యెదుటె నిద్ర నొందినారొ
తెఱవకుండనె తలుపులు తెఱవఁబడెనొ
యటులె నేడిట వచ్చె నేనరుగువేళ॥ 56

అత ఛందకుఁడు వడి సిద్ధార్థునాజ్ఞఁ
బ్రభువు శాసన మెఱిఁగిన వాఁడెయయ్యె
ఎవరొ ప్రేరణమదిఁ గలిగించునట్లు
అశ్వమును కొని రా నిశ్చయాత్ముఁడయ్యె॥ 57

బంగరు కళ్లెమున్ దనర బాగగు మెత్తని జీను గల్గియున్
చెంగున దాటి గమ్యమును జేర్చు జవంబును సత్వ మొప్పియున్
వంగిన మ్యతో వెడఁదఫాలముతోఁ జిఱుతోక వీనులన్
రంగయి యొప్పు కంధక తురంగమమున్ వడిఁదెచ్చె నంతటన్॥ 58

పృథుల వక్షంబు గలుగు నా నృప సుతుండు
సేన మధ్యా కుఁజనువీరు చెలవుతోఁప
తామరపువుఁబోని కరాన దానిఁదట్టి
మధుర గంభీర వాక్కులంబలికె నిట్లు॥ 59

నృపతి నీమీఁద నెక్కి యనేకరిపుల
యుద్ధ రంగంబులందునునోర్చి గెలిచె

నటుల నేఁగూడ మృతిగెల్చి యమృతపదము
నెటులఁ బొందుదునో యట్లు నీవు చేయు। 60

ఆజిలో విషయ సుఖధనార్థముల
సాయపడు వారు సులభులై జగతి నుండు
పతితు కష్టాల ధర్మంపుఁ బనులయందు
నరులకును సాయపడువారు దొరక రెందు॥ 61

పాపములఁగాని పుణ్యంపుఁ బనులఁగాని
సాయపాడువారు వాని యంశములఁ గొంద్రు,
ఇట్టి నా పయాణమె జగద్ధితము కొఱకె;
యతనమూను నీకును జగద్ధితమునకును॥ 62

వనికిఁ బోనెంచి యిటు స్నేహితుని విధాన
ప్రేమతో తురంగమమును గురించి పలికి
ఛానుఁడు శరదభ్రంబును వలెను త్వరగ
నగ్ని వంటి యాతఁడు తెల్లహాయము నెక్కె॥ 63

అవల గంధకమును సాహయంబు గూడ
నిశలఁజేయు తీవ్రమగు ధ్వనిని త్యజించె
డెక్కలను కొట్టు దునుసకిలింపఁబోదు
రౌతువలె నిదియును శమప్రకృతిఁ జనియె॥ 64

బంగరు కడియాల కరాల వఱలియుండి
మేనులను వంచి యక్షులున్ మెల్ల మెల్ల
గుజ్జు పుండెక్కలకుఁ గ్రింద కోమల దలంపు
నళినములఁ బోలు కేలులంబఱచి రేమొ॥ 65

పెద్ద గడియలు గట్టిగా వేయఁబడియు
నేవి సులభముగ మధపు కేన్గులైన
వడిఁదెఱవలేవొ యాకోట ద్వారములును
తెలిసి వడిఁ జప్పుడులు మాని తెఱచుకొనెను॥ 66

తనపైఁ బ్రాణము పెట్టుకొన్న జనకున్, తండ్రెవ్వరో గూడఁ జూ
డని బాలున్ సుతు రాహులున్, బ్రణయరాశై భర్తృపాదాల న
మ్మిన యర్ధాంగి యశోధరన్, జలధి సీమీభూత సామ్రాజ్యల
క్ష్మిని నిర్వాణపు లక్ష్మికిన్ బలియిడెక్రి సిద్ధార్థుఁ డోజస్వియై॥ 67

ఈ విధముగ సిద్ధార్థుఁడు సర్వలోక కార్య సిద్ధ్యర్థమై కృతనిశ్చయుఁడయి తన తండ్రి నగరంబు వెడలి యింక జనన మరణంబుల సారంబు చూచి కాని యీ కపిలవస్తు పురిని ప్రవేశింపనని ప్రతినపూని సింహనాదంబు చేసి వనుల వైపు చనియెను. సిద్ధార్థుని యీ నిశ్చయంబెఱింగి కుబేరుని పారిషదు లానందించిరి. దేవగణంబులమనసు ఉల్లసిల్లెను. హుతవహశరీరులైన యుత్తరది వౌకసులు సంతసించిరి. సిద్ధులు మేఘంబుల సందులనుండి చంద్రకిరణంబులువలె మంచు నిండిన మార్గంబుల ప్రకాశద్యుతుల నిండిరి.

రవి తురగమ్ములవలె త్వర
గ వెడలు కంథక వరతురమునెక్కి మనసుచే
దివిఁ బ్రేరితుఁడట్లు, చనెనా
ప్రవరుఁడు నుష రాకముందె బహుయోజనముల్॥ 68

ఇట్లతఁడు బయలుదేరి ముప్పది యోజనములు గడచి రాయంచబోటులు తనఁగా మిగిలిన గమ్మితూఁడులు గలిగిన, గభీర మకరా రావములచే ప్రతిధ్వనించుచున్న. కెరటంబుల కణంబులజలము నక్షత్రములు గల యాకాశమువలె ప్రకాశింప, తామరపూల తావులచేఁ బరిమళించు పవనముగల, తరఁగల యుయ్యాలలనూగు బెగ్గురు పక్షులున్న, రాయంచల మెడలవరకు నీళ్ళతో నిండిన మీఁచాలిత పద్మకింజల్క రంజితమైన, విచ్చిన యెఱ్ఱతామర మరందంబుల తరంగంబులతో దూఁగుచున్న యనమ (అనోమ) యను నదిదరికి చని దానిని దాటిరి

ఇది

మహాభినిష్క్రమణమను

పదునొకండవ ఆశ్వాసము

# బుద్ధ భగవానుని చరిత్ర

## పండ్రెండవ యాశ్వాసము

### సిద్ధార్థుఁడు ఛందకుని టికిఁ బంపుట

అంతలోక చక్షువౌ రవియుదయించు
నా ముహూర్తమునకె యధిప సుతుఁడు
భార్గవముని వర్యు పరమ ప్రశాంతమౌ
నాశ్రమంబు చేరి యరసె నెదుట॥ 1

విశ్వాసముతో లేళ్లు అచట నిద్రించియుండెను పక్షులు స్తిమితములయి యందు గూండ్లలో నివసించుచుండెను ఆ యాశ్రమము నతఁడు చూచి విశ్రమించినట్లు కాఁగాఁ కృతార్థుఁడు అయ్యెను ఔద్ధత్యము త్యజించుటకును తపస్సును సమ్మానించుటకును తన యాచరణమును గాపాడుచు నతఁడు గుఱ్ఱమునుండి దిగి నన్ను దాటించివి అని వీపుతట్టి గుఱ్ఱముతోఁ బలికి కన్నులతో ప్రీతితో స్నానము చేయించువాఁడునుం బలెనయి ఛందకునితో నిట్లనియె.

గరుడునిం బోలు జవమునఁ బఱచు హయము
నడపి యో సౌమ్య! నాపైని నడరుభక్తి
శక్తిచూపిని పనులెన్ని జరగియున్న
నన్ని మాని నాకయివచ్చితయ్య! నీవు॥ 2

భక్తియున్నచోట శక్తియె యుండదు
శక్తియున్నచోట భక్తిలేదు
భక్తి శక్తి కలుగు వారలు నీవలె
ధరణిలోన నెందు దొరకరయ్య! 3

ఇట్టి నీదు శ్రేష్ఠ కృత్యంబుచేతను
ఎంతో నాకు మది జనించెఁ బ్రీతి
ఫలితమందు దృష్టి స్వల్పంబులేనట్టి
నీకు నాదుపయిని స్నేహమొదవె॥ 4

ఫలితమందు దృష్టి యలరెడు వానికి
భువిని నే నరుఁ దభిముఖుఁడు గాఁడు
ఫలము గోరకు నాశ యలరని యప్పుడు
స్వాజనుఁ డేని యన్యజనుఁడె యగును॥ 5

కులము కొఱకు సుతునిఁ గోరి పోషింతురు
పుష్టి కొఱకు పితను పుత్రుఁ డరయు
ఆశ్రయంబుకొఱకు నందఱు ప్రేమింత్రు
కారణంబె లేక కాదు తనది॥ 6

ఇన్ని మాటలిటు వచించుట యేలకు
చెవుదు సంగ్రహముగ; చేసితెంతొ
హాయముతోడ మరలి యరుగుము యింటికి
ఈప్సిత పద మిదె లభించెనాకు॥ 7

అపు డిటులని ఛందకునికి నుపకరింప
నా మహో బాహుపటు బారుమనుచు నేడ్చు
ఛందకునికి స్వాకీయ భూషణములిచ్చి
తన కిరీటమున మెఱయు మణిని దీసి॥ 8

## ఛందకుని సిద్ధార్థుడోదార్చుట

ఛందకా! నీవు పలుమార్లు జనకునికి
నాకు మారుగ వినయాన నతునొనర్చి
ఈ మణి నొసంగి మతి విశ్వసించి బాధ
తగ్గునటు లిట్లు చెప్పుమ తగినరీతి॥ 9

"జరయు మరణంబుఁ బాపఁగాఁ జనితి వనికి
స్వర్గమునుగోరి చనలేదు వనికి నేను
స్నేహములు లేకగా, దల్పచేతఁ గాదు
వగవఁ దగదెవ్వు తప్పదు వదలి చనుట 10

మన వియోగమెట్లును తప్పదని తలంతు
కనుకనే మోక్షమును పొంద వనికిఁ జనితి
స్వజనములనుండి యెడఁబాటు జరగకుండ
నెట్టులైన నుండుటకె యత్నించుచుంటి" 11

శోకముఁ బాపఁగ వెడలిన
నాకై శోకించుటయె యనర్థము నీకున్
శోకమునకు హేతువు లగు
నీ కామములందు రాగమిడు ప్రజశోచ్యాల్॥ 12

ఇదియైతే మన పూర్వుల
పదమే యయియుండుట యది ప్రకటమె గాదా
ఇదిగో నా దాయాదుల
పదమునఁ జనుచుండ నన్ను వలదనఁ దగునే॥ 13

కాలంబు తల్లక్రిందయి
వ్రాలినచో నాస్తికజనము వారసులేగా
ఈ లోకములో మాత్రం
బాలోకింప మెట ధర్ములగు వారసులన్॥ 14

ఆలోచింప ప్రజయను "న
కాలంబున వీడు వనికిఁ గదలె" నటంచున్
ఈ లోకమె చలముగద, య
కాలంబే లేదు ధర్మకార్యంబులకున్॥ 15

కావున నిప్పుడె ధర్మము
కావింపగ వలయు ననుట కడు నిశ్చయమే

జీవితమున నమ్మక మెది
చావే మన క తువగుచు సరసనె యుంటన్ ॥ 16

మరియు ఇట్లు లనేక విధముల నీవు సౌమ్యా! రాజునకుఁ దెలుపుము ఏ విధముగా నన్ను స్మరించి బాధపడకుండునో యట్లు చేయఁదగుదువు, మఱియు నేను గుణహీనుఁడనని కూడఁ జెప్పుము పోనీ యందువలనైన నామీఁదఁ గల స్నేహము వదలునేమో నిర్గుణత్వమువల్ల స్నేహముపోవును స్నేహమే లేనిచో శోకమును పోవును" అని సిద్ధార్థుఁడనుటయు విని ఛందకుఁడు సంతాపముచే వ్యాకుల చిత్తుండయి కన్నీళ్ళనిండి బొంగురుపోయిన వాక్కుతోఁ గృతాంజలి యయి యిట్లనెను

## ఛందకుఁడు ఏడ్చి సిద్ధార్థుని పురికిరమ్మనుట

"బాంధవుల బాధపెట్టు నీ భావమునకు
ప్రభూ! బురదఁబడు గజమట్లు బాధపడుదు
ఇట్టి నీ నిశ్చయమువిని యినుపగుండె
వాఁడు నేడ్చు, స్నేహమెయున్నఁ బ్రతుకుటెట్లు 17

ఎక్కడఁ బ్రాసాదములకు
మక్కువపడు నీదు సౌకుమార్యంబిదియో
ఎక్కడ గ్రుచ్చెడి దర్భల
మొక్కలు గల యీ కటిక తపోవన భువియో ॥ 18

నీ నిశ్చయంబు విని నా
చే నశ్వము దేఁబడి యిటఁ జేర్చఁబడితే
నేనో యేదో దైవము
చే నిటుల బలాత్కరించి చేయంబడితిన్ ॥ 19

నేనె గనుక నాదు వశము
లోనుండియు నీ మనస్సులో నిశ్చయమున్
గాని యెఱుఁగుదునేనియు
నేను గపిలవస్తునుండి యిటు తెచ్చెదనే 20

కనుక నో మహాబాహు! నిన్ తనయుఁ బ్రాణ
మటులఁ గనుము స్నేహంబున నరయు వృద్ధు
రాజుఁ దండ్రిని త్యజియింపరాదు సుమ్మి
నాస్తికుండు సద్ధర్మమున్ వదలినట్లు॥ 21

నిన్నుఁ బాలించి పోషించి నిరతమెన్నొ
శ్రమలఁ బడికుండు గౌతమిన్ జనని వృద్ధ
మఱచిపోవుట తగదెంతమాత్రమైన
సత్క్రియను కృతఘ్నుఁడు స్మరించని విధాన॥ 22

పాలువిడువని సుతునితో పాట్లుపడెడి
గుణవతిని గులమ్మున మెచ్చుకొనంగఁ దగిన
కడు పతివ్రత దేవిని విడువఁ దగదు
క్షితిని క్లీబుఁడు దరిఁజేరు శ్రీనిబోలె॥ 23

పుత్రుని యశోధరాత్మజుఁ బొగడఁ దగిన
వాని యశసు ధర్మముగల వారిలోన
శ్రేష్ఠుఁడగువాని, శిశునిఁ ద్యజింపఁ దగదు
వ్యసనములఁ దగులొ్కను వాఁడు యశము నటుల॥ 24

మఱియు బందులన్ రాజ్యమున్ మఱచిపోవ
మతిని నిశ్చయించితి విది మానవయ్య
విభుఁడ! నన్ను దీనుని నేటు విడువవయ్య
నీదు పాదాలె గతి నాకు నిరతమింక॥ 25

నిన్నరణ్యాల పాలుగన్ జేసియిపుడు
వనటలం దగులంబడు మనసుతోడ
విమలు రామున్ సుమంత్రుఁడు విడిచినట్లు
నిను విడిచివైచి పురికింక చనగలేను॥ 26

నీవు లేకుండ పురికిని నేనుపోవ
నా మహారాజు నన్నేమి యనునొ యేమొ

ఛందకుఁడు ఏడ్చి సిద్ధార్థుని పురికిరమ్మనుట

అకటా! యుచిత మెఱిఁగిన నే నంతిపురవు
వనితలకు నేమొగము పెట్టుకొని వచింతు॥ 27

"ఏను గుణహీనుండ" నని వచింపుమంటి
లేని దెటులందు, నిర్దోషి మౌనినట్లు
సిగ్గు గలహృదితోడ, నాల్కవచింపఁ గాక
చెప్పెదననుకో అది విశ్వసించు నెవఁడు 28

పిచ్చివాఁడెవ్వఁడేన్ చంద్రు వేడిగాను
చెప్పెనే యనుకో విశ్వసించునెవఁడు
అటులె నిను దోషిగ వచింప నెటులనమ్మ
దోషములె లేని నినుగూర్చి దోషవిదుఁడు 29

కాళ్ళ వ్రేళ్ళఁబడుచుఁ బ్రతిమాలునన్ను
దీను భటుని స్నేహితుని నెట్లైన విడకు
దయగని యనుగ్రహింపుము, దయఁదలంచు
ఇంటికిని మరలుమి ప్రభూ! ఇప్పుడైన 30

అని యిట్లు శోకముచే నేడ్చుచుఁ గాళ్లపైఁబడిన దీనుని ఛందకుని లేవనెత్తి స్తిమితమైన ధైర్యమును సుబుద్ధియుంగలిగి మాటకారులలో జాణయైన యాసిద్ధార్థుఁడు స్థితప్రజ్ఞుఁడై యిట్లు మరల పలికెను.

నాయెడఁబాటుకై వ్యథ గనఁదగ, దీయెడఁబాటొయిందునె
ప్డోయొకయప్డుగల్గు నదెయున్న స్వబంధుల వీడనేనియె
ట్లో యిటె మింగుమృత్యువపుడుర్వాని వచ్చియు వేఱవేఱ యెం
దో యొక్కచోఁ బుట్టుటదియున్నదెకాన విచారమేటికిన్ 31

ఎంతొ యాశతో వ్యధతోడ నెవతెనన్ను
గర్భమునఁదాల్చె నిష్ఫలకార్యయైన
యా జననికి నేనెక్కడ ఆమె నాకు
నెక్కడిది నిజమ్ము నెఱింగి పలుకు మీవు 32

గూళ్లలకు వేగుదెంచు పక్షులును గలిసి
విదప నిచ్చ వచ్చినపుడు విడిచిపోవు
అట్లె ప్రాణుల కలియక యగుచునుండు
ఆ కలయికయు నెడఁ బాటుదాఁకనుండు 33

మాటిమాటికిఁ గలియుచు మబ్బులుండి
మరలఁ గొంతకాలమునకు విరహమొందు
అటులె సంయోగము విరహంబగుచుండు
అనుచు నీవిషయంబున ననుకొనెదను॥ 34

లోకు లొండొరుల్ వంచించి రాకపోక
లాచరించుచు నుండెద రందువలన
కలను బోలిన యీసమాగమము నందు
మమత యుంచికొని వ్యాకుల బడుట తగదు॥ 35

సహజముగ జన్మతోపాటు జన్మమొందు
పర్ణముల రంగు విడిపోవుఁ బాదపముల
ఇట్టిచో నింక నన్యోన్యా మెపుడు:నిటులె
ఒకరొకరు విడిపోవక యుందురొక్కొ॥ 36

కనుక సంతాపమొందక చనుముసౌమ్య!
స్నేహమింక పోదయేనియున్ దిరుగరమ్ము
కపిలవస్తున నను బెంగ గనెడువారి
స్నేహము విడమను, విను నానిశ్చయంబు 37

"అతఁడు జన్మమృత్యువుల క్షయంబుచేసి
తొరగ నీమన కపిలవస్తునకు వచ్చు
ఒకవేళ యత్నింపక సిద్ధినొందడేని
చచ్చిపోవు రాఁడనుచు వాక్రుచ్చుమిత్ర!" 38

అని వచించు సిద్ధార్థుని యాపలుకుల
వినుచు కంథకతురగ మాతని పదాలు

నాల్కచేనాకె, వేడిగన్ గంటి నీకు
విడిచె తెలిసెనేమొ యతని సుడులభాష॥ 39

అపుడు సిద్ధార్థుఁడును స్వస్తి కాంక మొప్పి
వలనుబోలి చక్రము మధ్యనలరు చేతఁ
దట్టి యనె గంధక! "నీసదశ్వగుణము
తెలిపితి క్షమింతు, నీశ్రమ యిల ఫలించు" 40

అని మణుఁ బొదిగిన పిడికిలిగలిగి నల్లగల్లవలె నల్లనైన కరవాలమును ఛంధకుని చేతినుండి పుచ్చుకొని బంగారునగిషీకల యాకత్తిని ఒరనుండి-బిలమునుండి సామునువలె-పైకిఁదీసి చిత్రవిచిత్రమై మెఱుఁగులు కాంతులు చిమ్మెడు కిరీటమును దీసి తన మున్నని వెండ్రుకలను కోసి పైచినరస్సునందు హంసనువలె మింటిపై అభరణాదుల చిమ్మ ఆ చందకుఁ డేడ్చుచుండ వానికి నెలవిచ్చి సిద్ధార్థుఁడాయాశ్రమము వెడలి పోయెను. అట్లు ప్రభువు సిద్ధార్థుఁడు రాజ్యాదుల-దునిస్పృహచెంది ఛంధకుఁడు ఎంత మొత్తుకొన్నను వినక తపోవనము వైపుగా వెళ్ళిపోవఁగా అచంపకుఁడు చేతులు పైకెత్తి ఏడ్చుచును బారుమని అకంధకాశ్వమును కౌఁగలించుకొని నిరాశఁజెంది యికఁజేయునదిలేక మాటిమాటికి విలపించుచు పురము వైపుగా కేవల శరీరము ముందుకుఁ బోవుచుండ మనస్సు మాత్రము తపోవనమువైపు లాగుచుండ చంద్రకుఁడును వెడలిపోయెను. దారిలో అతఁడు వెళ్ళలేక నిలఁబడిపోయి నిశ్చేష్టుఁడై ధ్యానము జేసి, విలపించుచు, ఒకొక్క చోట తొట్రుపడుచు ఒకొక్కచోట నేలఁదూలుచు ఒకొక్కచోట ఆసిద్ధార్థుని భావంబులకు భక్తిపరవశుండయి మెచ్చుకొనుచు, ఇంతలో దుఃఖము అవుకొనలేక యేడ్చుచు తనవశములో లేక యనేకములగు చేష్టలు చేసెను ఇంతలో శాక్యవంశ శిఖామణియగు సిద్ధార్థునిజూచు వేడుకచేతఁబోలె సూర్యుఁడు దృక్కరంబుల చాపి యుదయాద్రినెక్కి నలువైపులఁజూడఁ దొడంగెను ఇంక భువిపైనున్న సిద్ధార్థముఖ చంద్రుఁడు పగలు కూడ దీప్తిమంతుఁడగుటఁజూచిపోలె మింటనున్న చంద్రుఁడు వెలవెల బోయెను. సిద్ధార్థుని జ్ఞానభాస్కరుఁడువోలె ఆకాశస్థిత భాస్కరుఁడు దిశల జ్యోతిస్సులఁ జల్లుచుఁ ప్రకాశించెను

ఇది

పంద్రెండవ యాశ్వాసము

# బుద్ధ భగవానుని చరిత్ర

## పదమూడవ  ాశ్వాసము

### సిద్ధార్థుఁడు తపోవనికిఁబోవుట

అతులన్ దుర్భర వేదనాశ్రుజల పూర్ణాస్యుండు నౌ ఛందకున్
త్రుటిలోనన్ విడియాస్థలేకవని ధైర్యోత్సాహముల్ పొంగ ముం
దటఁ భాసిల్లు స్వకీయ దేహరుచి చేతన్ బూని మా నాశ్రమో
త్కట భూమిన్ వెలిగించుచున్ జనియె సిద్ధార్థుండు సిద్ధుండటుల్॥ 1

మృగరాజ గమనుఁడాతఁడు
మృగములు గల యంగణమును మృగమటు చేరన్
తగు రాజ్యశ్రీచన మే
నఁగలుగుశ్రీచేఁ దపోవనప్రజఁదనిపెన్ 2

సమిధల కరిగి తిరుగ నా
శ్రమమునకుఁ బువులును బండ్లు సమిధలతో వ
చ్చు మునులు ప్రాఙ్ఞులై యయ్యును
తమ కుటులకుఁ జనక నిలచి రతనినేగనుచున్॥ 3

నీలమేఘముఁగనినట్లు నెమిళువెలమి
నీయనఘుఁజూచి కేకలు వేయసాగె
తృణము తినుటమాని మృగాలు కనఁదొడంగె
హరిణమటు చరించు మునులై రభిముఖులుగ॥ 4

భాసలోలుకుమఁ నుదయించు భానునట్లు
అట్టి యిక్ష్వాకుల దీపునపుడు చూచి

ఉదయమునఁ బాలునిచ్చియునున్నఁగాని
హోమధేనువుల్ మరలఁ బాలూరఁజేసె॥ 5

వసువులం దష్టమ వసువు వసుమతిపై
ప్రభవమొందియె యిట్లు వచ్చెనేమొ
అశ్వినీ దేవతలం దెవఁడో యొకఁడు
మించి జాజి యిలకేతెంచె నేమొ
స్వాంతాన భూలోక మరయ వేతెంచిన
దేవేంద్రు రెండవ దేహమేమొ
సకల చరాచర జగముల సారంబె
మూర్తి దాలిచి యిటం బొడమెనేమొ

అనుచు నాశ్రమ స్థిత జను లచ్చెరువునఁ
జెలిఁగి నానా విధంబులఁ బలుకుచుండ
చటుకునన్ దిగివచ్చు భాస్కరుఁడు వోలె
నెల్ల వనమున తనుకాంతిఁ జల్లఁ దొడఁగె॥ 6

పిదప నాశ్రమ వాసులు పిలిచి తగిన
వానిఁ బూజించి మర్యాద చేసిరపుడు
ఆతఁడు మేఘువలె గభీరమైన స్వరము
మీఱ నాశ్రమ వాసుల గౌరవించి॥ 7

స్వర్గమును గోరుసుకృతులు పఱలియున్న
యాశ్రమము మోక్షకామియై యిటులనిటుల
తిరిగి యాతపశ్చర్యల నరయుచుండి
యందు నొకతపస్వి నడిగె నాతఁడిటుల॥ 8

“ఇంతకుఁ బూర్వమెన్నఁడును నీగతి నాశ్రమమేను జూడలే,
దింతట నిష్టధర్మవిధులే నెఱుఁగన్, మఱి మీరలెందుకై
యెంతటి నుండియో తపములిట్లొనరింతురు, చెప్పుఁడీ” యనన్
అంతటఁ జెప్పె నాతపసి యాతపముల్ మఱి తత్ఫలంబులున్॥ 9

## సిద్ధార్థునికి తపస్వులు నానావిధతపములు చెప్పుట

మాకు ఆహారము వనమందలిదె కాని గ్రామములందలిది గాదు అదియు నీళ్ళలో బయలుదేఱి యుండవలెను. ఆకులు నీళ్లు పండ్లు దుంపలు ఇవె మునులమాహారము, ఇదె శాస్త్ర విహితమైనది ఇంక తపస్సులో వేలువేలుగా నున్నవి.

* "ఒకరుంఛ వృత్తితో నుంద్రు పక్షులవలె
మృగములట్లొక్కరు తృణము తింద్రు
ఒకరు పుట్టలవుదు రురగాలబలె గాలి
తించు; కొందఱు ఱాళ్లఁ దంచి తింద్రు
కొందఱు దంతాలఁ గొఱుకుచుం దిందురు
కొంద ఱతిథులకై కూర్చి తిండ్రు
కొందఱు నీళ్ళతోఁ గూడ జడలు తడ్పి
యిరుమార్లు మంత్రాల్ జపించి వ్రేల్త్రు

కొందఱుదకాలఁ జేపలఁగూడి మునిఁగి
మేను తాఁబేళ్లగీయుచు మెసలుచుండ
వివిధ తపములెప్పుడును గావించుచుంద్రు
ఆవరవర తపస్సుల నట్టిభువులెగాంత్రు 10

కష్టకర మార్గములచేతఁ గలుగు సుఖము
ధర్మమూలము సుఖ"మని తపసి తెలుప
తత్త్వమెఱుఁగని వాఁడయ్యెఁ దనివి గనక
ఇట్లు తనలోన మెల్లన నెంచెనతఁడు॥ 11

"తపములొ యనేకములు బాధాత్మకములు
తపసులకు స్వర్గమొకటి ప్రధాన ఫలము

---

* ఉంచవృత్తి ఉంఛఃకణశః ఆదానం, ఒక్కొక్క గింజచొప్పున ఏరి తెచ్చికొని తినువృత్తి.

భువనములు సంతతము మార్పు పొందుచుండు
స్వర్గమున కాశ్రమ జనులిచ్చట శ్రమింత్రు 12

ఎవరు ప్రియబంధులను గోర్కెలిటు ద్యజించి
స్వర్గమును పొంద నియమముల్ సలుపుచుండు
వారువాని వియోగంబు పడయుచుండ్రు
అందొ గలదింక నెంతయున్ బంధనంబె॥ 13

తపసు లనియెడిదేహ వేదనల నెవఁడు
కామములకు జీవితవృత్తిఁ గాంక్షచేసి
యెవుడు సంసార దోషపరీక్ష చేయఁ
డతఁడు దుఃఖాల దుఃఖమె వెతకుచుండు 14

ప్రజల కెపుడుకల్గు మృతివల్లనె భయంబు
కాని యత్నించి మఱిజన్మ కాంక్ష చేతు
రిఁక ప్రవృత్తియున్నచో మృతియతప్ప
దెందువల్ల భయపడుదు రందె చూత్రు॥ 15

కొందఱు శ్రమి త్రిహమునకు
కొందఱు స్వర్గంబుకొఱకు కొనెదరు శ్రమలన్
కొందఱు సుఖింప శ్రమపడి
పొందరు సుఖ, మిటు లనర్థమొందు జగంబుల్॥ 16

హీనముఁ ద్యజించియుట గొప్పదానిఁబొందు
యత్న మిదియెంతమాత్ర నింద్యంబుగాదు
చేసినది యేది మఱిమఱి చేయకుందు
మాయదె సరియౌ యత్నానఁ జేయఁదగును॥ 17

తనువు నతికష్టపెట్టుట ధర్మమేని
తనువు సుఖపెట్టుట యధర్మమనఁగవలయు
ధర్మమున సుఖంబు పరమందనుభవింత్రు
కనుకనె యధర్మమన ధర్మమనుమతేల॥ 18

ఋషిని నాహార శుద్ధిచేఁ బుణ్యమైన
ఎపుడు ఫలసిద్ధి బాహ్యులై యెసఁగువారు
అధిక నిర్భాగ్యులై ధన ధనహీనులైన వారు
అఖిల మృగములున్ పుణ్యాత్ములన్న మాట 19

ఋషిని దుఃఖసంకల్పమె పుణ్యమైన
సుకపు సంకల్పమును పుణ్యాశోభఁ దెచ్చు
సుకపు సంకల్పమె ప్రమాణవికల మైన
దుఃఖసకల్పముఁ బ్రమాణతులను గనదు॥ 20

అయితె కర్మ విశుద్ధిని నందుకొఱకు
నీళ్లె తీర్థంబులని యెంచి నీళ్లతాఁక
మనుజు మదికిని సంతృప్తి మాత్రమెయగు
నంతె, నీళ్లమాత్రము పాపమడఁచలేవు॥ 21

ఎచటనే నీళ్ల సుగుణుల్ స్పృశించు చుంద్రొ
అచట నానీళ్లె తీర్థంబు లగుచునుండు
కాన గుణములె తీర్థంబులౌను ఋషుల
నిజముగన శ్రేయంబుగ నీళ్ళు నీళ్ళె” 22

అనియతఁడు యుక్తయుక్తముగను దలంచె
నంతలో మిటుసూర్యుఁడు నస్తమించె
హావిసు పొగలచేత వివర్ణమైన చెట్లు
గలతపః ప్రశాంతవన భాగంబుఁ జూచె॥ 23

## సిద్ధార్థుడు మోక్షకామియై అరాడునివనికి పోవుట

ఆ వనములో హావిస్సులతో అగ్నిహోత్రములు మండుచుండెను అభిషేకములు చేసి యరుదెంచు ఋషులు నిండియుండిరి దేవాలయములు జపఘోషలతో మారుమ్రోగుచుండెను అది ధర్మకర్మలచివరి హద్దుగాఁ దోఁచుచుండెను ఆవనిలో పూర్ణచంద్రునివలెఁ బ్రకాశించునయ్యానఘుఁడు

కొన్నిరాత్రులుండి యక్కడి తపస్సుల విధములు పరీక్షింపసాగెను. ఆ తపములను దెలిసికొని యాతపోవన భూమినుండి బయలుదేరెను

అంత నతని రూపమాహాత్మ్యమునుగన్న చిత్తంబుతో ఆశ్రమవాసులతనిని మహర్షులు అనార్యులచేఁ దిరస్కరింపఁబడిన దేశమునుండి వెడలి పోవుచున్న ధర్మమునువలె-అనుసరించిరి. అపుడతఁడొక శుభమైన వృక్షము క్రిందఁ గూర్చుండి, జడలు నారబట్టలు ధరించిన తపోధనులను వారుచేయు తపస్సులను జూచెను. లపుడామనుజశ్రేష్ఠునిఁ జుట్టుకొని యాశ్రమవాసులు అతనిని జూడసాగిరి. అంత వారిలో పెద్దయయిన యొకతపస్వి మధురమున సామవాక్యములలో నిట్లనియె.

నీమరాక నాశ్రమమొందె నిండుశోభ
నీవు వెడలిన శూన్యమై పోవుఁ జుమ్ము
కావునను బిడ్డ; యటనుండి పోవఁదగవు
బ్రతుకఁగోరు మానవుని దీర్ఘాయువట్లు 24

బ్రహ్మఋషులు దేవర్షులు రాజఋషులు
కొలుచు పుణ్యపు హిమగిరి కలదు దరినె
దాని సన్నిధి నాతపోధనుల తపసు
లెల్ల బహుళములౌచు వర్ధిల్లుచుండు 25

ఆత్మయుతులు ధర్మాత్ములు మహర్షులింక
రాజఋషులును సతతంబు శ్రద్ధతోడఁ
గొలుచు పుణ్యపుఁ దీర్థాలు గలుగునిటనె
అవియె స్వర్గసోపానములని యెఱుంగు॥ 26

ధర్మ విశేషముగనుండు తావెయగుట
నిచట నుత్తరదిశవైపె యేగుమెపుడు
బుధుఁడు దక్షిణదిశవైపు పోవరాదు
ఏలననది తపములకు వీలుగాదు॥ 27

ఈ తపోవనిన్ నిష్క్రియ భూతుఁడేని
అశుచియేని సంకరధర్మహేతుఁడుగాని
నీకుఁగనిపించెనా చెప్పు నీకునట్టి
యధముఁ డగపించు నెడల వెళ్లెదవుగాని 28

తపములకు నిధానంబయి దనరు నిన్ను
వీరు సాయము గోరుచున్నారు సుమ్ము
ఇంద్రసముఁడవౌ నీతోడ నిపుడు వాన
మలరిన బృహస్పతికిఁ గూడ నభ్యుదయమొ॥ 29

ఆతపస్వుల మధ్య తపస్విముఖ్యుఁడైన యావృద్ధుఁడు చెప్పఁగా విని మనీషులలో ముఖ్యుఁడైన యా సిద్ధార్థుఁడు భవనాశమునకయి ప్రతిన పూనినవాఁడయి తనలోని భావమును నిట్లువాక్రుచ్చెను

'సరళభావులు ధార్మికుల్ స్వజనులైన
మునుల యీదృశ మాతిధ్యపూజ వలన
ఎంతయో ప్రీతిగలిగెను, నెంతొ మాన
మయ్యె నాకిప్పుడీయాశ్రమాంతికమున॥ 30

అమృత మయమగు మీదువాక్యముల చేత
స్నాన మొనరించి నటులయ్యె సాధువర్య!
ప్రకృతిలో ధర్మమును గ్రహించు భావముండె
ఇప్పుడదియింక మరిమరి హెచ్చు చుండె 31

ఇటుల ప్రేమించి యాశ్రయ మిచ్చుచుండు
మిమ్ముఁబోటుల విడుచుట మిగులదుఃఖ
కరమెయగుచుండె, బంధులందఱను వీడు
నపుడువోలెను నిప్పుడున్ వ్యథజనించె॥ 32

స్వర్గమునకు మీరు చరియింత్రు ధర్మంబు
భవ వినాశమేనొ వాంఛచేతు

ఇందువలన నేను నిటనుండఁగోరను
ఇలఁ బ్రవృత్తియును నివృత్తివేఱు॥ 33

ఈ వనము నేను త్యజించి యేగుటయును
పరులు చేసిన దోషంబువలనఁ గాదు
పూర్వ యుగములఁబట్టియుఁ బొలుచుధర్మ
మాచరింతురు మీరు మాహర్షిసములు॥ 34

సూనృతము నర్థవంతము శుభము ప్రియము
నోజసుగలది గౌరవయుతము నైన
యతని పలుకుల నాలించి యా తపస్వు
లింకను విశేషముగా గౌరవించిరతని 35

భస్మమునఁ బరుండి శిఖియై ప్రాంశువగుచు
వల్కలంబులు దాలిచి పసుపుఁ గనులఁ
బొనరి సన్నని పొడుగైన ముక్కుగలిగి
హస్తమునఁ బ్రాతగల ద్విజుఁడనియె నొకడు॥ 36

"ప్రాజ్ఞ! నీనిశ్చయ ముదారమైన దయ్యె
నీవు యువకుఁడవయ్యు జన్మించుటందు
కలుగు దోషమెంచిమఱి స్వర్గాపవర్గ
ముల విచారించి ముక్తినే పొందనెంతు॥ 37

రాగవంతులు యజ్ఞాల వ్రతయమాల
తపసులన్ స్వర్గమునుగోరి తనరుచుంద్రు
సత్త్వయుతులో రాగముతోడ శత్రుతోడ
బెణఁగు పోరాడి ముక్తినే పడయనెంతు॥ 38

ఇట్టి బుద్ధిని మది నిశ్చయించు నెడల
వెంటనె వింధ్య కోష్ఠమువెడలుమిటనె
నైష్ఠిక శ్రేయసున్ లబ్ధనయనుఁడైన
మునిగలఁ డరాడుఁడను వాడందలరుచుండె॥ 39

నీవు వానివలన తత్త్వము నెఱుంగఁగలవు నీకందు రుచిగలుగు నేని దానిననుష్ఠింపఁ గలవాఁడవు నీకే గనక ఇట్టిబుద్ధియె యున్నచో వానిని గూడ నతిక్రమించి యేగగలవు. ఎత్తైన ముక్కు, విపులమై విశాలమై నేత్రములు, ఎఱ్ఱని యధరము, తెల్లనివాడిగల దంతములు, సన్నని ఎఱ్ఱని నాలుకగల యీదృశముఖముగల నీవు సంపూర్ణజ్ఞాన సముద్రమును పొందగలవు నీగాంభీర్యము అగాధము. ఈ దీప్తి ఈ లక్షణములు అరుదు. నీవు పృథివియందె ఆచార్యపదవిని పొందఁగలవు ఇట్టిది పూర్వము ఏఋషులును పొందలేదు. అనఁగానతఁడు

"మంచి"దని పల్కి యంతనాశ్రమవసుతుఁడు
ఆ ఋషుల నభినందించి యచట కదలె
వారుగూడ నాతనిని సగౌరవముగ
సాగనంపి చొచ్చిరపుడు స్వాశ్రమముల॥ 40

ఇది

పదమూఁడవ యాఖ్యానము



# బుద్ధ భగవానుని చరిత్ర

## పదునాల్గవ యాశ్వాసము

### పురజనుల శోకము

మమతన్ ద్రోసియవైచి తన్నువిడి జన్మ వ్యాధిమృత్యుల్ వినా
శము పొందింప విభుండుపోవ, నొనరించందగ్గదే యేమి గా
నమి నాఛందకుఁడున్ వృథా జలధిలోనన్ మున్గిమార్గానఁజి
త్తమునే యాపుకొనంగ యేడ్చును సమస్తారణ్య మేడ్పించుచున్॥ 1

స్వామివిభురాజ్ఞచే హయముతో ఛందకుఁడు
నే పథిని నొక్కరాత్రిలో నిట్టిదాటె
ఆ పథినె గుఱ్ఱమెక్కియె ఆత్మవిభుని
వదలి పురిచేర బట్టెనెన్మిది దినాలు 2

జవమును శక్తిగల్గియును స్వప్రభుఁబాయుటఁగంధ కాశ్వమా
జవమును శక్తిగోలుపడి స్వాంఘ్రుల మెల్లగనీడ్చుకొంచు, నె
క్కువగ నలంకరింపఁబడికూడ మెయిన్ గతలక్ష్మియై దిగా
లువడి తపోవనిన్ గనుఁగడున్ సకిలింపదుఁ దృణంబుముట్టదున్. 3

లోక సాః లేనియాకాశమును బోలె
లోకహితుఁడనఘుఁడు లేకయున్న
కపిలవస్తు పురికి కంధకాశ్వంబును
చంధకుండుచేరె క్రమముగాను 4

పద్మములనిండు సరసులువరలి కూడ
విచ్చుపూవులచెట్లతో వెలసి కూడ

సంతసమె లేని మొగముల జనులతోడ
వరకపిలవస్తు పుపవని వనిగఁ దోఁచె. 5

జాలిగనిటునటు మెసలు జనులచేత
కమిలిపోయి యశ్రుతొలుకు కనులచేత
నైలస్నానముచేయుజనాళి చేతఁ
బోలెఁ ద్రోయఁబడివారు పురికిఁ జనిరి. 6

శాక్యకులుఁడు లేకుండుటన్ సడలిపోవు
తనువుతోవచ్చు వారిని గనుచు జనులు
రాముఁడును లేక మునువచ్చు రథముఁ బోలెఁ
గాంచి యేడ్చిరి కన్నీళ్ళు గాల్వఁగట్ట. 7

పురము రాష్ట్రమునానంద పఱచురాజ
పుత్రుఁడేఁడిరా తీసుకపోతివివ
అనుచు కన్నీళ్ళతోఁ దన్ననుసరించె
మాటమాటికిఁ గడుజనంబడుగుచుండె. 8

అని యిట్లుఅడుగు జనులను జూచి ఛంధకుఁడిట్లనియె. "నేను నరేంద్రకుమారుని వదలిపెట్టిరాలేదు. అతఁడె నిర్జనమగునడవిలో నన్నును గృహస్థవేషమును విడిచివెళ్ళిపోయెను." ఇది వినితోటిజనులు "ఇది నిజముగాదుషష్కరకార్యమె." అని పలికి పొర్లివచ్చు కన్నీళ్లు ఆపుకొన లేక పోయిరి. మకుఁగలిగిన యిట్టిమానసిక స్థితి నిందించుకొని" నడువుఁడు మనము కూడ, అతఁడుపోయిన ఆవనమునకే పోదము ఇంద్రియములు లేకుండ జీవులకు జీవితేచ్ఛలేనట్లు మాకును అతఁడులేనిదే జీవితేచ్ఛలేదు." అని యనిరి అతఁడులేని యీ పురము వనమగుఁగాక, అతఁడున్న యావనము పురమగుఁగాక వృత్రవధ సమయమున ఇంద్రునిలేని స్వర్గము వలె అతఁడులేని యీ పురమునకు శోభలేదు. జనులు ఇట్లనుకొనుచుండ "ఛంధకుని రాకవిని సిద్ధార్థుఁడుకూడవచ్చె"ననుకొని యంగనల గవాక్షములను దెఱచిచూడఁదొడఁగిరి ఇంతలో కంధకము.యొక్క వివుఱాన్యమగుటఁజూచి వారందఱు కిటికీలుమూసికొని యేడ్వసాగిరి

అంత —

తనయప్రాప్తికిఁ జింతదీక్షగొనుచున్ దత్తద్రవ్యాతాలూనుచున్
తన విశ్వాసముఁబట్టి యెన్నొగుడులన్ దత్తక్రియల్ పూజలున్
మనుజాధీశుఁడొనర్చు వేళ హయమున్ గైకొంచునాఛందకుం
డును వచ్చెన్ స్వావిభున్‌రిపుల్ గొన వ్యాథన్ దోతెంచుయోద్ధంబలెన్.

నృపభవనము చేరుచునె కన్నీటి కనుల
నరయుచు స్వాదుఃఖము దెల్పుచున్నది యవోలె
గట్టిగహయంబు సకిలించెఁగాంచి దాని
గృహ విహంగాలు హయములు నెంతొయఱచె 10

కంథ కాశ్వము సకిలింపఁ గాంచి యపుడు
అంతిపుర జనములు చూచిరి యచటి జంతు
లఱచె, ధ్రువముగనృపసుతుఁడరుగు దెంచె
ననుచు మానసంబున ననుకొనియెనేమొ 11

వెతల మూర్ఛితలగు సతుల్ క్షితిప సుతుఁడు
వచ్చెనోయని హృష్టలై పఱచి వచ్చి
రాయువకుఁ జూడలోలనేత్రాబ్జలగుచు
శరదృతుఘను నుండి కదలు మెఱపులట్లు 12

ఉంపిరిజుట్టులున్, మురికిచీరలు కాటుకలేని కన్నులున్
కంపిలి యశ్రుచారికలు గట్టుమొగాలు. నగల్ త్యజించుటన్
సొంపఱునంగముల్ గలుగు సుందరులొప్పిన రాజమందిరం
బింపఱె ప్రొద్దుటన్ ద్యుతినశించిన తారలయాకసంబటుల్. 13

లత్తుకపూఁతలే, కెఱుపురంగఱి యందెలు లేని పాదముల్
హత్తని కుండలాలు గలయాస్యము, లందవుముత్తెవున్ సరాల్
గుత్తులులేని కంఠములు, కోమల కాంచులులేని మధ్యాలున్
సొత్తులులేని బొమ్మలును జూడ్కికి గొల్పెను జాలియెంతయున్ 14

ప్రభుసుతుఁడులేక వచ్చిన వాజి సూతుఁ
గాంచి కన్నీళ్ళు నిండిన కనులతోడఁ
గనులు మోములుగల వరాంగనలు నేడ్చి
రాలపోతుత్యజించిన యావులట్లు. 15

వలవల యేడ్చుచుఁ గన్నుఁగ
వలనశ్రులగౌతమి నృపపట్టమహిషి న
త్సల మహిషివలె వగచి చం
చలదళ కదళివలెఁబడియెచావిభుజంబుల్. 16

స్త్రీలు కొందఱు ద్యుతిదక్కి శిథిలమైన
యంసములతో విచేతనలటుల నుండి
ఏడువరు నశ్రులు విడరు నేమి మెదల
రిమ్మహిని గోడపైనున్న బొమ్మలట్లు. 17

స్త్రీలు కొందఱు వీరలై ప్రియునిచింత
మూర్ఛపడి అశ్రువులుకారు మోమునుండి
గందపుం బూతలేని వక్షములఁదడిపి
తల మొగిలు కొండకాల్వల శిలలబోలె 18

క్రొత్త కన్నీళ్ళ దెబ్బల కొట్టఁబడిన
యాస్యములచేత రాజ హర్మ్యమ్మువఱలె
క్రొత్తవర్షాల వృష్టిచేఁ గొట్టఁబడుచు
జలము కాఱెడి పద్మాల కొలను వోలె 19

గుండ్రమయి బలిసియు సందుఱండ కుంగ
రాలులేక తామరమొగ్గఁబోలు ప్రేళ్ళ
గుప్పిడుల బొమ్మలను బాదుకొనిరి స్త్రీలు
కదలు లతలు చివుళ్ళచే మొదళులవలె. 20

హస్తముల ఘాతములచేత నదరిపోవు
నెత్తయిన బొమ్మలు గలుగునింతులపుడు

వనులఁగాలి కల్లాడు నబ్బములచేతఁ
గదలు చక్రవ జంటల నదులెయ్యెరి. 21

వనితలెటుకేల బొమ్మలు బాదుకొనిరో
వడిగ నబొమ్ముచేఁగేలు బాదుకొనిరి
నిర్దయలగుచు నబలలు నిజకరాగ్ర
వక్షములకు నమ్యోన్యము బాధయిడిరి, 22

అవలన్ రోషముచేత నెఱ్ఱవడి నేత్రాంతంబు లేపార, స్వాం
త విగాఢంబగు చింతచేత, గనులన్ గన్నీరుకాఱంగ, నె
క్కువనిట్టూర్పులచేత బొమ్మలదరన్ గొండంత దుఃఖంబుచే
స్వావచస్సుల్ వణఁకన్, యశోధరయిటుల్ వాక్రుచ్చెనుద్రిక్తయై 23

## యశోధర చింతిల్లి అడుగుట

నిని నిద్రంబడి పాన్పునన్ వివశనై నేనుండఁగా నాదు మా
నస చోరుండిటు చంధకా! విడినమన్ తానెందుఁబోయెన్వచిం
వు, నరేమీరలు ముప్వారేగిరటు, నీవున్ కంధకాశ్వంబు ని
ట్లు నమీవచ్చిరి చిత్తమున్ వణఁకు నెట్టుల్ నీప్రభుండేగెరా; 24

చెలిమి విడియ విశ్వాసానఁజేయరాని
పనియొనర్చ క్రూర! యిదేమి వగతువిట్లు
అశ్రులాపుకో ముదమొందు, మశ్రులకును
ఈ వనులకు సంబంధమి లేని గలదె 25

ప్రియుఁడవును వశ్యుఁడవు హితంచెంచు సఖివి
అర్ధకారివి సారధివైన నీవు
ఆర్యపుత్రు మరల రానియట్లు తీసి
కొని యరిగితి సుఖింపు నీపనిఫలించె 26

నదులలో నేర్పుగలిగిన యరియె వరము
ప్రణయు విడఁదీయు సఖిశుంత వరముకాడు

సఖుఁడవని చెప్పుకొనఁబడి జ్ఞానికాని
నీవ యీ కులానికిఁ జేసితెంతొ హాని. 27

చూడు ఛందక! స్త్రీలెట్లు మ్రోడులైరొ
సత్యముగ కంధకాశ్వమున్ జలిపెనిట్లు
ఇట్టిమాదు సర్వస్వము గొట్టివేసె
పౌరులు నిదురింపఁగ రత్నచోరుఁడట్లు 28

సమరముల బాణఘాతముల్ సైచు దీని
కబ్బ! లెక్కయా కొరడాల, దెబ్బలట్టి
అదియ కొరడాల దెబ్బకు హడలిపోయి
శ్రీనెగాక నాహృదిన్ దొంగిలించెనెట్లు 29

ఇపుడిది యనార్య కర్మగావించి వైచి
నృపగృహము నిండునటు సకిలించుచుండె
అటు ప్రియుని తీసికొనిపోవునపుడు మాత్ర
మీయధమవాజి మూగిదై పోయెఁజూడు. 30

అప్పుడిదెయిట్లు సకిలించి చెప్పెనేని
క్షితిని డెక్కల చప్పుడె చేసెనేని
దవడలను గదుపుచు ధ్వనిన్ దరలెనేని
ఇట్టిదారుణ బాధయయ్యెడిది నాకు 31

## ఛంధకుఁడు సిద్ధార్థుని సంగతి తెలుపుట

అనియిట్టులనేక విధంబుల యశోధరాదేవి కన్నీళ్లతో గద్గదంబగుమాటల పరిదేవనముచేయుచుండవిని యాఛందకసారధితలవంచుకొని కన్నీళ్లుగలముఖముతో దోసిలిపట్టుకొని మెల్లగా నామెతోనిట్లనియె ఓ దేవి! యిట్లు ఈ కంథకాశ్వమునుగాని నన్నుగాని నిందింపఁదగవు. మే మిద్దఱము నిర్దోషులమని తెలిసికొనుము దేవీ! యానరదేవుఁడు దేవునివలె నిటునుండి వెడలిపోయెను. నేను రాజశాసన మెఱిఁగినవాఁడనె యయినను ఎవరోదేవతలచే బలాత్కరింపఁబడి తీసికొనిపోవఁబడిన వానివలె శీఘ్రముగా ఈ

గఱ్ఱమును తీసికొనివచ్చి శ్రమపడియలేకుండ దాని వెనువెనుక నేపోతిని ఈ యశ్వశ్రేష్ఠముగూడ భూమిని తాకక మధ్యగా ఎవరో డెక్కలను ధరించి నట్లు అయినది ఆశ్లదైవవశముచే నిది ధవడలనించుకంతయుఁగూడ గదు పలేదు సకిలింపలేదు గూడరాకొమరుడు నగరివెలుపలకు వెడలుచుండఁగా కోట ద్వారము విచిత్రముగా చప్పుడేమియులేకుండఁ దెఱచుకొనియె అవు డాయంధకారము సూర్యునిచేఁ జీల్చఁబడినట్లయ్యె అందులోఁగూడ దైవ విధానమెయని గ్రహింపవలసియున్నది రాజశాసనమున అప్రమత్తులైన వేలకొలదిగ జనులు ఆసమయమున నిద్రమత్తులోఁబడి మేల్కనరైరి ఇదిదైవ విలాసమేయనవలెను, అక్కడవనములో గూడ దేవతలెయతని కిరీటము మొదలైన యమూల్యభూషణములు తీసివేయించినవారయిరి నర దేవీ! నీవు ఈ కంధకాశ్వము మీఁదఁగాని నాపైనిగాని నేరము మోపఁద గవు ఇది నేను తెలిసియిచ్ఛతోఁజేసిన పనికాదు ఈ కంధకాశ్వముతో పాటునేను ఆయనదేవుఁడు దేవతలచేఁ దీసికొని పోవఁబడినవారివలెనే వెడ లిపోతిమి. అనియిట్లు దేవతాప్రేరితమైన ఆమ ప్రవాసప్రయాణమును గూర్చి యాఛందకుఁడు చెప్పుచుండ వినియాయశతపుర వనితలు శోకంబులు వీడిన వారువలెనయి యాశ్చర్యముపొందిరాకొమరుని ప్రవ్రజ్యావలన మనోవేద నను పొందినవారైరి.

## గౌతమివిచారము

అంత --

బహువిషాదంబుచేఁ బంచలాక్షియగుచు
తనయుఁ గోల్పోయినందు గౌతమియుధృతిని
వీడి, యశ్రులు కన్నుల వెడలుచుండ
ఆడులకుమికి పిట్టలాగ బడియనియె. ౩౨

"లహరులటు మెలితిరిగి మార్దనము గలిగి
వేఱువేఱుబైల్దేఱిరంగారి మీఱి
చకవర్తికిరీటాల స్థానమైన
కొమరునల్లనికురులిలన్ దొరలె నొకొ ౩౩

విపులదీర్ఘబాహువుసింహ విక్రముండు
పృథుల వక్షుఁడు వృషభాక్షుఁడధిక బలుఁడు
మేరుగాత్రుఁడు జలదగంభీర వాక్కు
నయిన సుతుఁడంతి మాత్రమాప్తుఁడగునె. 34

అట్టి యనఘుని ననుపము నాద్యుఁ బతిని
గోలుపోయి క్షోణియభాగ్యురాలెయయ్యె
అట్టిసకలసద్గుణవార్ధియైన నృపతి
ప్రజల భాగ్యంబుచేఁ బుట్టి లభ్యుఁడగును. 5

"రేఖల బాలాలవ్రేళ్ళొప్పు మెత్తని
కాళ్ళుట్లురుగువనిన్ గటిక నేల
సౌధాలఁ బాన్పులఁ జందనాగరు ధూప
వాసి తనువెట్లువనిని నిలుచు
వంశసత్త్వయశసుల్ వర్చస్సు గలిగి ల
క్ష్మియుడువాఁ డెగతిఁ భిక్షమడుగు
శుచిహైమశయనాల సోలిమంగళపాఠ
ములలేచు వాడెటార్పులకులేచు

అనుచు దైన్యముతోనేడ్వ వినుచు స్త్రీలు
కరయుగంబుల నొండొరుఁ గౌఁగిలించు
కొనుచుఁ గన్నీరుకార్చిరి కనుల నుండి
లతలు పువ్వులనుండి మరందమట్లు 36

విదప చక్రవాక శూన్యయగు చక్రవాకివలె నేలపయిబడి మాటి మాటికి గద్గదస్వరముతో యశోధర యిట్లు విలపించెను.

"నన్ను సహధర్మచరిని ననాధురాలి
విడిచి యతఁడు ధర్మముచేయ దలఁచెనేని
తపసు ఫలము ననుభవింపఁదలఁచు పతికి
ధర్మచారిణి లేకుండ ధర్మమేది॥ 37

పత్నితోఁ గూడఁ దపసుకై వనుల కేగు
ధరణిపుల తాతల మహాసుదర్శముఖుల
మున్నితఁడు వినలేదు కాఁబోలు నట్లు
కాక నేలేని ధర్మంపుఁ గార్యమెట్లు 38

పరమునను గూడ స్వర్గపు ఫలముగోరి
యజ్ఞముల వేదవిధి దీక్షనలరు వారి
దంపతుల నెందు బహుళయుతండుగనఁడు
దాన నేనంటే ధర్మమాత్సర్య మొదవె 39

ధర్మవల్లభుఁడైన యాతండు "నేను
ఈర్ష్యాకలహంబు నొంటిఁ గావింప
ప్రీతిగల కోపనవనుచు నాతడెంచి
స్వర్గమున నచ్చరలఁ బొందఁ జనియెనేమొ. 40

శ్రీని నాదుభక్తిని విసర్జించియింక
నాతడెందుకు వనిన్ దపమాచరించు
వాని తనుగుణమేది యీ వనితలెంత్రు
అనుచు నీచింత మదిలోన నయ్యెనాకు. 41

స్వర్గ సుఖమొంద నాకేమి వాంఛలేదు
ఆసుఖమె యాత్మమతి కలభ్యంబుగాదు
నా ప్రియుఁడెటు లిహపరాల నన్ను విడక
యుండుటెట్లనియె యిట నాకున్న కోర్కె. 42

ఆయతాక్షి శుచిస్మితు న[illegible] నేను
చూచుటకు నోచుకొనకున్నచో మఱింక
మందభాగ్యుఁడీ రాహులుడెందునైన
తండ్రి యంకాన దొర్లఁగఁదగని వాఁడె". 43

అనుచు నిట్లు దుఃఖమూర్ఛితురాలెయగుచు
ఏడ్చి చింతించె విలపించె నెన్నొమార్లు
ధృతిని విస్మరించి సహజ ధీరయయ్యు
యీ యశోధరయేడ్చె సిగ్గెల్ల విడిచి. 44

అటులఁగడు శోకవిహ్వలురాలయగుచు
తమి వసుంధరఁ బడుయశోధరను గాంచి
వర్షపుం దెబ్బలడిను నబ్జములఁ బోని
యాస్యముల నశ్రువులు నిండ నార్చిరపుడు. 45

## శుద్ధోదనుడు చింతిల్లుట

జపములు ముగించి హోమాలు చాలచేసి
నృపతిదేవాలయము నుండి యేగుదెంచి
ఆ జనులయార్తరవమున నాహతుఁడయి
వణఁకె వజ్రధ్వానులచే ద్రుపంబువోలె. 46

ఛందకుని జూచి కంథకాశ్వమును జూచి
ఛందకువలన సుతుని నిశ్చయముఁదెలిసి
నృపతి శోకాభిభూతుడై నేలవాలె
స్వావిజయోత్సవాల్ చన నింద్రధ్వజమువోలె 47

ఆవల సుతశోక మోహితుండగుచు నృపతి
తన కులీనుల చేత నోదార్పఁబడియు
అశ్రుపూర్ణ నేత్రుండయి హయముఁ జూచి
నేలఁబడియుండి విలపించె గోలుమనుచు. 48

ఆజిలో నాకుఁ జాల ప్రియాలుచేసి
వృత గుణప్రియుండయిన నా ప్రియకుమారు
ప్రియమవయ్యెఁ గంధకమ! యప్రియమవోలె
వని విడచి యెంత యప్రియమును జలిపితి. 49

కనుక సుతుని కడకునను(గొనియ పొమ్ము
శ్రీఘ్రమయత నినైన( దీసికొని రమ్ము
సుతు(డు లేకుండ నేనింక బ్రతుకలేను
బాగయిన యౌషధములేక రోగివోలె. 50

మృత్యువు సువర్ణ నిష్ఠీవి నిలహరింప
సంజయుండు చావక యెదుష్కరము చేసె
ధర్మరతు(డైన తనయుండు తరలిపోవ
నేనొ యయతాత్మువలె మరణింప(దలతు 51

పదిరాజ్యముల సృజించి ప్రజాపతియై వివస్వంతుని కుమారు(డయిన మనువు మనస్సుగూడ ప్రియపుత్త్రునియెడ(బాటు కలిగినపుడు మోహమొందకయుండెనా? అజమహారాజు కుమారు(డును ధీమంతు(డును ఇంద్రసఖుండును అగుదశరథు(డన్నచో నాకు అసూయగానున్నది. ఏల యన(గా నకొడుకు వనమునకువెళ్ళ(గనే తాను దివమునకేగెను కాని అత(డు వట్టిబాష్పములు వదలుదీను(డై జీవింపలేదు భద్ర! ఛందక, నాకిన్ని నీళ్ళువదలెడియాకొడుకున్న యాశ్రమాంగణమునకు( దీసికొని పొమ్ము. ప్రేతగతి( పొందగోరు నాప్రాణములు వానిని పొంద(గోరుచున్నవి అనియిట్లు తనయుని యెడ(బాటువలన( గలిగిన దుఃఖముచే భూమితో సమానమైన సహజధైర్యముగల యాశుద్ధోదను(డు శ్రీ రాముని యెడ(బాటుచే గలిగిన శోకమువలన దుఃఖమునకు వశు(డయిన దశరథుని వలె విలపింపసాగెను. అంతట శ్రుతి వినయగుణములు గలసచివుండును వృద్ధుడైన పురోహితుండును అంతగా తపింప(బడిన ముఖములుగల వారుగాకయు అసలు శోకములేని వారును గానివారయి అన్నృపేంద్రునితో నిట్లనిరి ఓరాజా! దుఃఖము విడుము. భీరువువలె కన్నీళ్లు తేకుము. హృష్టయు రాజ్య లక్ష్మిని పూలదండనువలె విడచి పెక్కుమంది రాజులు వనములకేగిరి. మఱియు అతని భావము నియత నదియె మున్ను అసితమహాముని వాక్యములను జ్ఞప్తికి( దెచ్చుకొనుము. అత(డు స్వర్గమున(గాని చక్రవర్తి పదమందు(గాని క్షణముగూడ సుఖముగా నివసింప(జేయుటకు శక్యు(డుగా(డు, నరేంద్రా! యతనికై ప్రయత్నింప వలసినచో త్వరగా జెప్పుము మేము

వెళ్ళి యతనితెచ్చుటకు వలయు నుపాయములు చేయుదుము. అనఁగ విని రాజు ఇట్లనియె మీరలు త్వరగా వెళ్ళి నా కుమారుని నెట్లయినను దీసికొని రండు, వనపక్షికివలె పుత్రలాలనుఁడనగు నాహృదయమునకు శాంతిలేదు. అని రాజు పలుకుటయు ఆనరేంద్రుని శాసనముచే నమాత్యుఁడును పురోహితుఁడును సిద్ధార్థుఁడేగిన వనమ్ముపైపునకుఁ జనిరి అంతరాజును రాజబంధువులును అంతఃపురజనమును "సరే మంచిపనియె జరపతిమని తలఁచి తమ్మును ఎటులో ధరించి ధైర్యమున నుండిరి

ఇది

పదునాల్గవయాశ్వాసము



# బుద్ధ భగవానుని చరిత్ర

## పదునేనవయాశ్వాసము

### కుమారాన్వేషణము

పతికన్నీరె మహాంకుశంబయి కడున్ బాధించుటన్ తత్పురో
హితుఁడున్ మంత్రియు వడిదెబ్బతిన్ హయములట్లేపోయి తత్పట్టణో
చితవేషాలు త్యజించి నమ్రులయి యాసిద్ధార్థుఁడెట్లేగె, నా
గతి నాఛందకువల్లఁ దెల్సివనులన్ గాలించి రాయాప్తులుల్ 1

మఱియువారు వనులందున్న యాయాశ్రమములకు అందున్న భార్గవుని స్థానమునకు నరిగి యాభార్గవునిందర్శించి పూజింపనతండును వారిని సాదరంబుగఁజూడ నంతవారు ఆతనితో నిట్లనిరి.

"ఉద్ధతేజులు సువిశాల శుద్ధకీర్తు
లిక్ష్వాకు వంశభవోర్వీపతుల
స్వాజనముగ మమ్మెఱుంగుము సద్ధితులము
స్నేహితులము నమాత్యపురోహితులము. 2

అమరపతి వంటి పతికి జయంతువంటి
సుతుఁడుగలఁ డాతఁడును జరామృతి భయాలు
దాటుటకు నిక్కడికె వచ్చె దానమేము
వాని వెదకుచు వచ్చిన వారమనఘ!" 3

అనఁగ నతఁడనె "పృథుభుజుండాతఁ డిటకు
వచ్చె, ఆకుమారుఁడు గాఁడు స్వల్పబుద్ధి

ఆతఁడిచటి ధర్మము భ్రమాత్మక మని
చనియె మోక్షేచ్ఛను ఆరాడ మునినిజూడ॥ 4

అవల వారిరువురు మౌని యంతికమున
నిజమెఱిఁగి యామునికడన్ సెలవుపొంది
భిన్నులయ్యు అరాడభక్తి నభిన్నులట్లు
అతఁడరిగిన యచటికి వేగనరిగి రపుడు 5

అరిగివారలు పథిని స్నానాదికంబు
లేకయును మేనిచేఁ దేజరిల్లు వాని
ఒక్క వృక్షముక్రిందఁ గూర్చున్న యతనిఁ
గనిరి మబ్బుదొంతరఁ జొచ్చునినునిబోలె॥ 6

అపుడు ఆపురోహితుఁడు మంత్రితోఁ గూడి రథముదిగి వనములో నున్న రామునిదరికి వామదేవునితోఁ గూడి వసిష్ఠుఁడు చూడఁగోరి వెళ్ళినట్లు వెళ్ళెను అంత—

దివిని శుక్రాంగిరసులు దేవవిభుఁబోలె
వారలిరువు రర్చించిరి ధీరునతని
దివిని శుక్రాంగిరసుల దేవవిభుఁడటులు
వారినిరువురి నర్చించె ధీరుఁడతఁడు॥ 7

శాక్యకులతిలకునియనుజ్ఞను గ్రహించి
వారలిరువురు దగ్గఱఁ గూరుచుండి
ప్రక్క చంద్రుయోగంబునఁ బునర్వసులు వోలె
ఎంతొ భాసిల్లి వెలిఁగిరి యిరువయివుల॥ 8

చెట్టుక్రిందఁ గూర్చుండి తేజిల్లునతనిఁ
గని పురోహితుఁడిట్టుల ననియె నపుడు
పారిజాతము క్రిందను గూరుచున్న
శక్రసుతు జయంతుఁగని గీష్పతియ వోలె॥ 9

# తండ్రిదరికి రమ్మని సిద్ధార్థునికి పురోహితుని బోధ

విను గుణించిన శోకపు నిశితశల్య
మెదనుగాడఁగ రాజుమూర్ఛిల్లి క్షణము
కనులనీరు నించుకొని దుఃఖంబు పొంగ
పలికె నిటుకుమారా! విని తెలిసికొనుము॥ 10

"ధర్మమును గూర్చి నీ నిశ్చితంబు తెలియు
భావిలో లక్ష్య మిది చేరవలసి యుండె
నీ వకాలానవని నాశ్రయించినావు
కాన నగ్నిఁబోల్ శోకాగ్ని కాల్చునన్ను॥ 11

అందుచే ధర్మప్రియ! నాదు ప్రియంబు కొఱకు
ధర్మము కొఱకె యానిశ్చితము త్యజింపు
అట్టి శోకవేగమ్మె వర్ధిల్లినన్ను
గట్టు నదివేగముట్టు పడఁగొట్టిపైచు 12

జలదమును గాలివలె రవి జలమునట్లు
తృణము నగ్నివోలె నగం బశని విధాన
నన్ను నీ యెడఁబాటునన్ గలుగుచింత
యార్పు నెండించుఁ గాల్చును పేర్చి ప్రీల్చు 13

అందున ధరాధిపత్యంబు ననుభవింపు
విధిప్రకారము తగుతఱిన్ విపినమేగు
ఇష్ట జనమును నన్ను నపేక్షచేయు
తగ సమస్త భూతదయయె ధర్మమనఁగఁ 14

అట్టి ధర్మము వనినె సిద్ధింపదయ్య
పురమునందును యతులకుఁ బోడము సిద్ధి
బుద్ధియును యత్నము నిమిత్తములు గదయ్య
శిరుచిహ్నలవని, మునివేషములును॥ 15

బలియు వజ్రబాహు వసుధువవానుజులును
అల్లపై భ్రాజుఁడాషాడుఁ డంతిదేవుఁ

డావిదేహరాజు జనకుండట్లె ద్రుముఁడు
సేన జిత్తులును గృహస్థులైనవారె॥ 16

వీరు సైర్శ్యయనపు ధర్మవిధుల యందు
నమ్రములయియున్న వారని నమ్మమోయి
నీవొ జ్ఞానాధిపత్యము నృపతి లక్ష్మి
నాధి పత్యము రెండును నందు మోయి: 17

నీకు నభిషేకమునుజేసి నీ శిరస్సు
తడియునాఱక ముందె నిన్ దృఢముగాఁ గ
కౌఁగలించుకొని నిను నేకాతపత్రు
నరసి హర్షముతో వనికరుగఁ దలఁతు॥ 18

అని మహీపతి కన్నీరు కనులనిండ
గద్గద స్వరమునఁ బల్కెఁ గరముజాలి
అఁదుచే నిదవిని తత్ప్రియంబు కొఱకు
స్నేహమునఁ దండ్రిస్నేహమున్ జేయఁదగుదు॥ 19

నీదు విరహంబువలని యగాధమైన
వేదనాబ్ధి మున్గిన శాక్యవిభుని దీను
దిక్కులేని వానిని వారిధిని మునుంగ
నెడరు నావను బలె, నుద్ధరింపఁదగుదు॥ 20

గంగకొడుకు భీష్ముండు, భార్గవునికొఱకు
పరశురాముఁడు, రాముఁడందఱును వీరు
జనకుని యభీష్టకర్మలు సలిపినారు
అట్లె నీవును తండ్రి ప్రియంబుఁజేయు॥ 22

హంసచే విడఁవఁబడిన హంసివోలె
కానలో నేన్గువిడు నాడయేన్గు వోలె
నాథుఁడుండియుఁగూడ ననాథయైన
సతి యశోధరఁ గని ప్రోవ సమయమిదియ॥ 2

ఒక్క సుతుని, దుఃఖమున కయోగ్యుఁబాలు
మదిని వేదన నడిచియు మసలువాని
రాహు గ్రహణంబునుండి పూర్ణశశిఁబోలె
పుత్రురాహులు వ్యాధనుండి ముక్తుఁజేయు॥ 24

త్వద్వియోగేంధనముల నిశ్శ్వాసధూమ
మడరఁదమును శిఖలతో వ్యాధాగ్ని చేతఁ
దగులఁబడు నంతిపురము కృత్స్నంపుఁబురిని
ననఘ! నీవృష్టి జలముచే నార్పఁదగుదు॥ 25

ఇట్లు నేకవిధములఁ జెప్పుచున్న యాపురోహితుని వాక్కులు విని గుణజ్ఞుఁడు గుణవంతుఁడును బోధిసత్వుని ప్రతినిధియు నయిన సిద్ధార్థుఁడిట్లు వినయములోఁ బలికెను

## సిద్ధార్థుడు పురోహితునితో జెప్పుట

ఎఱుఁగుదును పుత్రునెడ తండ్రికెనఁగు ప్రేమ
అందును విశేషముగలదు నాయందుఁబితకు
తెలిసియును, జరావ్యాధి బాధలకువెఱచి
విధియెలేక స్వజనముల విడిచివైతు॥ 26

తుదిని నెడబాటుగనకుండ పోవలు నెడల
ప్రియజనంబులఁ జూడవేడరెవరు
గొప్పగ బ్రతికి,తుది పోకతప్ప నవుడు
స్నేహమున్న తండ్రిని గూడ త్యజించితేను॥ 27

నావలనబాధ తండ్రికిన్ కలిగెనంటి
వదియునాకు యుక్తమును ప్రియమును గాదు
మన కలయికలు కలవోలె మసలునవుడు
భావి విరహాలనెట్లైన బాపకాదె॥ 28

ఈ ప్రపంచపు గతె వింత, యిదియుఁ జూచి
యింక నీబుద్ధి నిశ్చయ మెనయుఁగాక
తాపకారి పుత్రుఁడుగాడు తండ్రిగాఁడు
ఈ విచారంబు లజ్ఞాన హేతుకములు॥ 29

పథికులకుఁ బోలెఁ గలిసిన ప్రజలకిందు
తగు సమయముల విడిపోక తప్పదెపుడు
బంధులనఁ బడు ప్రజయెడబాటు వలన
ప్రాజ్ఞుఁడెవ్వఁడు శోకంబు పడయుచుండు॥ 30

పూర్వ జన్మ బంధులవీడి పొడమునిచట
ఇటను వంచించి మఱి యునునేగు నెటకొ
అక్కడను నేగి, యేగు నింకొక్కయెడకు
ఇటులవిడిపోవు జనులపై నేలప్రేమ॥ 31

గర్భమున నున్నది మొదలుగా నవస్థ
లన్నిటను జంపఁగమృతి తయారె యైన
యప్పుడెటు నేనకాలమునందు వనికి
వెళ్ళితినని తండ్రి తనయప్రియుఁడు పలికె॥ 32

కామములననుభవింప నకాలమగును
అటులె యర్థ ముపార్జింప నదనె యగును
అఖిలకాలాలఁ గాలంబె యన్ని క్రమింగు
అఖిల శుభకర్మలకుఁ గాలమన్నదేది॥ 33

నాకు రాజ్య మర్పించుటనంగ నద్ది
అతియుదారమౌపని, తండ్రికది సహజము
లోభమున రాజ్యభోగముల్ గొనుటనాకు
తగనిపనియ, రోగికి నపథ్యంబువోలె॥ 34

మోహముల కిల్లయిన రాజ్యమును గ్రహించు
టెంతమాత్రము ప్రాజ్ఞుని కిందు తగదు

మదము శ్రమము నుద్వేగము పొదలు
పరుల యపచారముల ధర్మబాధకలుగు 35

మండుచున్న బంగారు హర్మ్యంబువోలె
విషము గలిసిన పరమాన్నపేటి వోలె
పలుమొసళ్ళున్న తామర కొలను వోలె
రాజ్యమది హృద్యము వ్యసనాశ్రయము కూడ 36

రాజ్యమిటు హాయిగాదు ధర్మమునుగాదు
పూర్వరాజు లసహ్యముపొంది విసివి
తప్పనట్టి బాధగల వృద్ధత్వమందు
రాజ్యములు వీడి వనమె యాశ్రయముగొంద్రు॥ 37

పైకిఁగానిపింపకలోన పాములటుల
నమరు శ్రీసులభమగు దోషములకన్న
రత్నములపొంది పొందు హర్షంబువోలె
అలవనిన్ భుజించెడి తృణంబులు వరంబు॥ 38

రాజ్యములువీడి నృపులు ధర్మాభిలాష
నడవుల ప్రవేశమది శ్లాఘ్యమగును జుమ్మ
ప్రతిన భగ్నముగావించి వనులవీడి
గృహమునఁ బ్రవేశించుటఁ శ్రేష్ఠమగునె॥ 39

మఱియు సత్యవంతుఁడు ఎవ్వండైన ధర్మాభిలాషతో వనము చొచ్చి మరల కాషాయమును విడిచి సిగ్గులేక దేవేంద్రుని పురమునైనఁ బ్రవేశించునె లోభమువలనఁగాని మోహమువలనఁగాని భయమువలనఁ గాని కక్కిన యన్నమునెవడు దినునో వాఁడె కామములను విడిచినవాఁడె లోభమువల్లగాని మోహమువల్లగాని భయమువల్లగాంని మరల వానిని పరిగ్రహించును మండిపోవునింటినుండి ఎట్లో యొకలాగున బయటఁబడి మిత్రుడైనను ఆయింటిని మరలప్రవేశించునా? దోషములుచూచి గార్హస్థ్యమును విడచిమరల మోహపడి గ్రహించునా? రాజులు గృహస్థులయి యుండియు మోక్షమును పొందిరను మాటనిజముగాదు. శమమె ప్రధానముగాఁ గల

మోక్షధర్మమొకచో, దండము ప్రధానమగు రాజధర్మమొకచో? శమమందిచ్ఛయున్నచో రాజ్యము శిథిలమగును రాజ్యమందిచ్ఛయున్న శమము శిథిలమగును శాంతిక్రౌర్యములు రెండును శీతోష్ణములవలె ఉదకాగ్నులవలె నొకచోటనుండవు. రాజులు దానియెడల నిశ్చయము వలనఁగాని రాజ్యాధికారులయిగాని రాజ్యములఁపు విడిచి శమమును పొందిరి జితేంద్రియులగుటవలన అనైష్ఠికావస్థయందె మోక్షముపొంద నభిమానము వహించిరి, వారికి రాజ్యముఁ యథావిధిగా శమము ప్రాప్తించినదను నిశ్చయము లేక నేను వనమును ప్రవేశింపలేదు ఇదినా యిల్లువీడు బంధువులను నాశాపాశమును విడిచిన నేను మరల గృహాదిబంధముల ప్రకాశింపఁ గోరను" అని యిట్లు ఆత్మవిజ్ఞాన గుణానురూపముగా స్పృహవీడి యుక్తియుక్తముగ శక్తివంతముగ రాజకుమారుఁడు చెప్పిన ప్రత్యుత్తరమును విని యపుడు అమాత్యవరుడును ఇట్లనియె

## తండ్రిని వదలరాదని మంత్రిచెప్పుట

నీకు ధర్మవిధినిగల నిశ్చయంబు
అనుచితముగాదు, గాని నే డనుచితంబు
వృద్ధుఁడౌ పితన్ దుఃఖవారినిధి ముంప
ధర్మకాముఁడవగు నీకు ధర్మమగునె॥ 40

ఆయదృష్టఫలముకు ప్రత్యక్షఫలము
కాలఁద్రోసి పోవుచునుంటి కాన నీదు
బుద్ధి యతిసూక్ష్మమునుగాదు పోని యదియు
ధర్మకామార్థములను మందమునుగాదు॥ 41

ఒకచోరందు పునర్జన్మ యున్నదనుచు
లేదనుచుఁ గొందఱు ప్రతినలు చేయుచుంద్రు
ఇట్లు సంశయము గలిగియొనఁగు నపుడు
స్వాయముగా వచ్చు శ్రీనేల వదలుకొందు॥ 42

ఏదయిన ప్రవృత్తి యొకటియొనయు నేని
ఇందువీఁడనుబట్టి సుఖింతు మెలమి

15వ ఆ తండ్రిని వదలరాదని మంత్రిచెప్పుట

ఇంతకంటె వేఱె ప్రవృత్తియెసఁగినపుడు
అప్రయత్నముగనె మోక్షమందవచ్చు॥ 43

ఒక్కరు పరలోకమన్నది యున్నదండ్రు
కాని వర్ణింపరిందు మోక్షంపువార్త
వహ్ని ఉష్ణత నీళ్ల ద్రవత్వములటు
ఆ ప్రవృత్తియైన కలయటండ్రు జనులు॥ 44

కొందఱు స్వభావమునుబట్టి యుందు శుభము
నశుభమును పుట్టుకయుఁ జావు నగునటండ్రు
సర్వమిద్ది స్వాభావిక మగునుగాన
మన ప్రయత్నముల్ వ్యర్థమైదనరుచుండు॥ 45

ఇంద్రియాల్ నియతముగఁ జరించుచుండు
విషయములఁ బ్రియాప్రియములు వెలయుచుండు
ముసలితనము రోగంబులు పొడముచుండు
యత్నమిటనేమి, ప్రకృతి జన్యములయివ్వి॥ 46

జలముచేత నీయగ్నియు శాంతిపొందు
నీరములను తేజస్సు నెండించివైచు
తత్త్వములు వేఱవేఱౌను తనువులందు
అవి యొకటొకటి కలియ నీభువనమగును॥ 47

గర్భమగు తఱిన్ జేతులు కాళ్లు పొట్ట
వీపు శిరసు నివన్నియు వెలయుచుండు
ఆత్మలో వ్యక్తికిని యోగమగుచునుండు
ఇదియు స్వాభావికమని వచింత్రు బుధులు॥ 48

ఎవఁడు ముండ్లకు తీక్ష్ణత్వ మేర్పఱించె
పక్షి మృగములకు విచిత్రత్వమెటుగలిగె
అఖిలమిది స్వభావాననె యగుచునుండు
ఇందుకామకారము యత్నమేమియులేవు॥ 49

అటులైన యీశ్వరుచే సృష్టి యగునటండ్రు
ఇందు యత్నానఁ బురుషునికేమి లాభ
మెయ్యది జగత్ప్రవృత్తిలో హేతువగునొ
అదె జగన్నివృత్తికి హేతువగుచునుండు॥ 50

జన్మకును మఱి జన్మ నాశంబునకును
ఆత్మయె నిమిత్తమని కొందఱనుచు నుండ్రు
యత్నమదిలేకయే జన్మయగునటండ్రు
యత్నములచేత మోక్షంబు నగునటండ్రు 51

జనుఁడు సంతతిచే పితృఋణమునుండి
ఋషి ఋణమునుండి శ్రుతులచే, నిష్టిచేఁ
సుర ఋణమునుండి ముక్తుఁడౌ: నరుఁడుమూఁడు
ఋణములను బుట్టు, నిదితీర్చ యొనయుముక్తి॥ 51

ఈ విధి క్రమమున ప్రయత్నించు ప్రజకు
మోక్షమగునని చెప్పిరి బుద్ధులు మున్న
శక్తికొలఁదిగ యత్నముల్ సలుపుచుండి
వివిధముగఁ గాంత్రు శ్రమ ముముక్షువులు సతము॥ 52

కనుక సౌమ్యా! ముక్తిని భక్తిగలిగియున్న
విధిని తఱి యథోక్తముగ సేవింపవోయి
ఇట్లుచేసిన నీకుఁ బ్రాప్తించుముక్తి
నరపతికిఁ గూడ సంతాపనాశమగును॥ 53

ఇఁకఁ దపోవనములను డి గృహముచేర
ఎట్టిదోష బుద్ధియు జనియించెనీకు
ఈ విషయమునఁ గూడఁ జింతింప వలదు
వనములనుండి పూర్వులు చనిరి యిండ్లు॥ 54

అంబరీషుఁడును తపోవనంబుగనియు
పురికి మరలెను పౌరులు కోరపూర్వమందు

అటులె రాముఁడు వనినుండి యరుగుదెంచె
మున్ను నార్యులు బాధించు పుడమిఁ బ్రోవ॥ 55

అటులె సాల్వాధిపతి ద్రుముఁడనెడివాఁడు
వచ్చెఁ బురికి కొడుకుతో వనమునుండి
బ్రహ్మ ఋషియయి సాంకృతి ప్రథితుఁడంతి
దేవుఁడు వసిష్ఠునుండి శ్రీ తిరుగ పొందె॥ 56

ఇట్లు ధర్మయశసుల దీపించు నృపులు
వనములను వీడి భవనముల్ వడసినారు
అందుచేఁ దపోవనినుండి మందిరంబు
ధర్మమునకయి పోవుట తప్పుగాదు॥ 57

ఇట్లు నృపచక్షువైన మంత్రిచెప్పిన ప్రియము హితమునైన వాక్యము ధీరుఁడైన రాకుమారుఁడు విని యుదారము అవ్యస్తమును ఆసక్తిలేనిదయిన ఈ వాక్యము పలికెను "ఈ విషయములో ఉన్నదని లేదని సంశయించు వారివాక్యములు నాకుఁ బ్రమాణములుగావు, తపస్సుతోను శమముతోను తత్త్వమును దెలిసికొని ఏదోయొక నిశ్చయమును గ్రహింతును అవ్యక్తమును పరస్పర విరుద్ధమునైన సంశయముచేఁ గలిగిన దర్శనము నాకు తగినదికాదు ఇతరుల నమ్మకమునుబట్టి అంధకారములో అంధునిచే దారి చూపఁబడు నంధునివలె ఏబుధుఁడు నడచును. నేను తత్త్వమును దర్శింపకున్నను శుభాశుభములలో సంశయమున్నపుడు శుభమందె నా బుద్ధి ప్రవర్తించును, శుభమైన మార్గములో పోవువానికి శ్రమయైనను మంచిదె కాని అశుభమార్గములో సుఖముమాత్రము మంచిదిగాదు అది నిజముగకు సుఖమైననుసరే ఈ శాస్త్రమును అవ్యవస్థితమైన దానినిగాఁ జూచుచున్నారు కావున ఆప్తులు చెప్పిందే మంచిదని యనుకొనవలెను దోషములేక పోవుటయె ఆప్తత్వము, ఏలయన దోషములు నశించిపోయిన వాఁడు అసత్యమును ఎట్లును పలుకఁజాలడు. రాముఁడు మొదలైన వారిని నిదర్శనముగా జూపి గృహ ప్రవేశమును గూర్చిచెప్పినది ప్రమాణముగ నేను దలఁపను వ్రత భ్రష్టులైన వా

ధర్మములో ప్రమాణముగారు, కనుక సూర్యుఁడు భూమిపైఁబడినను హిమవంతుఁడు స్థిరత్వమును త్యజించినను సరే నేను తత్త్వమును జూడకుండ ఇంద్రియములను విషయాభిముఖములనుజేసి జ్ఞానినై మాత్రము ఇంటికి మరలఁజాలను. మండుచున్న యగ్నియందైనను ప్రవేశింతునుగాని అసఫలుఁడనై మాత్రము ఇంటికిపోవను" అనిచెప్పి యాసిద్ధార్థుఁడభిమానముతో ప్రతిజ్ఞచేసి నిర్మలుఁడయి తన యిచ్చవచ్చిన చోటికి వెడలి పోయెను అంత నామంత్రి పురోహితులిద్దరు వాని నిశ్చయమువిని కనుల నీరునిండ విషణ్ణవదనులై కొంతవడి వానివెంటఁజని యింక వెళ్లలేక మెల్లఁగా నింక చేయునదిలేక కపిలవస్తు నగరమువైపు వెడలి అంత

వారతనిపైని స్నేహాన ప్రభునిపైని
భక్తితో, బెంగగొని, వాని వదలలేక
వెనుకకు మరలిరి, నిల్చిరి, వెళ్లి సైప
లేని రవిఁబోలె గనలేరు మాఁడలేరు॥ 58

సరె యింకనేమొనర్తుమని చాల విషాదము పొందుచుండి భూ
వరసుతు సంగతుల్ తెలియఁ బ్రాజ్ఞుల శుద్ధుల గూఢచారులా
పురుషుల జూడనూరనివి పుత్రునిపైని సమస్తప్రాణముల్
గరమిడి శుద్ధరాజు నెటుగాంతు మటంచును పోయిరెట్టిటో॥ 59

ఇది

కుమారాన్వేషణమను

పదునైదవ యాఖ్యానము

# బుద్ధ భగవానుని చరిత్ర

## పదునాఱవ యాశ్వాసము

### బింబిసారుఁడు సిద్ధార్థుని గాంచుట

నృపసుతుఁడుపీన వక్షం
డు, పురోహిత మంత్రులుఁగడు వగచుచు నర
ణ్యాపు రోదనము చేసెడి
యపుడున్ నిర్మమతతోడ నేఁ నుండిచనెన్॥ 1

అట్లుచని తనచేతల కుప్పొంగినదివోలెఁ బైకిఁ బొంగి పొం తరంగములుగల గంగానదిలో స్నానమాడి దానిని దాటి వాలికిమునఁ గొన్నిదినంబులుండి భిక్షకయి యక్కడికిఁ గొంతదవ్వులనున్న బింబిసార పురము గిరివ్రజమను రాజగృహంబునకుఁ జనెను అంతనతఁడు

పృథు శిలాప్రాకార విజిత లోకాలోక
ము, నగాధ పరిఖాంబుముకులితాబ్ధి
ఘోటక ఖరకోటి క్రోడీకృత భువము
మదగజ మద పంకమ్ముదుల పథము॥ 2

మణిసౌధవలభీ సమంచిత హంసము
తత గవాక్షోద్గిర దగురుధూమ
ము రు నూపురరవంబు మరుదుచ్చలిత కేతు
వింద్రధను ర్ద్వార బృందయుతము॥ 3

---

*అనవమ—నదినిదాటి బింబిసారపురిజేరినట్లు బుద్ధ[illegible] దాటి బింబిసారపురిజేరినట్లు అశ్వఘోషుఁడు.

మహిత రాజవీధి రథ్యా మధ్యమంబు
వాపివీచికా క్షాళిత పాదపంబు
పంచగిరిగుప్త ముష్ణాంబుపల్వలితము
రాజగృహముచొచ్చె దివమున బ్రహ్మవోలె ॥ 4

పట్టుదుకూలంబు వలెవాటుగాపైని
ప్రముఖుండు కాషాయబట్టుకట్టె
మెత్తనికురులపై మేటి కిరీటాలఁ
దగు రాసుతుఁడు బోడితలను దాల్చి తిరిగె
ప్రమదలు వడ్డింపఁ బసిఁడిపాత్రలఁ దిను
వాఁడు చేతుల భిక్షపాత్రపట్టె
పడిగాపు పడియుండి పరమాన్నము లిడఁగ్రా
నెడి వాఁడు భిక్ష కిల్లిల్లుదిరిగె ॥
ఆలరు పట్టుతివాచీల నడుగులిడుచు
మసలి నీడసోకెడు సుకుమార తనుఁడు
కటికనేలల నెండలు కాల్చుచున్న
నర్థియై భిక్షమర్థింప సిద్ధార్థుఁ డరిగె ॥ 5

దారుణ వ్రతమూను కౌమారిఁ బోల
నతని గాంభీర్య మొప్పు నతని శిరము
దీప్తులొలికెడి యాతని దేహమును
జనము మిక్కిలిగ మదినాశ్చర్యపడిరి ॥ 6

అన్యపథముఁ బోయెడి జనంబాగిచూచె
అచటనున్న వాఁడతని నమస్కరించె
త్వరగఁ బోయెడివాఁడు మందముగ నడచె
నేలఁగూర్చున్న వాఁడు లేచి నిలిచిచూచె ॥ 7

ఒక్కఁడుమాని కేల్మోడ్చె నొక్కఁడు శీర్షమునంచి సాగిలెన్
ఒక్కఁడు ప్రేమతోఁ బిలిచె నొక్కఁడు గొల్వకపోవఁ దెమ్మనే

16వ. ఆ బింబిసారుఁడు సిద్ధార్థునిఁగాంచుట

ఒక్కరు వేషగాండ్రొదిగి యొక్కరు ప్రా[illegible]
ఒక్కఁడు ధర్మమే యెదుటనుండెనొ యన[illegible]

ఇతరకార్యాల మగ్నులై యెసఁగి కూడ
పురుషులును స్త్రీలు బహుమానపూర్వకముగ
దేవకల్పుఁడౌ సామాన్యుఁ దేజిమూర్తి
యరయుచుండియు సంతృప్తినందరైరి.

కన్నొప్పులు, నుదురుమొగంబు కనులు చే[illegible]
కాళ్లు చేతులు నడకయు కడిగియెవడు
వరనిరెది వారియందె యాగిపోయి
కట్టఁబడినట్టుల దృష్టి కదలదయ్యె

చక్కనివెండ్రుకల్ మెఱయు చెల్వపు [illegible]
చక్కని కన్నులన్ దనరిసాదులనీనిమేమ, [illegible]
బక్కననప్పు కేలమరి, బాగుగ [illegible]
ఒక్కని భిక్షురూపు నితనిన్ గని [illegible]

ప్రజలలో మోహమును బాపువాఁడెయన్న
శ్రీమునీంద్రుని వీక్షించి నెంతొ బాల
లైన కామినులెల్లరు స్వాంతమందు
మిగుల మోహనిద్రనుగాంత్రు మేలుకొ[illegible]

రెప్పలేయక మూయక విప్పుకొన్న
నేత్రములుగలుగు విశాల నేత్రలపుడు
చిత్తములయందు నామారజిత్తుఁగూడ
మారుఁబుట్టించి మించె పల్ మాఱులపుడు.

సరిగ మగధాధిపతి బింబసారుఁడప్పుడు
బాహ్యసౌధమారోహించి పాటలందు
జనులు ప్రోగులు పడియుండఁ గనుచు [illegible]
వలనఁ బ్రజ కూడిరనిపల్కి [illegible]

జ్ఞానపదము లేక సామ్రాజ్యలక్ష్మినో
కనఁగ విప్రకథన మనుసరించి
శాక్యసుతుఁడు వీఁడు సన్యాసియయ్యెను"
అని జనంబుమాటు రనియెనతఁడు ॥ 15

దాని విని బింబిసారుండు మానసమున
ఆదరముగల భటునితో ననియెనిట్లు
ఆయనఘుఁడెటు చనునేమి చేయుమరయు
మనసరెయని యాతఁడతని ననుసరించె॥ 16

అంత నా భిక్షు కోత్తముఁడచలదృష్టి
మహినిబారెడు దూరంబు మాత్రఁగనుచు
మౌనమున మందగమనుఁడై మదియు మేను
స్థిరముగానిల్పి భిక్షకై తిరిగెఁబురిని॥ 17

దొరకినంత భిక్షనుగొని దరిగనున్న
కొండ సెలయేటిమునిఁగి గూర్చుండి యొంటి
నుచిత రీతిగఁదిని దాని యోగ్యుఁడతఁడు
నచటి పాండవాద్రిని నెక్కి యందునిలిచె॥ 18

అచట నెమిళులు కలాలాపములు మీఱ
లలిత నృత్యంబులు సలుపుచుండు
అచట సింహములు పదాఘాతముల చేత
మదపుటేనుఁగులఁ జదుపుచుండు
అచట నేన్గులతొండమట్టుల భాసిల్లు
పాములు స్వైరమవఱలి తిరుగు
అచటఁ గొండచరియలందలి చాయల
నీలాభ్రపథికులున్ విశ్రమింత్రు ॥
అచట సింహపాదముల ముత్యాలురాలు
అచట శిఖరాలు నాకాశమంటి గేయు

అచట సెలయేళ్లు గిరిచఱియలను గడుగ
అచ్చటఁ గిరాతసైన్యంబు లాశ్రయించు॥ 19
అట్టిగిరిని లొద్దుగువనులలరు చోట
నెమిళుల ధ్వనులు పొదరిండ్ల నిండుచోట
అనఘుఁడాతఁడు కాషాయముధరించి
ఉదయగిరిపైని రవివోలె ద్యుతులనింపు॥ 20

ఇటుల నాపాండవ పర్వతమున నేకాంత మందున్న యా సిద్ధార్థుని జూచి యా రాజభటుండు పోయి బింబిసారుని కీ వృత్తాంతమంతయుఁ జెప్పఁగావిని బహుమానముతో వినమ్రులైన యనుచరులు వెంటరాఁగా పాండవతుల్య వీరుఁడును శైలమువలె నున్నతమైన విగ్రహము గలవాఁడును కిరీటధారియు, సింహగమనుఁడునైన యాబింబిసారుఁడు జూలుకదలు సింహము వోలె నా పర్వతమధిరోహించెను॥

పర్వత శృంగంబు వలెను నిశ్చేష్టుఁడై
    కదలక మెదలక గాలువాని
ఇంద్రియ సంచారమెల్లను నడఁగించి
    శాంతమెల్లెడ వెదఁజల్లువాని
క్షమను పర్యంత కాననము నందుఁగూర్చుండి
    ధ్యానంబుతో మౌనమూనువాని
మబ్బుదొంతరనుండి మరలివచ్చు సుధాంశు
    వలెమేని వెన్నెలల్ చిలుకువాని॥
రూపలక్ష్మిచే శాంతిచే రూపుగొన్న
ధర్మమువలెను గూర్చున్న దాంతు నతని
నమ్రుఁడై బింబిసారుండు దరికినేగి
యింద్రుఁడు స్వయంభువునుబోలె నెంచినిలిచె॥ 21

పిదప న్యాయవేత్తలలోనఁ విదితుఁడతని
న్యాయముగఁజేరి కుశలంబు నడిగె రాజు
అపుడు సిద్ధార్థుఁడును రాజు న్యాయరీతి
కుశలమును మనశ్శాంతిఁగూర్చి యడిగె॥ 22

పిదప నేను-గు చెవులవలె నీలమయిన శుచియైన శిలాతలమున గూర్చుండి సిద్ధార్థు ననుమతిపొంది యతనిభావము నెఱుంగఁగోరి రాజిట్లు పలికెను.

మీకులంబన్నచోఁ గడుంబ్రీతి నాకు
ఇది కులక్రమంబునుబట్టి యేగుదెంచె
ఇది పరీక్షించితిని, మిత్ర: యిందువల్ల
నొకటి చెప్పఁగోరెద, నాప్రియోక్తివినుము॥ 23

“కులమో నీయది సూర్యునుండివెడలెన్ గొంగ్రొత్త దీప్రాయమా
వెలుఁగుల్ జిమ్మను నీశరీరమిదియో, విశ్వాధికారంబును
జ్వాలసమ్రాట్పదవిన్ త్యజించి యిటులన్ భైక్ష్య ప్రవృత్త్యర్థమె
ట్టుల నీ యక్రమబుద్ధి నీకొదవె నెట్టుల్ వేసితీవేషమున్॥ 24

తనువు హరిచందనమునకుఁ దగునుగాని
రక్తకాషాయమునకు నర్హంబుగాదు
హస్తమో పరిపాలనార్హంబుగాని
ఇతరులిడు నన్నముదినుట కేమి తగదు॥ 25

కనుకఁ బైతృకరాజ్యమున్ జనకుప్రేమ
విక్రమంబునఁ గైకొన నక్రమమని
తలఁతు వేనర్ధరాజ్యము త్వరగనాది
యనుభవింపుము దీనికై వనట వలదు॥ 26

ఇట్లులైనన్ స్వజనము చింతింపకుండు
సరిగఁ గాలక్రమమున నౌ శాంతిశ్రీయు
అందుచే నాదు ప్రణయము నాచరింపు
సుజన సంగతిచేఁగల్గు సుజనవృద్ధి. 27

మఱి కులాభిమానముచేత మాయెడలను
నీకు మిగులవిశ్వాసమేలేక యున్న

నాదు సాహాయ్యమొంది బాణములతోడ
సైన్యములఁ జొరఁబడిగెల్వు శత్రువులను॥ 28

అందుచే నేదొయొక మార్గమనుసరింపు
ఆదన ధర్మార్థ కామములనుభవింపు
ఆ సధర్మార్థకాకు వ్యత్యయముచేయ
పరము నిహముచెడి యుభయభ్రష్టుఁడవుదు॥ 29

ఎవ్వాఁడు ధర్మమర్థముఁ ద్యజించియుఁ గామమెపొందులేనిచో
నెవ్వాఁడు ధర్మకామములనే విడియర్థమె పొందులేక యుం
డెవ్వాఁడు కామమర్థము ద్యజించియు ధర్మమె గొల్చువాఁడు తా
నెవ్విధిఁ బూర్ణలక్ష్యము గడింపఁడు భ్రష్టుఁడెయౌను నిద్ధరన్॥ 30

కనుక ధర్మార్థ కామసేవనము చేత
ఈ సురూపము సఫలమొందింపవోయి
పూర్ణముగ ధర్మకామార్థములను గొలువ
నపుడె పూర్ణమగును పురుషార్థమెల్ల॥ 31

కనుక ధనువు నాకర్షింపఁగలిగి బలియు
నీభుజంబుల వ్యర్థమొందించకోయి
వినితోడుత మాంధాతఁబోని నీవు
ముజ్జగములెగెల్తు విదెంత భూమియనఁగ॥ 32

స్నేహమున నీకు నేనిట్లు చెప్పుచుంటి
బలిమి నైశ్వర్య ముదమునఁ దెలుపలేదు
ఇట్టి నీభిక్ష వేషంబు నిట్లుచూచి
కనులనీరూన జాలితోఁగని వచింతు॥ 33

నీదువంశంబునకుఁ నీవు క్రమత
నెందనుక నీకువార్ధక్యమింక రాదొ
అంతవఱకు కామంబుల ననుభవింపు
విదప భిక్షధర్మమ్ము పూనుదువుగాక॥ 34

వృద్ధుఁడయ్యు ధర్మము నాచరింపఁ గలఁడు
వృద్ధుఁడై కామములనుభవింపలేఁడు
పడుచువాఁడొ కామముల, నడిమివాఁడు
ధనము, వృద్ధుధర్మముఁ బొందగునటంద్రు॥ 35

కుమారా! జీవలోకమున యౌవనము ధర్మార్థములకు శత్రువు ఏలన అయౌవనమును నియమములు మించినను అది పట్టరానిది ఆకాశమార్గము తనవ్వై పే లాగుకొనిపోవును జీర్ణమైన వయస్సు విమర్శనముగలది అది ధీరమై స్థిరమై యుండును అల్పప్రయత్నముచే దాని శాంతిలోనికి దీసి కొని రావచ్చును. ఏలయన విధిలేకను సిగ్గుచేతను అది శాంతమై యుండును కనుక చంచలము విషయభోగ ప్రధానము ప్రమాదపడునదియు, క్షాంతి తీర్ఘదృష్టిలేనిదియునగు యౌవనము నతిక్రమించి యడవినిపతెదాటి స్థిమితు ఁగుదురు కనుక అధీరయిన యీవయస్సును పోనిమ్ము కాముని కీవయస్సు లక్ష్యము ఇంద్రియములనుండి రక్షింప శక్యముగానిది మఱీనీకు ధర్మమందె కనుక చికీర్షయున్నచో యజ్ఞముల చేయుము ఇది కులధర్మము యజ్ఞములద్వారా ఇంద్రుఁడును గుఱ్ఱమెక్కి స్వర్గము పొందెను. ఏ గతిని మహర్షులు పొందుదురో దానిని రాజవర్గులు బంగారు కేయూరము చేతుల బంధి చి మతి ప్రదీపోజ్జ్వలమైన కిరీటములు ధరించి శ్రమములేకుండ పొందుచుఁదురు.

అని మగధపతి సురపతి యట్లుపలుక
రాజసూనుండు వినియునల్పమును
కదలక మెదలకయు ధృతిఁ బొదలుచుండె
రంగు రంగుసానువుల కైలాసమట్లు 36

ఇది

పదునాఱవ యాశ్వాసము

# బుద్ధ భగవానుని చరిత్ర

## పదునేడవ యాశ్వాసము

### బింబిసారునితో సిద్ధార్థుఁడు తన నిశ్చయము తెలుపుట

ఇట్లు మగధాధిపతియు స్నేహితుని పగిది
తనకుఁ బ్రతికూలమైన యర్థము వచింప
నిర్వికారుఁడై స్వస్థుఁడై నిజకులంపు
శుద్ధిగలుగు శౌద్ధోదని చూచియనియె॥ 1

బహు విశాలమౌ హర్యంక వంశమందు
వెడలు మీరిట్లు పలుకుట వింతకాదు
మిత్రులందు ప్రేమముకల్గు మీరలిట్లు
శుద్ధమౌ వృత్తితో నుంట చోద్యమేమి॥ 2

చల మనస్కులయందు శ్రీ వలెను నెపుడు
స్వాకుల మైత్రియుండ దసాధులందు
పూర్వకృత మైత్రినే స్నేహములను మిగుల
సుజనులే వృద్ధిపొందించుచుందు రెపుడు॥ 3

సుహృదుడవయౌట మఱియుఁ బూజ్యుఁడవయౌట
నాయెడల నీకు నేయభిప్రాయ మొదవె
అందు నే నిన్ను బ్రతిమాలికొందు నింక
ఉత్తరంబేమి నీకు నొసఁగఁజాల॥ 4

నేను జరమృత్యు భయముల కెంతో వెఱచి
వానినుండి మోక్షముపొంద వ్రతము గొంటి

మొదఁనే కామముల వీడి విడప నేను
కనుల నీరూన నేడ్చు నాజనుల విడితి॥ 5

విషయములనుండి నే నెంత భీతిగాంతు
నంతగా భీతిచెంద సర్పాళినుండి
ఆకసమున పడు పిడుగుల సరసికాని
గాలితోడైన యగ్నిచేఁగాని వెఱవ॥ 6

కామము లనిత్యములు భ్రమింగుఁగౌశలములు
శూన్యములు లోకమున మాయచూపుగలవి
పైనినుండియు వ్యామోహపఱచు నందు
నింక మదినుండి వ్యామోహ మెట్లువిడవు॥ 7

కామములచేత ధిక్కృతులౌ మనుష్యు
లందె సుఖియింపరిట సౌఖ్యమెట్లుగాంత్రు
తృష్ణగలవాఁడు కామానఁ దృప్తిగొనఁడు
అగ్నిఁగట్టె వేయకొలంది నటులెమండు॥ 8

కామసమమౌ ననర్థంబుఁ గాఁచలేము
అందు జనము చిక్కుకొను మోహంబుచేత
తత్త్వమిట్లు తెలిసి యనర్థముల వెఱచి
ప్రాజ్ఞుఁ డెవ్వఁ డనర్థాల వాంఛచేయు॥ 9

వార్ధుల వఱకు గల భూమి పడసికూడ
వార్ధిపారమును జయింప వాంఛగొంద్రు
ఎల్లలోకాలు కోరెక్కుచేఁ దృప్తిగనరు
నీరు నదులదెంత పడినన్ నిండదబ్ధి॥ 10

అమరులు సువర్ణమును గుర్సినప్పటికిని
నాల్గు ద్వీపంబుల జయించినప్పటికిని
నింద్రు నర్ధాసనమున నెక్కికూడ
భోగముల దృప్తి మాంధాత పొందలేదు॥ 11

వృత్రు భయమున నింద్రుండు వెఱచి పాఱ
దివిని దేవుల రాజ్యానుభవము పొంద
ఋషులచేత దర్పమున మోయించి కూడ
కామములఁ దృప్తి నహుషుఁడు గనకె పడియె॥ 12

ఐడ నరపతి త్రిదివంబునంది యచట
ఊర్వశిని వశమున నెప్పుడుంచి కొనియు
ఋసులనుండి బంగారమాశించి యాశ
తృప్తిగనక భోగాల, నశించిపోయె॥ 13

బలిచేతినుండి యింద్రుని
నల యింద్రుని చేతినుండి యానహుషుని. ని
ష్టులె నహుషునుండి యింద్రు ని
దులు మాఱెను చంచలవు సిరుల నమ్మబెటుల్॥ 14

మరియు నారబట్టలు ధరించి పండ్లుదుంపలుతినిన మునులుకూడ కామములఁ బడిపోవుచున్నారు వానికై ఎవ్వఁడిష్టపడును, ఎముకలు కొఱుకుచు, వానిని వదలలేని కుక్కలవలె ఈ యస్థిపంజరములనెవరు ఆశింతురు, జరామృత్యు రోగములవలని భయములను దాఁటఁగోరు నా విషయమై వీఁడుభిక్షగై కొనుచున్నాఁడే, అని యనుకొనరాదు, నేని సంసార బాణముల దెబ్బతిని శాంతిని పొందఁ గోరుచున్నాను కనుక త్రైలోక్య రాజ్యమును గూడఁ బొందఁగోరను. ఇంతకన్న నీవు నేనసురూపముగఁ జెప్పఁజాలుదునే. నీవు కొత్తది వయస్సు జరవచ్చువరకు వేచియుండ మంటివి, జరలో అధైర్యము యౌవనములో ధైర్యముండునను మాట నిశ్చయముగఁ జెప్పజాలము, యువకుఁడుగాని వృద్ధుఁడుగాని శిశువైనను సరే వాఁడుధర్మముగా నుండుటకు శీఘ్రముగ యత్నింపవలెను యజ్ఞములు చేయవచ్చునంటివి అవి హింసతోఁ గూడినవి కాన అవిచేయుటఅయుక్తము, ఇతరులను బాధింపగావచ్చు సుఖము సుఖముగాదు మోక్షమునుగురించి చెప్పెడి అరాడమునిని జూడఁగోరి యిటకు వచ్చితిని ఇప్పుడే నేనతనిదగ్గరకుఁ బోవుచుంటిని రాజా! నీకు శుభమగుఁగాక. నేను చెప్పిన తత్త్వములో

నేదియైన నిష్ఠురత్వమున్నచో మన్నింపఁదగుదువు, అని యిట్లు సిద్ధార్థుఁడు వచింప నంత నా బింబిసారుఁడిట్లనియె

సరియె కానిమ్ము నీ యభీష్టముగఁ బోయి
నీవు కృతకృత్యుఁడవగుము నెప్పుడౌదు
వపుడనుగ్రహింపుము చెప్పి. యనుచు నృపుఁడు
నరుగ, నతఁడేగె వైశ్యాంతరాశ్రమంబు॥ 15

అటగాలాముని గోత్రజుండగు నరాడాఖ్యాత మౌనీశుఁడం
తట దూరంబుననుండియే యనఘు సిద్ధార్థున్ వడిన్ గాంచి మి
క్కుటమౌ ప్రేమను స్వాగతంబిడి యిటన్ గూర్చుండు మీయంచుఁ జెం
గటఁ గూర్చుండఁగ బెట్టి కొంచడిగి యోగక్షేమ మాతఁడిసెన్. 16

ఎఱుఁగుదును నేను సౌమ్యా! నీవింటినుండి
యిందువచ్చితి వెంటయి ధృతి దలిర్ప
స్నేహమయమైన పాశమున్ ద్రెంచివైచి
కొమ్మ తేఁటి గుఱుగు పాదాల గొలుసుఁబోలె॥ 17

వయసుచెల్లిన పిదపఁ గొడుకులకు సంపదలప్పగించి వేసికొని తీసివేసిన పూలదండనువలె విసర్జించి వచ్చుటలో వింతలేదు, నీవీవయసున వచ్చితివి. శిష్యుని పరీక్షించి శాస్త్రములను గురువులు చెప్పుదురు నిన్నట్లు పరీక్షింపఁబనిలేదు, అని యరాడముని యనఁగ ఆసిద్ధార్థుఁడు సంతసించి యిట్లనియెను "మీరు విరక్తులయ్యు నామీఁద మిగుల అనురక్తిఁ జూపితిరి, ఒకవేళ నాయన్వేషణలో నేను కృతార్థుఁడ కాకపోయినను విచారింపను మీరిట్లు వాత్సల్యము చూపుటయె కృతార్థతగా భావింతును చీకటిలోనున్న వాఁడు వెలుఁగునువలె, మార్గభ్రష్టుడు పథదర్శకునివలె సముద్రమునఁ బడిన వాఁడు నావనువలె జరామరణరోగముల భయపడిన నేను నిన్ను వాని నుండి విముక్తి గలిగించువానినిగ దలచుచున్నాను, కనుక ఆమార్గము నుపదేశింప మీరర్హులరు" అని సిద్ధార్థుఁడడుగ యామౌని వినుము సంసారము నివర్తించి నుపాయము చెప్పెదనని యిట్లు చెప్పె.

# ఆరాడముని బోధ

ప్రకృతి వికృతియు జన్మ జరయును మృతియు
సత్త్వమని చెప్పఁబడు సారసత్త్వ! వినుము
దానిఁ బ్రకృతి యనఁగఁ బంచభూతాలు బుద్ధి
ఆ యహంకార మవ్యక్తమని యెఱుఁగుము॥ 18

విషయములు నింద్రియంబులు వినుము ప్రాజ్ఞ
పాణిపాద పాయూపస్థ వాఙ్మనస్సు
లివి వికారము లిది క్షేత్ర, మిట్టి క్షేత్ర
మరయ క్షేత్రజ్ఞుఁ డని యందు రాత్మవిదులు॥ 19

భువి నశిష్యుఁ గాపిలుని ప్రతిబుద్ధుఁ డండ్రు
పుత్రయుతు బ్రహ్మ నప్రతిబుద్ధుఁ డండ్రు
పుట్టి చివికి క్రుంకియు మృతిపొందు దాని
వ్యక్త మందు రన్యమును నవ్యక్త మండ్రు॥ 20

విపర్యయము అహంకారము సందేహము అభిసంప్లవము అవిశేషము అనుపాయము సంగము అభ్యవపాతము అను వీనిఁ గూడి జన్మాది రూపమైన సత్త్వము దాటలేడు.

చేయవలసిన దన్యథా చేయు చుంట
తలపవలసిన దన్యథా తలఁచుచుండ
ఇట్టులు విరుద్ధముగను గావించుకొనఁగ
యది య విపర్యయమటంచు నండ్రు బుధులు॥ 21

నేను చెప్పుచుంటిని నేనె యెఱుఁగువాఁడ
నేను వెళ్లుదు నేనుందు నిట్టులనుట
యది యహంకారమందు రహంకృతి యివి
కలదు సంసారమున నిట్లహంకారమాన్య॥ 22

ఎవ్వఁడు పరస్పరము మేళవింపనట్టి
వస్తువుల మట్టిముద్దను బలెను గాంచ
దీని సందేహమంద్రు సందేహ శూన్య!
సమతనెల్లఁ గాంచ నవిశేషంబటంద్రు॥ 23

కని నమస్కారమును వషట్కారములను
ప్రోక్షణమును నభ్యుక్షణ ముఖ్యమైన
వాని ననుపాయములటంచు ప్రాజ్ఞులెల్ల
పలుకుచుందురు సుమ్మి యుపాయవేత్త॥ 24

విషయములయందు సక్తులై వెలయువారు
వాఙ్మనోబుద్ధి కర్మలఁ బట్టువడుచు
నుందురను నభిష్వంగమై యొప్పునటుచు
పలుకుచుంద్రు గద యనభిష్వంగః యెపుడు॥ 25

నాదియిది నేను వీని బాంధవుఁడ నంచు
దుఃఖమున నభిమానించి తూగుచుండ
దీని నభ్యవపాతంబుగానె యంద్రు
దీనిచేత సంసారంబులోనె యుంద్రు॥ 26

మఱియు తమస్సు మోహము మహామోహము తామిస్రము మహాతామిస్రము అని యైదు పర్వములుగల యవిద్య గలదని విద్వాంసులందురు అందు సోమరితనమె తమస్సు. జన్మమరణములు మోహము, మోహశూన్యా! కామమె మహామోహమని తెలియుము, మహాభూతములు గూడ ఇందు మహా మోహమును బొందును గాన దీనిని మహా మోహమందురు క్రోధశూన్యా! క్రోధమె తామిస్రము విషాదశూన్యా! విషాదమునె మహాతామిస్రమందురు ఈ యైదు కణుపులుగల మాయావిద్యచేత మూర్ఖులు దుఃఖభూయిష్ఠమైన సంసారమున జన్మలందుఁ దగుల్కొందురు.

నేను శ్రోతను ద్రష్టనున్ జింతకుండ
నేను కార్యసాధకుఁడని యిట్లు జనము

ఎంచి సంసారమున భ్రమియించు నిట్టి
హేతువులచే సంసారమిట్లు సాగు॥ 27

హేతువులు లేనిచో ఫలమింక లేదు
అందు బుద్ధిమంతుఁడు మోక్షమందఁగోరి
జ్ఞా మజ్ఞాన మవ్యక్తమేని వ్యక్త
మేని ఈ నాల్గు సరిగ గ్రహింపవలయు॥ 28

ఇందుకై బ్రాహ్మణులు బ్రహ్మమెంచుచుండి
బ్రహ్మచర్యచే శిక్షింత్రు బ్రాహ్మణులను
అని వచించు నరాడు వాక్యముల దలఁచి
నైష్ఠికపదవ్యపాయంబు నిష్ఠ నడిగె॥ 29

ఎట్లు బ్రహ్మచర్యము నాచరింపవలెనో
ఎంతగా నెట్టు నేనాచరింపవలెనో
ఇట్టి ధర్మంబునకు ముగింపెంతవఱకో
నాకు నీవు చక్కఁ దెల్పండి గురువర్యా॥ 30

అని యిట్లు సిద్ధార్థుండడుగుటయునంత అరాడుఁడు యథాశాస్త్రముగ స్ఫుటముగ ఇదివరలో చెప్పినదానినె యింకొకవిధముగ నిట్లు చెప్పెను

ముందుగ నిల్లువీడి యిటు పూర్తిగ భిక్షువేసమూని యా
నందముతో సదాచరణ నైష్ఠిక వర్తనమొంది యొంటియై
యెందును ద్వంద్వభావనఁ దరించి విరక్తిని నింద్రియంబులన్
పొందుగ నిల్పినన్ శమము పూర్వపు ధ్యానముగల్గు నెంతయున్॥ 31

ఆవల ధ్యానసుఖము నొందియది యునిదియు
నెంచుచు నపూర్వ సుఖమొందు నిదు జనుఁడు
ద్వేషకామాలు దాటి శాంతిని దనర్చి
కడు ముదముపొంది బ్రహ్మలోకమును గాంచు॥ 32

మనసు కలఁచు వితర్కాలఁగని బుధుండు
ఆవితర్కాల లేనట్టి ధ్యానమొందు
ఇట్టి యానందమున్ వేఱులెవియుఁ గనక
భాస్వరస్థానమొందు నా భాస్వరులను॥ 33

ప్రీతి సుఖమునుండి మనస్సును వేఱుచేసుకొని, సుఖమయమైన ప్రీతిరహిత తృతీయధ్యానమును పొందును ఆ సుఖములో మగ్నుఁడై విశేషములకై యత్నింపక శుభమె సర్వస్వముగాగల దేవతలలో సుఖము పొందును పిదప సుఖ దుఃఖములులేని ధ్యానమును పొందును సుఖదుఃఖములను విడచుటవలనను చేతస్సు ఏపనిలోను ఉండక పోవుటవలనను ఇదే మోక్షమని కొందఱభిమానింతురు బ్రహ్మజ్ఞానమును పరీక్షించువారు ఈ ధ్యానమునకు ఫలము బృహత్ఫలులగు దేవులతో నివసించుటయె యని యందురు పిదప సమాధినుండి దేవుల దోషములనెఱిఁగి శరీర నివృత్తికై జ్ఞానమునుపొందును, పిదప ఆధ్యానమును విడచి విశేషమందు నిశ్చయము కలిగి కామములనుండి వలె రూపమునుండి విరక్తుఁడగును శరీరమందున్న శూన్యస్థానముల కల్పించి పిదప బాహ్యపదార్థములను గూడ శూన్యముగాఁ దలఁచును ఇక బుద్ధిమంతుడు పిదప ఆకాశమందున్న తన్ను సంక్షేపించుకొని దానిని అనంతముగాఁ దలఁచుకొని విశేషమును పొందును, అధ్యాత్మకుశలుఁడింకొఁకడు ఆత్మచే ఆత్మను నివర్తింపఁజేసి యిక ఏమియు లేదని ఏమియులేని దానినిగాఁ జూచును పిదప గఱిక (ముంజగడ్డి) నుంచి పోచవలె పంజరమునుండి పక్షివలె దేహమునుండి క్షేత్రజ్ఞుఁడు విడివడి ముక్తుఁడనఁబడును. ఇదే పరమము నిర్లింగము ధ్రువమైన యక్షరపదము తత్త్వజ్ఞులు దీనిఁ మోక్షమందురు. ఈ విధముగా ఉపాయము మోక్షము గూర్చిచెప్పితిని, ఇది తెలిసినచో ఇందు నీ అభిరుచినిబట్టి ప్రవర్తింపుము జైగీషవ్యుఁడు జనకుఁడు వృద్ధపరాశరుఁడు ఈ మార్గము ననుసరించియె మోక్షముపొందిరి" అని ఆరాడమునీంద్రుఁడు చెప్పవిని యతఁడిట్లనియె.

భావి శుభమగు జ్ఞానతత్త్వంబు వింటి
ఇవియ నైష్ఠికమగు క్షేత్రవిదుని విడమి;

ప్రకృతి వికృతుల ముక్తుడై వరలె నైన
బీజ జన్మలు క్షేత్రజ్ఞు విడకె యుండె॥ 34

ఆత్మ శుద్ధమె బుద్ధియు నిర్మలకర్త మనఁగఁ బడును
మూల కారణముంట నముక్తమె యగు
జలము మట్టి లేకుండ బీజంబు మొలవ
దప్పియున్న మొలచునట్టె యాత్మకూడ॥ 35

తృష్ణయజ్ఞాన కర్మల్ త్యజించి యుండె
ముక్తియని కల్పితంబయ్యె మొదల నాత్మ
పూర్తిగా వాని నుండియు ముక్తిగనుట
శక్యమగు నంచు తలపఁగఁ జాలనేను॥ 36

మూటి వీని వీడ విశేషమును లభించు
ఆత్మయెట సూక్ష్మమై యుండు నటనె యప్పొ
దొసఁగునలుసౌట. చిత్తంబు దొరలుచుంట
ఆయు సతియౌట ముక్తిగా నంద్రుదాని॥ 37

ఆ యహంకారము విడుటె యంద్రు ముక్తి
ఆత్మయుండ నహంకృతి త్యాగమేది
అయితె సంఖ్యాది విడనిది యగుణి కాదు
అగుణి కానప్పు దీనికెట్లగును ముక్తి 38

గుణియు గుణములు వేర్వేర దనరలేవు
రూపమును వీడిలేక యెట్లుండు నగ్ని
దేహమునకును పూర్వంబు దేహిలేఁడు
గుణములకు మున్ను నట్టులే గుణియులేడు॥ 39

కనుక మొదటనె ముక్తమై దనరికూడ
దేహియగు నాత్మ మరల బంధింపఁ బడును
మేనిలేని క్షేత్రజ్ఞుఁ డజ్ఞానిగానొ
జ్ఞానిగానొ యుండు నపుడెట్లు కలదు ముక్తి॥ 40

మేనులేని క్షేత్రజ్ఞుఁ డజ్ఞాని గానో
జ్ఞానిగానో యౌనపు డెట్లు కలదు ముక్తి
మీర లన్నట్లు లజ్ఞుఁడై మీర నాత్మ
కార్యమెది; యజ్ఞత యపుడౌ కజ్ఞగోడ॥ 41

ఏలయన నొక్కటొకటె త్యజించు టనఁగ
గుణినె స్మరియించు చుండుట యనఁగఁబడును
కనుక సర్వావిధంపుఁ ద్యాగంబువల్ల
అఖిల విధకృతార్థత యగునని తలంతు॥ 42

ఇట్టుల నరాడమౌని వచించినట్టి
ధర్మమును తెలిసికొని మోదంబు గనక
ఇది-యసంపూర్ణమని లోన నెంచి యప్పు
డచటినుండి వెడలిపోయె నధిప సుతుఁడు॥ 43

ఇంకను గల విశేషంబు లెఱుఁగఁ గోరి
ఉద్రకుని యాశ్రమముచను నొగిని వెళ్ళి
అతఁడు నాత్మ సిద్ధాంతమునందు మిగుల
నమ్మకముగలవాఁడౌట నని గనఁడు॥ 45

చైతన్యాచైతన్యములందుఁగల దోషముల నెఱిఁగి ఆకించన్యము (ఏమియు లేదని భావము)ను దాటిన చైతన్యాచైతన్యాతీత మార్గమును ఉగ్రకుఁడు గ్రహించెను. చైతన్యాచైతన్యములుకూడా ఆధారము కనుక దానినిదాటి చైతన్యాచైతన్యములు యవస్థయన్నది యుండదు అందుచే ఆతఁడా అవస్థను పొందఁ గోరుచున్నాఁడు. ఏలయన బుద్ధిసూక్ష్మమై కర్మరహితమై అచటనే యుండును. మఱియెచ్చట నుండదు కనుక చైతన్యము లేదు అచైతన్యమును లేదు ఎందుకనగా దానిని పొంది మనుష్యులకు మరల సంసారములో పడుదురు కనుక పరమ పదమును పొందఁగోరి సిద్ధార్థుఁడు ఉద్రకుని మార్గము విడిచిపెట్టి యా యాశ్రమమును విడిచి నైరంజరా నదీతీరమందున్న గయ రాజర్షి యాశ్రమమును చేరెను అంతకు ముందె తమ పంచేంద్రియములు వశపఱచుకొనగోరి వచ్చిన తపస్వులను

ప్రవతులనైన యయిదుగురు భిక్షుకులను అతఁడు చూచెను ముముక్షువులయిన ఆ భిక్షువులును ఆ సిద్ధార్థునిఁజూచి యింద్రియ విషయములు పుణ్యావంతుని వలె నాతని చుట్టును చేరిరి. వారు అట్లువచ్చి పంచేంద్రియములు చిత్తమును జలె లోబరగు శిష్యులలోఁగూడ వచ్చి యతనిని పూజించిరి. అనంతరము

జన్మ మృత్యువులను వినాశనంబు చేయ
అనశనముద్వార తపముల యాచరణమె
తగు నుపాయమంచు నతఁడు తలఁచి పిదప
దుష్కరతపంబులను జేయఁ దొడఁగె నంత॥ 45

రకరకములైన యుపవాస వ్రతము లెన్నొ
యాచరించుచు నారేండ్లు-నతఁడు కాంతి
పొందఁ గడవి చిక్కను భోజనముల
స్వల్పమె తినె నపార సంసారముడుప॥ 46

## సిద్ధార్థుని తీవ్రతపస్సు

తపసులఁ దనువెంతగ చిక్కెఁ దత్క్షణమున
తేజమంతగ వర్ధిల్లెఁ దీవ్రము గను
చిక్కినను తగ్గలేదేమి శ్రీయుఁ గీర్తి
శరదృతునఁ గుముదములట్లు చంద్రు ద్యుతిని॥ 47

పూర్తిగా మాంసమును మజ్జపోయి చిక్కి
చర్మ మెముకలు మాత్రమె సరిగ మిగిలె
క్షీణుఁడయ్యు గాంభీర్యము క్షీణమొంద
దబ్ధివోలె గభీరుఁడై యలరియుండె॥ 48

ఒక పరి సిద్ధార్థుఁడు ఉపవాసములచే గృశించి స్మృతిపోయి పడియుండ నొక్క గొల్లవాఁడు ఆవుపాలు పిదికి నోటఁబోసెఇట్టులయ్యా వతండు

దుష్కర తపస్సులన్ మేను దుర్బలముగ
నయి యనవసరముగ స్రుక్కె. నంత నతఁడు
జన్మమునుండి భీతిల్లి సంసార ముడివి
బుద్ధ పదమొంద నిటులెంచె బుద్ధిలోన॥ 49

సరణి యిది విరక్తికిఁగాని జ్ఞానమునకుఁ
గాని, మోక్షంబునకుఁగాని కాదుదాని
మునుపు నేరేడు చెట్టుక్రిందను లభించు
విధియె యుక్తమటంచును మదికిఁ దోఁచె॥ 50

దుర్బల నరుఁడు దీనిఁ బొందుట యశక్య
మనుచు విశ్రాంత మొదవ దేహంబు మరల
బలము వృద్ధియుఁగాన జేయఁ దలంచునంత
క్షుత్పిపాసలు నలసట క్షోభపెట్టె॥ 51

మనసు నెటులీ ఫలము నొందునని తలంచి
సంతతేంద్రియ తృప్తిచే సౌఖ్యమొదవు
సౌఖ్య మొదవఁగ జిత్తంబు స్వాస్థ్యమొందు
మనసు స్వాస్థ్యముచేత సమాధి గలుగు॥ 52

తగు సమాధిచే పిమ్మట ధ్యానమొదవు
ధ్యానమున ధర్మముల్ ప్రవర్తనము పొందు
ధర్మములచేత దుర్లభమైన శాంత
మజర మమృతమౌ పదవియౌనని తలంచె॥ 53

కనుక సాధనయంతయు ఆహారమూలమని నిశ్చయించి యొక్క నాఁడు స్నానముచేసి నిరంజనా నదీతీరమునుండి పైకివచ్చి భక్తిచేతం బోలె వంగియున్న చెట్లకొమ్మలను పట్టుకొని వెడలెను. ఒక నాఁడతఁడు అయిదు స్వప్నములం గాంచెను. ఇంక నేను త్వంలో నుత్తమజ్ఞానము పొందెదనని తలఁచియుండె ఆహారము గొనఁ దలచిన యితనిని జూచి ఆదివఱలో నితనివల్ల జ్ఞానమును పొంద దలచి శిష్యులుగఁ జేరిన మహా

కౌండిన్యాది భిక్షువులు ఇతడు తపోభ్రష్టుఁడయ్యెనని తలంచి యతనిని ముక్తాత్ముఁడగు జ్ఞానిని పంచధాతువులు వలె విడిచిపోయిరి.

అంత నొకనాఁడు గోపాధిపాత్మజాత
* నందబల దేవతలచేత నడపఁబడుచు
అతిగ నానంద మొప్పఁగ యలరుచుండి
యచట ధ్యానియౌ సిద్ధార్థు నరసివచ్చె॥ 54

తెల్ల శంఖాల చేతులు దీప్తులీన
నీల వసనాలు మేనున లీలఁ దాల్చి
నురుగు పుంజంపు మాలలు వఱలుచున్న
యమున పోలిక జాల్వారె నా లతాంగి॥ 55

నాతి శ్రద్ధతో పాటుగా ప్రీతిపెరుగ
కనుల నీలి కల్వలును వికాసమొంద
శిరసు వంచి భక్తి మెఱయగ ధరను వ్రాలి
పాయసంపు నైవేద్య మర్పణముచేసె॥ 56

ఆ పరమాన్నమున్ దిని యనంతర మాసతి జన్మ సార్థకం
బై పొలుపారఁ జేసి తన యంతట నింద్రియ తృప్తి నొంది యి
చ్ఛా పరిపూర్తి పొంద నట సాలవనంబును జొచ్చె నా వనం
బో పలు సొంపులన్ ప్రణవ మొల్కుచుండెను మర్మరధ్వనిన్॥ 57

## సిద్ధార్థుఁడు జ్ఞానమొందుట

అందు చివుళ్ళు ఎడుపువలె లేయెండపొడలు ఆ వనముపైని చిందులాడును ఆట వ్రాలిన కోయిలలు దిక్కులు ప్రతిధ్వనులీన రాగాలు తీయు

---

* ఈమె పేరు సుజాత అని బౌద్ధ గ్రంథములలో నున్నది. ఈమె తనకు సంతానము కలిగినచో దేవతల నర్చింతు ననుకొనెను సంతానము కలిగెను యష్టి మధువనములలో గోవులమేపి ఆపాలు గోవులకుపోసి క్రమముగా నిట్టి అరు ఆవులపాలతో క్షీరాన్నమువండి దేవతలకు నైవేద్యముపెట్టెను

చుండెను. మంద పవనములూపఁ దీవెల యుయ్యాలలందు గండుతుమ్మెద లూగుచుండెను లేత మావిచివుళ్ళ నాస్వాదించి యలరు కోయిల లుప్పొంగుచుండెను. మందార పువు మొగ్గలనుండి సొనలువాఱు మకరందముల సువాసనలు వెదజల్లుచుండెను మందపవనములువీచి మనస్సునకుల్లాసము గలిగించుచుండెను నిండుగా విచ్చిన పూగుత్తులచే నాకాశమార్గము పింగళవర్ణమై యుండెను పరిభ్రమించు భ్రమరముల ఝుంకార హుంకారములకు పాంథులు ఉలికి పడుదురు. పక్షుల పక్షములు ప్రక్షేపించు పుప్పొడులచే మార్గము దుమ్మయి యుండెను తియ్యమామిడి పూల మకరందముల బురదలతో దారి నిండియుండెను. పూర్తిగావిచ్చిన పూదీవియలతో మంద సమీరులు సయ్యాటలాడుచుండిరి వసంతకాలమను సామంత సామ్రాజ్య మందలి మణిమండలములట్లు అది యొప్పారుచు తాల హింతాలములతో నిండియు సాలవనమెంతయు కనుల కందమును మదికి విందుగూర్చుచుండెను అందుఁ గూర్చుండి సిద్ధార్థుఁడు మధ్యాహ్నపుఁ దీవ్రమైన యెండతాపమును బోగొట్టుకొని మనస్సు నిర్మలముకాఁగా అపుడు సంజవేళ నిర్మల శుద్ధ బుద్ధ (బోధి) జ్ఞానమును పొంద సమర్థమైన బోధి (రావిచెట్టు) వృక్షము క్రిందకుఁ జని అక్కడ స్థిరము సుఖమునైన యాసనమునఁ గూర్చుండి ధ్యానియై నేడు ఎట్లయినను జ్ఞానమును పొంది తీఱవలెననెడి నిశ్చయ దీక్షతో నుండెను అతని నిశ్చల మనస్సులో పూర్వాపర జీవి ము అద్దములో వలె ప్రతిబింబింపసాగెను. అంత అతని నిశ్చల నిర్మల చిత్తమున జ్ఞానము వికసించి ఫలోన్ముఖము కాఁదొడగెను ఇంతలో అతని మనస్సునఁ గామములను మధించు మన్మథుని విజృంభణములు విజృంభిచెను. లోకములో మన్మథుని విజృంభణములకు లొంగని వాఁడెవఁడు. కాని యీ సిద్ధార్థుని చిత్తము నవి స్వాయత్తము చేసుకొనఁజాలక పోయెను సిద్ధార్థుడు జ్ఞాన సిద్ధుఁడై తన సిద్ధార్థత్వమును నిలబెట్టుకొనెను. ఎప్పుడైతే

మన్మథునిశక్తి సామర్థ్యములు సిద్ధార్థునియందు పటాపంచ లయ్యెనో అప్పుడే అతనిలో పూర్ణప్రజ్ఞ యుదయించెను.*

ఇది

పదునేడవ యాఖ్యానము

---

* ఇక్కడ బుద్ధఘోషుని ఆశ్చర్య చూడామణిలో అశ్వఘోషుని బుద్ధచరిత్రలోను కాముని చతురంగబలమును ఆతని వికారాదులు గల సైన్యమును వారి యుద్ధములు వివరముగా వర్ణింపఁబడినవి అపుడు నిశ్చలుఁడై శాంతుడై అందు సిద్ధార్థుఁడు ఆమారబలమును నిర్జించి మారునికి హితబోధ చేసి మారునిసంపి వేఁడునట్లును అపుడు విఫలుఁడై మారుడుపోగా పుష్పవర్షము కురిసినట్లును పిదప ముక్తి జ్ఞానము పొందినట్లు వర్ణింపఁబడి నది. దీనితో బుద్ధఘోషుని ఆశ్చర్య చూడామణి ముగిసినది. ఇదే మార విజయమని వారు వర్ణించిరి. బుద్ధచరిత్రలో 14 సర్గ 31 శ్లోకమునుండి సంస్కృత శ్లోకములు లభింపలేదు.

14 సర్గ 31శ్లోకమునుండి 28 సర్గములవఱకు సంస్కృత శ్లోకములకు చీనాభాష, టిబెట్టుభాషలలోని యనువాదములు మాత్రము దొరికినవి మూలశ్లోకములు దొరకలేదు ఆ యనువాదములనుబట్టి హిందీలో అనువాదము చేయబడినది, దానినిబట్టి అశ్వఘోషుఁడు 28 సర్గలవఱకు వ్రాసినట్లు తెలియుచున్నది.

# బుద్ధ భగవానుని చరిత్ర

## పదునెనిమిదవ యాశ్వాసము

### పూర్వజన్మ పరంపరా స్మరణ

మొదటి జామున ధ్యానవిధుల నెల్ల
నమలమైశ్వర్యమొంది సిద్ధార్థుఁడపుడు
"నే నితండ నేతెంచితి నిచటనుండి"
యనుచుఁ బూర్వజన్మ పరంపరను స్మరించె॥ 1

"గతపు జన్మలన్ మృతి జన్మ గనుచుఁ గుందు
జీవులెడ జాలిగని దయా చిత్తుఁడగుచు
అకట! విధిలేకయే జీవులొకెడనుండి
యింకొకెడకుఁ జక్రమటు భ్రమించుచుంద్రు"॥ 2

అని తలంపు రెండవజాము నందతనికి
అఖిల సంసార మిథ్యాది యరఁటిదూట
యటుల నిస్సార మను నిశ్చయంబు గలుగ
సరిగ నవలి జామున దివ్య చక్షువొదవెఁ॥ 3

అంత దివ్యదృష్టిని నద్దమందుబోలె
మంచి చెడు కర్మఁ జేసి జీవించువారి
పుణ్యగతి పాపగతి స్పష్టముగను జూచె
యాతనల పాపి శుచి స్వర్గమందుటరసె॥ 4

"వీరి సుఖముకొఱకె పాపకర్మలు చేసిరిగదా వీరికాపాపము నుంత యెపుడు సుఖమిచ్చునో, నవ్వుచుఁ గలుషాత్ములైన వీరు చేసిన కలుషము కాలము పడఁగా దానిని వడ్డి మొత్తుకొనుచు ననుభవించు చున్నారు. అపవిత్రహీదమైన గర్భనరకమునఁబడి దుఃఖవేదన ననుభవించుచున్నారు. జన్మకాలమున దారుణ వేదనలఁబొంది యాదుఃఖముల భరింపలేక యేడ్చు చుందురు. జన్మించినవిదప స్వజనులు ప్రేమించి పాలన పోషణచేయు చుందురు ఇట్టిఅవస్థలో తృష్ణచే నాక్రమింపఁబడి మూర్ఖులు ఇదిచేయవలెను అదిచేయవలెనని అత్యధిక చింతపొంది నిరంతర చింతాప్రవాహములోఁ గొట్టుకొనిపోవుదురు.

ఇంక పుణ్యసంచయము చేసినవారు స్వర్గమున జన్మించి కామ జ్వాలల మంటలలోఁ బడినట్లు మండిపోవుదురు, మఱియు విషయములందు తృప్తిపొందక అక్కడనుండియె పడిపోదురు వారికన్నుపైకిపోఁగా నిస్తేజులైపోదురు ఇపుడప్సరల ప్రేమవలలోఁజిక్కి క్రమముగాఁ గిందకుఁబడి హాచైత్రరథవనమా! ఓదివ్యసరోవరమా! ఓ మందాకినీ! ఓ ప్రేయసీ! అని విలపించుచు భూమిపైఁబడెదరు, దీనినిబట్టి ఆ స్వర్గ సుఖములు క్షణికములని తెలియుచున్నది ఇది ఇట్టిదే దీని స్వభావము ఇట్టిదే అని తెలిసియు లోకులు దీనిని ఇట్లు సరిగాచూడరు, ఇట్లు సంసారచక్ర ములో పడినవారికి శాంతిలేదు" ఈ విధముగా సిద్ధార్థుఁడు జీవలోకము లైదింటినిజూచి ఇందు సారమేమియు లేదనితెలిసికొనెను ఇట్లు ఆలోచించు చుండ మూఁడవజాము సమీపింపగా ఉత్తమధ్యానియయిన సిద్ధార్థుఁడు జగత్తుయొక్క నిజమైన స్వభావమునుగూర్చి ధ్యానించెను.

రక్తమాంసాలు పూసిన యస్థిపట్టన మియ్యది
వైరమాన జరామృత్యు, లిందుఁగాపురముండును
(నాధమ్మ-జరా. 150) 6

అని తలఁచుచు మరియు

ఈ దేహ గృహనిర్మాతన్! చాలజన్మలనుండియున్
గాంచక పర్వులెత్తితిన్! జన్మమెత్తుటె దుఃఖము॥ 7

నేఁడె యోగృహనిర్మాత! చూడఁబడితి
వీగృహంబును మరల నిర్మింపలేవు 8

చేతిపనిముట్లుచెడె గృహశిఖంబు మొఱగె
మనసు సంస్కారముల్ పోయెనణఁగెతృష్ణ॥

(సాధమ్మ-జరా. 155)

అని తలచుచు తనదివ్యదృష్టితో ప్రవృత్తి కర్మవల్లను గలుగును గాని స్రష్టవల్లఁగాని ప్రకృతివల్లఁగాని ఆత్మవల్లఁగాని అకారణముగాఁ గలుగదు శిరస్సు ఉన్నచో తలనొప్పివచ్చును శిరస్సేలేనిచో ఇంక దేనికి నొప్పికలుగును జీవనములోని వివిధములైన కామములు ఆత్మ వాదము అసమ్యక్దృష్టి వీనివల్ల కర్మ (ఉపాదానము) కలుగును కట్టె లున్నచో నిప్పుపుట్టును, ఉపాదానమునకు తృష్ణకారణము వేదనల ప్రవాహమునకు స్పర్శ (విషయసంబంధము) కారణము, రెండు అరణుల వల్ల నిప్పుపుట్టునట్లె వస్తువులతో ఇంద్రియమనస్సంయోగమువల్ల వేదన కలుగును, గుడ్డివాడు వస్తువులను జూడలేఁడు వానిమనస్సునకు కంటితో సంబంధముపోయినది దృష్టి ఉన్నచో వస్తుసంబంధముండును కాన ఆఱు అయతనములున్నమీదట స్పర్శకలుగును దీనికి నామరూపములు వీనికి సంజ్ఞ చేతన కారణములు. విజ్ఞాన బీజమున్నచో మొక్క మొల చును. నామరూపముల విజ్ఞానములేనిచో మొక్క మొలవదు. నామరూప లనుబట్టి విజ్ఞానము బయలుదేఱుచున్నది నీళ్లుఉన్నచో పడవనడచును.

విజ్ఞానమువల్ల నామరూపములు. వీనివల్ల ఆయతనములు, వీనివల్ల స్పర్శ, స్పర్శవల్ల వేదన వేదనవల్ల తృష్ణ, తృష్ణవల్ల ఉపాదానములు, ఉపాదానమువల్ల భవము భవమువల్లజన్మ, జన్మవల్ల జరా మరణ వ్యాధులు కలుగును ప్రత్యయమువల్ల సంసారము కలుగుచున్నది అందువల్ల ఆతడిట్లు నిశ్చయించెను జన్మవినాశముచే జరామరణముల, నిరోధింపఁబడును, భవవినాశమువల్ల జన్మయు, ఉపాదాన వినాశమువల్ల భవము తృష్ణ నిరోధమువల్ల ఉపాదానములు నిరుద్ధమగును. వేదనలేనిచో తృష్ణయే కలుగదు ఆఱు ఆయతములులేనిచో స్పర్శకలుగదు. ఆట్లే

నామరూపములను సమ్యగ్రీతిగా నిరోధించినచో ఆఱు ఆయతనములు నిరోధింపబడును విజ్ఞాననిరోధమువల్ల నామరూపాలు నిరుద్ధమగును సంస్కార నిరోధమువల్ల విజ్ఞానము నిరోధింపబడును. అవిద్యను పూర్తిగా నిరోధించినచో సంస్కారములు నిరోధింపఁబడును. కనుక జ్ఞేయమును సరిగా తెలుసుకొని ఇంక ఇతఁడు ప్రపంచము ముందు బుద్ధుఁడయ్యెను. ఆతడు భవముపైనుండి క్రిందివఱకు ఎక్కడను ఆత్మను జూడలేదు. పరమజ్ఞానములో అష్టాంగిక మార్గముద్వారా మొదటినుండి త్వరగానే ఇష్టస్థానమును గాంచి పొందెను "నేనీ పూర్ణమార్గమును పొందితిని దీనిమీదనె మంచి చెడు విషయములను దెలిసికొను పూర్వమహర్షి వంశములు పరమార్థమునకై వెళ్లిరి" అని తనమనస్సులో అనుకొనెను.

నాలుగవజాములో ఆక్షణమున ఉష వచ్చినది అప్పుడు సర్వ చరాచరములు శాంతమయ్యెను ఆతడు అవినాశిపదముపొంది ముక్తినాయకుఁడై సర్వజ్ఞుఁడయ్యెను. అంత

మత్తకామినివోలె మహియుఁ గంపించెను
దిశలు సిద్ధాళిచే దీప్తిచెందె
దివిదుందుభులు మ్రోగి దిశ హాయిగాఁగాలి
వీచె, మబ్బులులేక వృష్టికురిసె
తఱిగాకయే చెట్లు విరులు వర్షించె మం
దారముల్ స్వర్ణ పద్మాళికురిసె
వైడూర్యకమలాలు స్వచ్ఛకుముదములన్
సిద్ధార్థు పార్శ్వాలు నిండిపోయె॥

కోపికాఁడెవ్వఁడును రుజల్ కుమిలిపోయె
పాపమున నెవ్వఁడును పోఁడు స్వాంతమందు
నెవ్వనికి మదంబున్నదె యెఱుఁగదయ్యె
జగము పూర్ణతగనినట్లు శాంతమయ్యె॥

పిదప ఏడుదినములలో శారీరక కష్టము [illegible] ముక్తుఁడై [illegible] లుఁడై భగవానుఁడై బుద్ధభగవానుఁడని లోకములందు [illegible]

దుఃఖాలనుండి ముక్తిగలిగించి శాంతిచేకూర్చ ప్రజలకు బోధింప వారాణాసి వైపుగా బయలుదేరి బోధించుచు లోకములను జరామరణాదులనుండి ముక్తిగావించి నిర్వాణా * నందమున నోలలాడించెను.

ఇది

బుద్ధఘోషాఖ్య ఘోషులచే రచింపబడి
చర్ల గణపతిశాస్త్రిచే అనువదింపఁబడిన
బుద్ధభగవానుని చరిత్రయందు
పద్దెనిమిదవ యాఖ్యానము

---

*ఇక్కడనుండి నా బుద్ధభగవానుఁడు "జీవితసంఘటనలు" అను పుస్తకములో ధర్మచక్ర ప్రవర్తనము మొదలు నిర్వాణము వఱకుఁగల విషయము వివరించఁబడెను. అవి దానినుండి తెలియునది

ముతో చైతన్యవంతమైన జీవునితోగూడ తాదాత్మ్యమును జెంది "నేను, నేను" అని అంటున్నది. అనగా ఆత్మానాత్మ పదార్థములయొక్క వివేకములేని అంతఃకరణము-(అంతఃకరణము అనగా మనస్సు, బుద్ధి చిత్తము, అహంకారము) ఆత్మయొక్క ప్రతిబింబమును గ్రహించి దానిద్వారా అబ్రహ్మచైతన్యమును పొంది బ్రహ్మమువలె చైతన్యవంతమై సర్వేంద్రియములతో కూడియున్న స్థూలశరీరముతో తాదాత్మ్యమును జెంది "నేను" అని అంటున్నది. ఈ విధముగా ఈ "నేను" శబ్దముద్వారా ప్రకటితమగుచున్నది ఆ ఆత్మయే, అనగా ఆ పరమాత్మయే. ఆ విధముగా ఆ ఆత్మ చైతన్యము అంతఃకరణమునకు వశమైయుండుటజేసి "నేనునేను" అనుచున్న ఆ అంతఃకరణ ధర్మములను తనపై ఆరోపించుకొని "నేను అంధుడను" "నేను పుట్టుచున్నాను నేను మరణించుచున్నాను" మొదలగు విధముగా వ్యవహరించుచుండును. సుషుప్తి కాలమునందు ఆత్మప్రకాశము అంతఃకరణమునందు ప్రతిబింబించ నందున మనస్సు చైతన్యవంతమై విషయములను కల్పించుటలేదు. అందుచే ఆ సుషుప్తియందు "నేను" అను చైతన్యమునకు స్థూలశరీరముతో సంబంధములేకపోవుటచే ఆ నేనుకు అంతకు పూర్వము జాగ్రదవస్థలో కలిగిన "నేను అంధుడను" అను మొదలగు అనుభవము వుండుటలేదు. అట్లే స్వప్నకాలమునందుగూడ అంతఃకరణమునందు ఆత్మచైతన్యము ప్రతిబింబించినను, ఆయవస్థయందు బాహ్యేంద్రియములు మరియు స్థూలశరీరమునందుగూడ ఆ అంతఃకరణము అనగా "నేను" వుండుటలేదు. అందుచేవాటి జ్ఞానము అనగా ఆ బాహ్యేంద్రియముల మరియు స్థూల శరీరము యొక్క జ్ఞానము అప్పుడు "నేను" కు వుండుటలేదు. అందువలన అంధత్వాది వ్యవహారము ఈ స్వప్నావస్థయందు గూడ ఆ "నేను"కు వుండుటలేదు. అందుచే తేలిన సారాంశమేమన ఆత్మయొక్క బాహ్య వ్యాపారమంతయు అంతఃకరణముపై ఆధారపడి కలుగుచున్నదియే. అందువలన అంతఃకరణమే అహంకారమనియు, అదియే సర్వమునకు కర్తయనియు బోధపడుచున్నది. కర్తయగుట వలన ఆ అంతఃకరణమే తాను చేయు కర్మలయొక్క ఫలములకు భోక్తయగుచున్నది. ఆ విధముగా కర్తృత్వ భోక్తృత్వాది అభిమానముకలదియై ఎడతెగని సుఖదుఃఖములను అనుభవించు చున్నది. ఈ విధముగా నేత్రములు మొదలగు ఇంద్రియముల యందును ఆ ఇంద్రియములతో కూడియున్న శరీరమునందును తాదాత్మ్యమును బొంది అభిమానముతో ప్రవర్తించుచున్న చిత్ ప్రతిబింబ విశిష్టమైన అంతఃకరణమే అనగా అహంకారమే "నేను" అను పదమునకు అర్థమగుచున్నది. ఇదియే అనగా ఈ

స్థూలదేహాభిమానము కలిగియున్న అంతఃకరణమే కర్తృత్వ భోక్తృత్వాభిమానము కలదిగా అగుచున్నది.

ఈ అంతఃకరణము సత్వరజస్తమో గుణరూపమగు ప్రకృతి యొక్క కార్యము అగుటచే ఆ గుణ సంబంధముచే జాగ్రద్ స్వప్న సుషుప్తి రూపములగు మూడు అవస్థలను పొందుచున్నది. రజోగుణ సంబంధముచే జాగ్రదవస్థను, సత్వ గుణసంబంధముచే స్వప్నావస్థను, తమోగుణ సంబంధముచే సుషుప్తి అవస్థను పొందుచున్నది. అవస్థా భేదముచేత ఈ అంతఃకరణమునకు కార్యభేదము గూడ కలుగుచున్నది. స్థూలదేహాభిమానము కారణముగ సుఖ దుఃఖములు గూడ ఈ అంతఃకరణమునకే కలుగుచున్నవి.

అవస్థాభేదమును అనుసరించి విషయములు అనుకూలముగ ఉన్నప్పుడు సుఖ వంతుడనని, ప్రతి కూలముగ వున్నప్పుడు దుఃఖవంతుడననియు, ఈ అంతఃకరణ రూపుడగు అహంకారి తలంచుచున్నాడు. ఈ విధముగా విచారించి చూచిన సుఖ దుఃఖములు రెండును అంతఃకరణ ధర్మములగుటంజేసి "ఆనందో బ్రహ్మ" "విజ్ఞాన మానందం బ్రహ్మ" మొదలగు శ్రుతుల వలన ఆత్మ ఆనంద స్వరూపు డనియు ఈ అంతఃకరణ ధర్మములగు సుఖదుఃఖములు ఆ ఆత్మకు సంబంధించినవి కావనియు స్పష్టమగుచున్నది.

అంతేగాక గుణత్రయ సంబంధముచే జాగ్రద్ స్వప్న సుషుప్త్యాది అంతః కరణ అవస్థలకు ఈ ఆత్మ సాక్షాత్ ద్రష్టయై వుంటున్నాడు. * ఇదే ప్రకారముగ అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, మరియు ఆనందమయ మన ఐదు పంచకోశముల కంటె వేఱుగ నున్నవాడు, ఎల్లప్పుడును ఎట్టి వికారములును లేక భూత భవిష్యత్ వర్తమానములందు ఒకే రూపమున వుండువాడు, అతడే ఆత్మ.

ఆత్మ అవస్థాత్రయసాక్షి, జ్ఞాన స్వరూపుడు. అట్టి జ్ఞాన స్వరూపుడగు ఆత్మ "నేను దానిని చూచుచున్నాను". శబ్దము ద్వారా తెలుసుకొనుచున్నాను. స్మరించుచున్నాను"మొదలగు విధమున జాగ్రద్ స్వప్నావస్థలయందు బుద్ధియొక్కయు, మరియు దానికి సంబంధించిన వృత్తుల యొక్కయు, ఉనికిని తెలుసుకొనుచున్నాడు. ఆ జాగ్రదవస్థయందలి సర్వకార్యములను తెలుసుకొనుచున్న ఆత్మ చైతన్యమును స్థూల శరీరముతో అతనికి గల తాదాత్మ్యాధ్యాసముచేత వైశ్వానరుడు అని పిలువ బడుచున్నాడు. అట్లే స్వప్నావస్థయందు కేవలము మనస్సు మాత్రమే తాదాత్మ్య

---

* చూడుము స్వరూపసాక్షాత్కారము అనువ్యాసము.

మును పొంది అనగా కేవలము మనస్సు యొక్క ఉపాధితోచేరి ఆ మనస్సునందు అనాదిగా దాగియున్న సర్వవిధములైన వాసనలను వెలిగించి సూక్ష్మ విషయములను అనగా సూక్ష్మజగత్తును సృష్టించి దానికి కర్తగా భోక్తగా వుంటూ, అటుపైన గుణ దోషముచేత కలుగుచున్న సుషుప్తియందు కారణ రూపమున తాను ఒక్కడేవుండి, ఆ సుషుప్తి అవస్థయందు బుద్ధి యొక్కయు మరియు దాని వృత్తుల యొక్కయు అభావమును "నేను దీనిని తెలుసుకొనుచున్నాను" "దీనిని తెలుసుకొంటిని" "దీనిని తెలుసుకొనగలను" అను అనుభవము వలన సకలములగు జాగ్రదవస్థలోని పదార్థ ములను, స్వప్నకాలపు సూక్ష్మపదార్థములను, మరియు సుషుప్తి యందుగల అజ్ఞాన మును అనగా ఏమియు తెలియని తనమును, అభావమును, తెలుసుకొనుచున్నాడో అతడే ఆత్మయని గుర్తించ వలయును.

జ్ఞాన స్వరూపుడగు ఆత్మ ఈ విధముగా సర్వమునుతెలుసుకొనువాడగుటచే ఈతనిని తెలుసుకొనునది మరియొకటి ఏదియు లేనందువలన ఈతడు, ఈ ఆత్మ, జ్ఞాన స్వరూపుడుగా తెలియబడుచున్నాడు. "యః పశ్యతి స్వయం సర్వం యః నపశ్యతి కించన, యశ్చేత యతి బుధ్యాధి నతద్ యంచేత యత్యయమ్" అనగా ఏది స్వయముగా తాను మాత్రమే సమస్తమును చూచునో, కాని దేనిని ఏదియు కొంచెము గూడా చూడజాలదో అనగా "నాన్యోఽతోఽస్తి ద్రష్టా" ఈ ఆత్మకంటె భిన్నమై చూచునది, సర్వమును తెలుసుకొనునది మరియొకటి అనగా రెండవది ఏదియు లేదు. ఏది సర్వమును చూచునో, దేనిని మరియొకటి ఏదియు చూడజాలదో "నతత్ర చక్షు ర్గచ్ఛతి, వావాగ్గచ్ఛతి, నోమనః" అనగా అచటికి నేత్రము, వాక్కు మనస్సుగూడా వెళ్ళజాలవో "నచక్షుషా గృహ్యతే, నాపివాచా, న్యాన్యైర్దేవైః" అనగా నేత్రముచేతగాని, హక్కుచేతగాని, ఇతరములగు యే ఇంద్రియముల చేత గాని ఆ యాత్మ గ్రహింపబడదు."నైవ వాచా న మనసాప్రాప్తుం శక్యోన చక్షుషా" అనగా వాక్కుచేగాని, మనస్సుచే గాని, నేత్రములచే గాని ఆయాత్మ పొందుటకు శక్యముకానిది." అని పలుమార్లుగా శ్రుతి చెప్పుచున్నది. ఏ ఆత్మజములైన సమస్త అంతఃకరణ వృత్తులను తనప్రతిబింబముచే చైతన్యముకలవానినిగా చేయుచున్నదో ఆ అంతఃకరణము స్వతః చైతన్యముతో కూడియున్న అనగా స్వభావము చేతనే చైతన్య వంతమైయున్న దేనినికూడా-అనగా ఆత్మను చైతన్యవంతము చేయుజాలదో అనగా జడపదార్థము ఏదైన కార్యమును చేయవలయునన్నచో దానికి చైతన్యము అవసరము. ఏలయన-ఆ చైతన్యము లేకుండ జడపదార్థము యే కార్యమును చేయ

జాలదు. కాని స్వభావముచే చైతన్యమే స్వరూపముగాగల పదార్థమునకు ఎటువంటి కార్యములు చేయవలయునన్నను పరాపేక్షఅనగాపరులనుండి చైతన్యమునుగ్రహించ వలసిన అవుసరము వుండదు. ఆత్మజ్ఞానస్వరూపుడు, అనగా చైతన్య స్వరూపుడు కావున అతడు పరాపేక్ష లేని సిద్ధుడు.

ఆత్మ సర్వప్రకాశకుడు. తాను ప్రకాశరూపుడై సర్వమును బాగుగా ప్రకాశింప జేయుచున్నాడు. అందుచే ఆయన ఇతరులతో ప్రకాశింపబడడు. "యేన విశ్వమిదం వ్యాప్తం యం నవ్యాప్నోతి కించన, అభారూపమిదం సర్వం యంభాన్తమను భాత్య యమ్" ఈ ఆత్మ సర్వోపాదాన కారణముఅగుటచే సర్వమునందును అవ్యక్త రూప మున వ్యాపించియున్నది. సర్వమునందును అంతర్నిహితముగా ఈ ఆత్మ తత్వ ము వ్యాపించి యున్నందువలన మరియే ఇతర పదార్థముగూడా ఈ ఆత్మయందు వ్యాపించజాలదు. సర్వాంతరముగ వ్యాపించియున్నదగుటచే బాహ్యములగు ఈ వస్తు వులు దానియందు వ్యాపించజాలవు. ఈ ఆత్మ సర్వవస్తువులకు ఆధారభూతమయ్యును తాను మాత్రము ఎటువంటి వికారమును పొందుటలేదు. "వికార వర్తిచ తథాహిస్థితి మాహ"అందుచే తాను ఎటువంటి వికారమును పొందకయే సర్వమును కలిగించుటకు తాను ఉపాదానకారణమగుచున్నది."పాదోస్య విశ్వాభూతాని త్రిపాదస్యా మృతందివి" అనగా భూతములన్నియు ఈ ఆత్మయందు నాల్గవవంతు మాత్రమే అనగా ఈ ఆత్మ విశ్వాకారమై వున్నది అనిశ్రుతులు, స్మృతులు చెప్పుచున్నవి. "జ్యాయాన పృధివ్యాః జ్యాయా నన్తరిక్షాత్ జ్యాయానేభ్యో లోకేభ్యః" అనగా ఈఆత్మ ఈ భూమి కంటెను, ఆకాశము కంటెను అన్ని లోకములకంటెను పెద్దది అని శ్రుతులు చెప్పుచున్నవి. ఈ ఆత్మ స్వయం ప్రకాశరూపుడు అగుటచే జడమగు సమస్తములను తానే ప్రకాశింప జేయుచున్నాడు. ఈ విధముగా సర్వమును ప్రకాశింపజేయు ఆ ప్రకాశరూపుడే ఆత్మ. అనగా పరమాత్మ.

ఈ ఆత్మ సర్వోపాదానకారకుడు అగుటచే సత్వమును చైతన్యవంతము జేయు ప్రేరకుడు అనగా సర్వమునుచైతన్యవంతముజేయు చైతన్యమూర్తిఈతడు. "యస్యసన్నిధి మాత్రేణ దేహేంద్రియ మనోధియః విషయేషు స్వకీయేషు వర్తంతే ప్రేరితా ఇవ" అనగా దీనియొక్క సాన్నిధ్య మాత్రముచేతనే దేహము ఇంద్రియ ములు మనస్సు బుద్ధి మొదలగునవన్నియు ప్రేరింపబడినవానివలె చైతన్యవంతములై తమకు సంబంధించిన విషయములందు ప్రవర్తించుచున్నవో అట్టి చైతన్య మూర్తియే ఈఆత్మ. "కేనేషితం పతిత ప్రేషితం మనః కేనప్రాణం ప్రథమః ప్రైతి

యుక్తః కేనేషితం వాచమిమాంవదన్తి, చక్షుః శ్రోత్రం క ఉదేవో యునక్తి "అనగా మనస్సు ఎవనిచే ప్రేరేపింపబడినదై సర్వమును కల్పించుచున్నదో, ప్రాణము ఎవ్వనిచే ప్రేరేపింపబడి సర్వమును పోషించుచున్నదో, ఎవ్వనిచే ప్రేరేపింపబడి ఈ వాక్కు సర్వమును వర్ణించుచున్నదో ఏ మహాశక్తిచే నేత్రములు, శ్రోత్రములు, సర్వమును చూచుచు వినుచున్నవో, ఆ పరమార్థమే, ఆ సర్వోపాదాన రూపుడే ఆత్మ. ఆ ఆత్మయొక్క సన్నిధి మాత్రముచేతనే అనగా అభిమానరూప సంబంధముచేతనే దేహము సర్వకార్యములు చేయగలుగుచున్నదో, ఆఆత్మ బలంతోడనే వాక్, పాణి, పాయు మొదలగు కర్మేంద్రియములు తమ తమ కార్యములను నిరాటంకముగా నిర్వహించకలుగుచున్నవి. ఆ యాత్మసాన్నిధ్యముచేతనే చెవి, చర్మము, నేత్రములు, నాలుక నాశిక మొదలగు జ్ఞానేంద్రియములన్నియుచైతన్యవంతములై వినుట, స్పృశించుట చూచుట, రుచిచూచుట, వాసన చూచుట మొదలగు సర్వకార్యములను నిర్వహించుచున్నవి. అంతేగాక అంతః కరణరూపములగు బుద్ధి, అహంకారము మొదలగునవన్నియు ప్రేరేపింపబడిన వానివలె తమకు సంబంధించిన విషయములందు ప్రవర్తించుచున్నవో అనగా జడపదార్థములకు స్వతః వ్యాపారముండదుకదా! అట్లు ప్రవర్తింపజేయువాడే ఆత్మ, అతడే పరమాత్మ.

ఈఆత్మ జ్ఞానరూపుడు. అందుచేతనే అహంకారము మొదలుదేహమువరకును గల పంచకోశములును, అనగా ఆనందమయ, విజ్ఞానమయ, మనోమయప్రాణమయ అన్నమయ కోశములును, శబ్దాది విషయములును, వాటివలన కలుగు సుఖాదులును, స్వతః సిద్ధమగు జ్ఞానమే స్వరూపముగా గల ఏ తత్వముచే తెలియబడుచున్నవో, అనగా వాటినన్నింటిని దృశ్యములుగా చూచుచున్నాడో అతడే ఆత్మ. ఈ ఆత్మకు పంచకోశములతోగాని, వాని ధర్మములతోగాని, ఎటువంటి సంబంధము కలుగనేరదు. ఏలయన అతడు కూటస్థుడు. సర్వమునుతెలుసుకొను జ్ఞానస్వరూపుడు.

ఈ పరమాత్మ సర్వాంతర్యామి. అనగా అందరి ఆత్మలయందును నిండియుండువాడు. అఖండమైన ఆనందస్వరూపుడు. ఈ సర్వాంతర్యామియగు చైతన్యస్వరూపుని యొక్క సాన్నిధ్యము మాత్రముచేతనే తాము జడములయ్యు, చైతన్యవంతములై వాక్కును, ప్రాణములును శబ్దోచ్చారణము, ఉచ్ఛ్వాస నిశ్వాసములును మొదలగు తమతమ కార్యములను చేయగలుగుచున్నవి. ఈ అంతరాత్మయందే అన్నమయాది పంచకోశములును రజ్జువునందు సర్పము, దండము జలాధారాదులవలె కల్పింపబడి భాసించుచున్నవి. అందుచే ఈతడు పూర్ణుడు అనగా పురమునందు నివ

సించువాడు అనగా పంచకోశములకును అంతరముగా నిండియుండి పంచకోశములను చైతన్యవంతము గావించుచున్నాడు. ఆతడే, ఆ ఆనందస్వరూపుడే బ్రహ్మ.

"యద్సాక్షదపరోక్షాద్ బ్రహ్మ" ఏది సాక్షాత్తుగా అపరోక్షమైనదో, అది ఆ స్వస్వరూపమే; ఆత్మ. ఈ ఆత్మ స్వరూపము ఎప్పుడును, ఎటువంటి వికారమును చెందునది కాదు. ఏలయన ఈతడు జ్ఞానస్వరూపుడు, నిరాకారుడు, నిర్గుణుడు, నిర్వికారుడు. అంతేగాక కాష్టాదులయందు అంతర్వాహినిగా నిండియుండు అగ్నివలె సకలబుద్ధి వృత్తులయందును అనుగత రూపమున అనగా ప్రతి బోధరూపమున తెలియబడు జ్ఞానరూపుడు. అనగా ప్రతి జ్ఞానమునందును తద్రూపముగా తెలియబడువాడు. ఈ సందర్భమున ఓ కవిగారి నిర్గుణబ్రహ్మకు సంబంధించిన కల్పనా చిత్రము చూడనగును—

"విద్యుచ్ఛక్తి సమస్త తంతువుల వ్యాప్తింజెందియున్నన్
విద్యుజ్జ్యోతికి గాజుగోళములనే విస్ఫూర్తి గన్పించెడిన్
విద్యారూప! స్వసత్తచేత సర్వంబునన్ నిండియున్
విద్యోతింతువు శుద్ధబుద్ధిగుహలన్ విశ్వాత్మ భీమేశ్వరా!

"భీమేశ్వర శతకమునుండి"

ఈ పరమాత్మ సర్వప్రకాశకుడు. అందుచే అధిక ప్రకాశముగల ఈ పరమాత్మ సర్వశరీరముల యందును సత్వగుణ ప్రధానమగు బుద్ధియనెడు గుహయందు ప్రతిబింబించి, తన స్వాభావికమగు తేజస్సుచే అనగా ప్రకాశముచే సర్వ ప్రపంచమును సూర్యుడు ప్రకాశింపజేయుచున్నట్లుగా ప్రకాశింపజేయుచున్నాడు. బుద్ధియే విజ్ఞానమయకోశముగా చెప్పబడుచున్నది. "శబ్దాది విషయ పంచక సమన్విత బుద్ధి విజ్ఞానమయమన వెలయుచుండు" (శ్రీ సీతారామాంజనేయ సంవాదము నుండి) ఈ కోశము ఆ సర్వప్రకాశకుడగు పరమాత్మనుండి చైతన్యప్రకాశమును పొంది, తాను చైతన్యవంతమై శరీరమంతటిని ఆ చైతన్యముతో చైతన్యవంతము చేయుచు ఆత్మను కప్పివేయుచున్నది. అందుచే ఈ బుద్ధి ఇచ్చట "ధీగుహాయాం" అని అనగా "బుద్ధియనెడు గుహా" అని చెప్పబడినది. ఆ బుద్ధియనెడు గుహయందు ఉపాదాన కారణమగుటచే అనుస్యూతముగానున్న ఏ అవ్యాకృతాకాశము కలదో దానియందు అనగా అజ్ఞానమునందు అనగా మాయయందు అధిక ప్రకాశరూపుడై ప్రకాశించుచున్నాడు. జ్ఞానరూపమై, సర్వమును ప్రకాశింపజేయునదగుటచే ఆ పరమాత్మ సూర్యాది సకల జ్యోతిస్సులను ప్రకాశింపజేయుచున్నాడు.

జ్ఞానరూపుడగుటచే అనగా జ్యోతిస్వరూపుడు అగుటచే తన తేజస్సుచే సూర్యాదులనుగూడ వెలిగించుచున్నాడు. "యేనసూర్య స్తపతి తేజసేద్ధః" అని శ్రుతి వాక్యము. ఆ విధముగా దృశ్యమగు సకల ప్రపంచమును ప్రకాశింపజేయుచున్నాడు. అనగా సూర్యునికంటె మిక్కిలి సర్వోత్కర్షముతో "ఆకాశ ఉచ్చైరవివత్ప్రకాశతే" ప్రకాశించుచున్నాడని తాత్పర్యము. ఈ విధముగా ఆ పరమాత్మ స్థూల, సూక్ష్మ, కారణ శరీరములకుగూడ అంతరాత్మయని చెప్పబడుచున్నాడు. ఏ విధముగా సకల దిక్కులయందును వున్న సమస్త వస్తువులను ఎట్లు ప్రకాశింపజేయుచున్నాడో అట్లే సర్వాంతర్యామియగు ఈ తేజస్వరూపుడు సకలమును ప్రకాశింపజేయుచున్నాడు.

ఈ పరమాత్మ సర్వమును తెలుసుకొనువాడు. అనగా సర్వజ్ఞుడు. అనగా సర్వమునకు సాక్షి. "జ్ఞాతా మనోహంకృతి విక్రియాణాం, దేహేంద్రియ ప్రాణ కృత క్రియాణామ్, అయోఽగ్ని వత్తానువ ర్తమానో నచేష్టతే నవికరోతికించన"

అనగా మనస్సు, అహంకారము మొదలగు వాని వికారములకును, దేహము; ఇంద్రియములచే చేయబడు సర్వవిధ క్రియలకును, జ్ఞాత, అనగా తెలుసుకొనువాడుగా వున్న ఈ ఆత్మ; ఇనుమునందు వ్యాపించియున్న అగ్నివలె, వాటినంతటిని వ్యాపించి వుండికూడ తాను మాత్రము ఏమియుచేయక, దేనికిని ఎటువంటి వికారము కలుగజేయక, తానుగూడా ఎటువంటి వికారమును చెందక కూటస్థుడై యున్నాడు. అంతఃకరణమునకు సంబంధించిన మనస్సునకు; కామము సంకల్పము మొదలగు అనేక వికారములు కలుగుచున్నందున అనగా గర్వము, దర్పము మొదలగు అనేక వికారములు అహంకారమునందు కలుగు చుండగా, వాటినన్నింటిని తాను సాక్షి వలె వుండి తెలుసుకొను వాడు ఆత్మ. అట్లే దేహమునకు మరియు ఇంద్రియములకు సంబంధించిన వికారములను అనగా నోరు మాటలాడుట, నేత్రములు చూచుట శ్రవణములు వినుట, ప్రాణము నాశిక ద్వారా ఉచ్ఛ్వాస నిశ్వాసములు జరుపుచుండుట మొదలగు సర్వ బాహ్య వ్యవహారములను సాక్షి వలె వుండి ఎవ్వడు తెలుసుకొనుచున్నాడో అతడే ఆత్మ. ఈ విధముగాసకలమైన అంతరబాహ్య వికారములకు సాక్షిమైన ఈ ఆత్మ తానుమాత్రము ఎటువంటి వికారములను చెందకుండ నిర్వికారుడై వుంటున్నాడు. ఈ క్రింది దృష్టాంతము ద్వారా ఈ విషయమును బాగుగా తెలుసుకొనవచ్చును. అదెట్లన—గుండ్రముగాగాని, పొడవుగాగాని వున్న ఇనుప ముక్కను ఆశ్రయించివున్న అగ్ని ఏవిధముగా గుండ్రముగాను, పొడవుగానుఉన్నట్లుగాతోచునో

కాని అగ్నిమాత్రము యథార్థముగ గుండ్రముగాను పొడవుగానువుండుట లేదో అట్లే మనస్సును, అహంకారమును, స్థూలదేహమును, ప్రాణములును, వీటిఅన్నింటి యందును పూల దండలో దారమువలె, ఇనుమునందు వ్యాపించియున్న అగ్నివలె: అను స్యూతముగా అనగా అంతరముగా నిండియున్ననూ, సర్వప్రకాశకుడు, నిర్మలుడు, నిర్వికారుడు అగు ఆత్మ అంతటను ప్రతిబింబించుచున్నను; అంతటను ఏక విధముగా ప్రకాశించుచున్నను, మనస్సు, అహంకారము, ప్రాణము మొదలగునవి చేయు వ్యాపారములయందు తదాకారము జెందియున్నదిగా భ్రాంతిచే తోచుచున్నను, వాస్తవముగాతానుమాత్రము ఎటువంటి వికారముచెందుటలేదు. సూర్యునిప్రకాశమాత్రముచే ప్రపంచమంతయు చైతన్యవంతమై ఎట్లు తనవ్యాపారమున చరించుచున్నదో, సర్వ జడ పదార్థములును చైతన్యవంతములై ప్రవర్తించునట్లుగాతోచుచున్నవో అట్లే ఈ సర్వ ప్రకాశకుడగు ఆత్మప్రకాశముచే మనోహంకార దేహేంద్రియప్రాణాదులు జడములే అయినను చైతన్యవంతములై తమ తమ వ్యాపారములందు ప్రవర్తించుచున్నవి, కాని ఈ ఆత్మ మాత్రము ఆ సూర్యునివలె ఎటువంటి వికారములను పొందక అంతటను నిర్వికారముగ ప్రకాశించుచున్నాడు. తానుమాత్రము ఎటువంటివ్యాపారములు చేయక సాక్షివలె కూటస్థుడైయున్నాడు అతడే ఆత్మ, అతడే పరమాత్మ.

ఈ పరమాత్మ నిత్యుడు, నిర్వికారుడు, అజన్మ, అమరుడు, అవినాశి.

"నజాయతే, నోమ్రియతే, నవర్ధతే, నక్షియతే, నోవికరోతి సత్యః
విలీయ మానేపి, వపుష్యముష్మిన్ న లీయతే కుంభ ఇవాంబరం స్వయమ్"

అనగా పరమాత్మ నిత్యుడు అనగా ఎల్లప్పుడూ వుండువాడు. ఈ రోజు వుండి రేపు లేకుండు వాడు కాడు. సర్వవేళల, సర్వావస్థలయందును అనగా జాగ్రస్వప్నసుషుప్తుల యందును, విద్యమానమై యుండువాడు, జన్మ మరణములు లేనివాడు. నిత్యుడు గనుక ఒక పర్యాయము పుట్టిమరియొక పర్యాయము నశించువాడు అనగా మరణించువాడుకాడు. నిత్యుడైన వాడు ఏట్లు జన్మించును? ఎట్లుమరణించును? నిత్యుడైనవానికి జన్మమరణములు, రాకపోకలు, ఉనికిలేములు, సంభవములు కానేరవు. అట్లే ఆత్మ వృద్ధిక్షీణములు లేని వాడు. నిత్యుడు, నికారుడు, అనగా ఎటువంటి ఆకార ప్రకారములులేక సూక్ష్మరూపుడై సర్వమునందు వ్యాపించియున్న వానికి వృద్ధి క్షీణములు, జన్మమరణములు కుదరవుగదా! అటుపైన ఈ ఆత్మ, అవికారుడు; అనగా తాను ఎటువంటి వికారమును అనగా మార్పును అనగా పరిణామమును పొందువాడు కాడు. ఏలయన ఆయన సూక్ష్ముడు, సర్వవ్యాపి, ప్రకాశరూపుడు, జ్ఞానరూపుడు,

అందుచే ఆయనయందు ఎటువంటి వికారములు సంభవము కానేరవు. అంతేగాక ఆయన వలనకూడా ఎటువంటి వికారముదేనియందును కలుగనేరదు. అదెట్లనగా? ఈ దృశ్యమానమగు ప్రపంచము ఆయనయొక్క అధిష్ఠానమునందే కల్పించబడి నానా విధరూపములు ధరించుతూ, నిత్యము పుట్టుచూ, చచ్చుచూ, అనేక పరిణామములు చెందుచున్న దానివలె తోచుచున్నను యథార్థమున కల్పితవస్తువునకు ఎటువంటి పుని కియు సంభవము కానందున, దానియందు కలుగుచున్నట్లుగా తోచుచున్న వికారములు గూడ శుద్ధకల్పితములే. కావున ఆ వికారములు యథార్థమున లేనివే,కావున ఆ ఆత్మ; ఆ పరమాత్మ తాను ఎటువంటి వికారను చెందక, మరొకదాని యందు ఎటువంటి వికారమునుకలిగించుటలేదు. కారణమేమన ఆయన అద్వితీయుడు. ఆయనతప్ప మరే దియు అస్తిత్వము కలిగిలేదు. ఈ ప్రపంచమంతయు ఆయనయందు భ్రాంతిచే ఉన్న ట్లుగాతోచుచుండునది మాత్రమే. ఇదియేసత్యము. అందుచే ఆకాశమునందు నిత్యమూ అనేక శరీరములు పుట్టుచున్నను, తిరిగినశించుచున్నను, అదేవిధముగా అనేక ఆకార ప్రకారములు కలిగిన కుండలు, ముంతలు, కడవలు, మూతలు మట్టితో రూపములు దాల్చి తుదకు ఆ మట్టియందే లీనమగుచున్నను వాటియందు వ్యాపించియున్న ఆ ఆకాశమునందు ఏటువంటి వికారము ఎట్లుకలుగుటలేదో అట్లే ఈ ప్రపంచము ఎట్లు వ్యవహరించినట్లుగా తోచుచున్నను ఆ పరమాత్మయందు ఎటువంటివికారము కలు గుటలేదు. అట్టినిర్వికారుడే, అద్వితీయుడే ఆ పరమాత్మ. ఆ విధముగా ఆ పర మాత్మ ఉత్పత్తి వినాశాది శూన్యుడు, వృద్ధిక్షయములులేనివాడు. అవయవ రహి తుడు అగుటచే నిర్వికారుడు. అనగా సర్వవిధ వికార శూన్యుడు,

పరమాత్మ కార్యకారణ వ్యతిరిక్తుడు. ప్రకృతి వికృతిరహితుడు. సర్వమునకు సాక్షి. "నేను, నేను" అని ప్రత్యక్షముగ ప్రకాశించువాడు. విషయశూన్యమైన జ్ఞాన రూపుడు. ఎటువంటి ధర్మములులేని ధర్మశూన్యుడు.

"ప్రకృతివికృతిభిన్నః శుద్ధబోధస్వభావః
సదసదిద మశేషం భాసయన్నిర్విశేషః,
విలసతి పరమాత్మా జాగ్రదాదిష్వవస్థా
స్వహమహమితి సాక్షాత్సాక్షిరూపేణబుద్ధే"

అనగా ఎవ్వడు ప్రకృతివికృతులకంటె భిన్నుడై అనగా ఎవ్వడు అజ్ఞా నము మరియు దాని కార్యములగు ఆకాశాది అనగా గాలి, నీరు, మట్టి, గగనము, మొదలగు పేర్లుగల పంచభూతములకంటె వేఱుగావుండి, వాటితో ఎటువంటి సంబం

ధములేక విషయశూన్యమగు అనగా శుద్ధమైన ఏ జ్ఞానముకలదో అజ్ఞానమే స్వభావస్వరూపములుగాగలవాడై అనగా కేవలము దృక్ స్వరూపుడు అనగా సాక్షి మాత్రముగా వుండువాడై ప్రత్యక్షగోచరమగు సర్వప్రపంచంబును మరియు ఆకాశాది అమూర్త పదార్థములనుగూడ భాసింపజేయుచున్నాడో అనగా ప్రకాశింపజేయు చున్నాడో అతడే ఆ పరమాత్మ. ఆతనికి మూర్తపదార్థములైన ప్రపంచ ధర్మములు గాని అమూర్త పదార్థములైన ఆకాశాదికముయొక్క ధర్మములు గాని లేవు. ఆతడు ఎటువంటి ధర్మములు లేని ధర్మశూన్యుడు. ధర్మములు దృశ్యమానమగు మూర్త పదార్థములకేయుండునుగాని అవ్యక్త పదార్థములకు ఎటువంటి ధర్మములు వుండ జాలవుగదా! కావున పరమాత్మ ధర్మశూన్యుడు. ఆ విధముగా ధర్మశూన్యుడు అయి వుండియు ఆయన జాగ్రత్స్వప్న సుషుప్త్యాది అవస్థలయందు బుద్ధికిసాక్షిగా వుండి "నేను నేను" అని ప్రత్యక్షముగ ప్రకాశించుచున్నాడు. ఆ విధముగా ప్రకాశించువాడే పరమాత్మ.

"తత్వమసి" అనగా అట్టి ఏపరమాత్మకలదో అతడేనీవు అని తెలిసికొనుము. అట్లు తెలుసుకొనుటకు మనస్సే ముఖ్యసాధనము. అయితే ఆ మనస్సు అనగా బుద్ధి, శాస్త్రజ్ఞానము గురూపదేశము, అటుపైన శ్రవణ మనన నిధిధ్యాసములద్వారా శుద్ధమై, అనగా పంచకోశములనబడు అన్నివిధములగు అనాత్మ పదార్థములను కూలంకషంగా పరిశీలించి, అవన్నియు భ్రాంతిజన్యములు, కల్పితములు, మరియు అసత్యములని గుర్తించి, వాటినుండి వివేకముతో మనస్సును మరల్చి, దానిని ఆ పరమాత్మ భావముతో నింపినప్పుడు మాత్రమే ఆ మనస్సు పరమాత్మగా ప్రత్యక్ష మగును. "మనసైదమాప్తవ్యమ్" అనుశ్రుతి ఈ రహస్యమునే తెలుపుచున్నది. ఎప్పుడైతే మనస్సు సర్వవిధ సంశయములనుండి అనగా అసంభావన, సంశయ భావన, విపరీతభావన, అనబడు ఈ మూడు దోషములనుండి విడువడి ఆ మూడు దోషములు తొలగిపోవుటచే విశుద్ధమైన మనస్సు విషయములనుండి వెనుకకు తిరిగి తనయందు వ్యాపించియున్న జ్ఞానబలంతో విషయములు తొలగిపోయినందున విశుద్ధమైనదై ఆ జ్ఞానరూపుడగు ఆ పరమాత్మను సాక్షాత్కరించుకొనును అని శ్రుతి చెప్పుచున్నది. "స ఆత్మా; తత్వమసి" అదియే ఆత్మ. ఆ ఆత్మయేనీవు. అలా స్వస్వరూప సాక్షాత్కారమును పొందిన మహనీయుడు "పునరపిజననం, పునరపి మరణం" అని చెప్పబడుచున్న జన్మమరణ మనబడు సంసారసాగరమునుండి సునాయాసముగ దాటి మోక్షమును అనగా జన్మమరణములులేని స్థితినిపొందును.

ఆత్మఅనగా పరమాత్మ, అనగా సర్వాంతర్యామియగు ఈ బ్రహ్మపదార్థము జగత్తంతటను వ్యాపించియున్నది. "ఇందుగలడందు లేడను సందేహాము వలదు; బ్రహ్మసర్వోపగతుండు" ఆ విధముగా ఆ పరమాత్మ జగత్తునకు మూలకారణమై యున్నది. అయినను ఆబ్రహ్మము అద్వితీయముగనేయున్నది. ఏలయన జగత్తునకు వేరుగా సత్వములేదు. ఈ జగత్తంతయు అజ్ఞానముచే బ్రహ్మమునందే ఆరోపించ బడి కేవలము నామమాత్రముగ తోచుచున్నది. "వాచారంభణం వికారో నామధేయం, మృత్తికేత్యేవ సత్యం" అనగా ఈ నామములు వ్యవహారమునకు మాత్రమే వుపయోగించునుగాని వస్తువునకు భేదమును కల్పించునవికావు. వివర్తముచే జన్మించిన వస్తువు తన వుపాదానకారణమునకు ఏ విధమగుమార్పును కలిగింపలేకపోవుటచేత యధార్థస్థితిలో కారణముకంటె భిన్నమగు కార్యము జనించుననుటయే అసత్యమగు టచే కార్యపదార్థము బొత్తుగనే లేవిదగుచున్నది. అనగా ఆరోపించబడినవస్తువు అధిష్ఠానమును ఎఱుంగకుండుటచే వేఱుగ తోచుటయేగాని అందుయధార్థమేమియును లేదు. కావున ఎండమావులను ఎఱుంగని వారలకు అదినీరుగతోచినట్లు బ్రహ్మమును ఎఱుంగనివారికి ఆబ్రహ్మమే ప్రపంచముగా, సత్యముగా బ్రహ్మభిన్నముగా తోచు చున్నది. "అపశ్యతామధిష్ఠానం విశ్వంభాతి యధార్థవత్, అదృష్టమరుదేశానాం మరీచి సలిలం యధా"

ఆత్మస్థూలమై నేత్రములకు దృశ్యమానమగు పదార్థముకాదు. అణువు వంటి అతిసూక్ష్మపదార్థముకాదు, హ్రస్వమైనదికాదు. దీర్ఘమైనదికూడకాదు. "అస్థూల మనణ్వ హ్రస్వమదీర్ఘమ్" ఈ వాక్యమువలన తెలియబడునదేమన, స్థూలములగు శరీరాదులయందు తాదాత్మ్యభిమానముచే "ఈశరీరాదులేనేను" అని అజ్ఞానముచే భావించువానికి "నీవు శరీరాది రూపుడవుకాదు. బ్రహ్మరూపుడవు" అని చెప్పినట్లయి నది. ఆ బ్రహ్మము అఖండ జ్ఞానస్వరూపమైనది. ఆ కారణమువలన ఈ స్థూలశరీ రాదికము అంతయు అజ్ఞానకారణముగా భాసించుచున్నదేగాని యధార్థముకాదు. "అతః పరంబ్రహ్మసదద్వితీయం, విశుద్ధవిజ్ఞానఘనం, నిరంజనమ్, ప్రశాన్త మాద్యన్తవిహీన మక్రియం నిరన్తరానన్దరసస్వరూపమ్" అనగా ఈ స్థూలజగత్తు నకు వేఱుగ సత్వము అనగా ఉనికియనునది లేనందువలన, అది అంతయు బ్రహ్మ ముపై ఆరోపితమై నామమాత్రమేయగుటచేతను, పరమాత్మ అబాధ్యము అనగా ఎల్లప్పుడునూ వుండునది; అద్వితీయము విజాతీయరహితము, విశుద్ధ విజ్ఞాన ఘనము అనగా నిర్విషయకమై విజ్ఞానమే రూపముగాగలది. "ప్రజ్ఞానంబ్రహ్మ",

ఆ పరమాత్మనిరంజనము. అనగా అజ్ఞానము మరియు దాని కార్యములతో ఎటువంటి సంబంధములేనిది. ప్రశాంతం అనగా ఎటువంటి పరిణామము, అనగా మార్పు లేనిది. ఆద్యంతవిహీనం అనగా ఆది అంతములులేనిది. అనగా జన్మమరణములు లేనిది. అక్రియం అనగా అవయవములు లేనిదగుటచే క్రియాశూన్యమైనది. నిరంతరానంద స్వరూపం అనగా అవిచ్ఛిన్నమైన ఆనందరసమే రూపముగాగలది.

"నిరస్తమాయా కృత సర్వభేదం, నిత్యం ధ్రువం నిష్కలమప్రమేయం
అరూప మవ్యక్త మనాఖ్య మవ్యయం జ్యోతిః స్వయం కించిదిదం చకాస్తి"

అనగా పరమాత్మ మాయచే కల్పించబడిన సమస్తభేదములకు అతీతమైనది. అనగా సజాతీయ భేదముగాని, స్వగత భేదముగాని లేనిది. ఆది అంతములు అనగా ఒకప్పుడు వుండుట, మరియొకప్పుడు లేకుండుట అనగా జన్మ మరణములు లేనిది. సదావుండునదగుటచే నిత్యమైనది. అవయవ రహితమై ఎటువంటి క్రియలు చేయనది అగుటచే కూటస్థమైనది అనగా స్వర్ణకారుని కూటమువలె, దాగలివలె సువర్ణమునకు మార్పులు కలిగించునదైనను తాను మాత్రము ఎటువంటి మార్పులు లేక కూటమువలె స్థిరముగ వుండునది. నేత్రములచేగాని, మనస్సుచేగాని చూడబడనిది. అనగా మనోవృత్తికి గోచరముకానిది. "అశ్శబ్దమస్పర్శ, మరూప మవ్యయం" ఇత్యాదిశ్రుతులననుసరించి నేత్రములకు గోచరముకానిది. నేత్రములకు గోచరముకానిదనగా ఎటువంటి చక్షుగ్రాహ్యమగు రూపము కలదికాదని తాత్పర్యము. అందువలన అవ్యక్తం అనగా వ్యక్తము కానిది, అనగా వాక్కుచేకూడ తెలుపబడనిది. అనాఖ్యం అనగా నామరహితమైనది, అనగా ఏవిధమైన పేరుపెట్టి పిలుచుటకుసాధ్యముకానిది. ఒక పదము ఒక అర్థమును బోధింపవలెనన్నచో అట్లు బోధింపబడుదానికి జాతిగాని, గుణముగాని, క్రియగాని, సంకేతసాధ్యమగు సంబంధముకాని ఉండి ఉండవలయును. కాని అట్టివి ఏవయు లేకపోవుటచే నామరహితమైనది. పేరు పెట్టిపిలుచుటకు సాధ్యపడనిది. అవ్యయం అనగా క్షయములేనిది అనగా ఎటువంటి మార్పులు చేర్పులు లేక ఎన్నడును నశించనిది అనగా ఎల్లప్పుడునూ ఒకే విధముగా వుండునది. స్వయం జ్యోతిః అనగా స్వయముగానే ప్రకాశించునది. అట్లగుటచే ఇతర పదార్థములచే ప్రకాశింపబడనిది. అనగా సర్వమును ప్రకాశింపజేయునదియేగాని తాను ఇతరములచే ప్రకాశింపబడనిది. అట్లేలయన—అది స్వయం ప్రకాశము. తనంతట తానుగా ప్రకాశించునది.

ఆ పరమాత్మ "జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయ శూన్యమనన్తం నిర్వికల్పం, కేవలాఖండ చిన్మాత్రం పరం తత్త్వం విదుర్బుధాః" అనగా ఆ పరమాత్మ జ్ఞాతృ, జ్ఞాన

జ్ఞేయశూన్యమైనది. అనగా జ్ఞాతః తెలుసుకొనువాడు; జ్ఞానము తెలుసుకొను క్రియ; జ్ఞేయము, తెలియబడునది అను మూడు విధములైన త్రిపుటి, అనగా అటువంటి విభాగములులేనిది. కావుననే అనన్తం అనగా దేశకాల వస్తు పరిచ్ఛేదములేనిది. అందుచేతనే నిర్వికల్పకం అనగా వికల్పశూన్యమైనది. అనగా ఏ విధముగాను పరిచ్ఛిన్నత్వములేనిది. భేదము లేనిది. కేవలాఖండచిన్మాత్రం అనగా ఎటువంటి సంబంధము కలిగిలేనిది. అనగా అపరిచ్ఛిన్నమై జ్ఞానమే రూపముగా గలది. అనగా జ్ఞానరూపమైనది. అందుచే అది పరతత్వం అనగా విజ్ఞులచే తెలుసుకొనబడునదియేగాని, నేత్రములచే చూడబడనిది. లేక వాక్కులచే వర్ణించబడునదికాదు అంతేగాక "అహేయ మను పాదేయం మనోవాచామగోచరమ్, అప్రమేయ మనాద్యన్తం బ్రహ్మ పూర్ణమహోమన్మహః" అనగా ఈబ్రహ్మపదార్థము అనగా సర్వాంతర్యామియగు పరమాత్మ, అందరికి స్వస్వరూపము అనగా స్వాత్మయగుటచే విడచుటకు శక్యముకానిది అనగా ఆ బ్రహ్మరూపమునగాక మరియొకటిగా వుండుటకు ఎవ్వరికిని శక్యముగానిది. అట్లని "ఇది" అని గ్రహించుటకుగూడ శక్యముకానిది."మనోవాచామ గోచరం" యతోవాచః "ఇత్యాది శ్రుతులను అనుసరించి ఆబ్రహ్మ పదార్థము మనస్సుచేగాని, వాక్కులచేగాని, తెలియబడనిది. అప్రమేయం అనగా తెలుసుకొనుటకు అలవిగానిది. అట్లయ్యును విద్వాంసులచే, శ్రవణ మనననిది ధ్యాసనములచే! సంస్కరింపబడిన అనగా ప్రాపంచిక మలినములు లేకుండగ నిర్మలముగావించబడిన బుద్ధిగలవారిచే, అనుభవింపదగియున్నది. అనగా వారి మనోవృత్తికి గోచరమగునది. అనాద్యన్తం అనగా కాలముచేగాని దేశముచేగాని కొలవబడి "ఇది" ఇంతవరకు వున్నది. అని చెప్పుటకు వీలుకానిది. ఈవిధముగా ఆ పరమాత్మ, ఆబ్రహ్మతత్వము, పరిపూర్ణమై సర్వమునకంటె మించినదై, సూర్యచంద్రాదులను గూడ భాసింపజేయునదైన జ్యోతిస్వరూపము; జ్ఞానరూపము అయివెలుంగు చున్నది.

ఆ బ్రహ్మము, ఆ పరమాత్మ, "పరిపూర్ణ మనాద్యన్తమప్రమేయమవిక్రియం, ఏకమే వాద్వయం బ్రహ్మ నేహనానాస్తి కించన" అనగా ఆ పరమాత్మ పరిపూర్ణమైనది. అనగా ఇచ్చట అచ్చట అను భేదములేక అంతటను నిండియున్నది. అనగా దేశపరిచ్ఛేదము లేనిది. అనాద్యమనంతం-అనగా వుత్పత్తి వినాశములు లేనిది. అది జన్మించునదికాదు. అందుచే మరణించునదికాదు. అనగా జన్మమరణములులేనిది. అప్రమేయ మవిక్రియం. అనగా మనోబుధ్యాదులచే గ్రహింపశక్యముకానిది. ఎటువంటి మార్పులు లేనిది. ఎటువంటి పరిణామములేనిది. అనగా సర్వకాల సర్వావస్థల

యందును ఒక్కరీతిగా ప్రకాశించునది. ఏకం అనగా ఏ విధముగాను, ఏ శక్తిచేతను విభజింప శక్యముకానిది. అంతేకాదు తనంతటతానుగాకూడ స్వగతభేదము లేనిది. అట్లే సజాతీయ విజాతీయభేదములులేనిది. ఈ విధముగా ఆ పరమాత్మ ఏ విధమైన నానాత్వములేనివాడు. ఆతడు సకల విధభేదరహితుడని శ్రుతిచెప్పుచున్నది. "మనసైవాను ద్రష్టవ్యం నేహనానాస్తికించన, మృత్యోః సమృత్యుమాప్నోతి యఇహ నానేవపశ్యతి" అనగా బ్రహ్మమును తెలుసుకొనుటకు మనస్సు ఒక్కటియే సాధనము. ఈ బ్రహ్మపదార్థమునందు ఎట్టి భేదమునులేదు. ఈ బ్రహ్మపదార్థము నందు భేదమును చూచెడివాడు మృత్యువునుండి మరియొక మృత్యువును పొందు చున్నాడు. మరియు సంసారబంధముచే బంధింపబడుచున్నాడు అని బృహదారణ్యకోపనిషత్తు చెప్పుచున్నది. అట్లేలయన ఎవ్వడు బ్రహ్మమునందు భేదమును చూచునో వానికి ఈ మాయాకల్పిత ప్రపంచము ప్రత్యక్షమగును. అప్పుడు ఆతడు ఈ ప్రపంచమునే సత్యము, నిత్యము అని నమ్మి, అందునిమగ్నమై జన్మమరణ బంధములయందు ఆధ్యాసచే తగుల్కొని దుఃఖమునుపొందును అని తాత్పర్యము.

వాస్తవమున విచారించిచూచిన ఆ పరమాత్మ అద్వితీయుడు. ఆనందఘన మూర్తి. ఎటువంటి విభేదములు లేనివాడు. "సద్ఘనంచిద్ఘనం నిత్యమానన్దఘనమవిక్రియమ్, ఏకమేవాద్వయం బ్రహ్మనేహనానాస్తికించన" అనగా ఆ పరమాత్మ, ఆ బ్రహ్మము సత్తుయే శరీరముగా గలవాడు. అందుచే నిత్యమైనవాడు. అట్లేలయన? సత్తునకు పరిణామ వినాశములు సంభవముకాదుగదా! ఆనందమే శరీరముగా గల వాడు. అనగా సచ్చిదానందస్వరూపమని తాత్పర్యము. సత్తుయే శరీరముగా, స్వరూపముగా గలవాడు గనుక సర్వవ్యాపకుడు. సర్వమునందు వ్యాపించియున్నవాడు గావున అంతటను అనగా సర్వభూతములందును వ్యాపించియున్నవాడు ఆ పరమాత్మయే. "ప్రత్యగేకరసం పూర్ణ మనన్తం సర్వతోముఖం, ఏకమేవాద్వయం బ్రహ్మ నేహానానాస్తికించన"అనగా ఈ పరమాత్మ పరమాత్మగావున సర్వాత్మభూతమైనవాడు. అనగా సర్వభూతములయందు తానై నిండియున్నవాడు. పూర్ణం అనగా సర్వమునందును వ్యాపించి సర్వమూ తానే అయివున్నవాడు. అనన్తం= అనగా అనంతుడు అనగా అంతము - జన్మనాశములులేనివాడు. సర్వతోముఖః= అనగా సర్వాత్మ భూతుడగుటంజేసి అంతటను ముఖములుగలవాడు. "త్వం జాతో భవసి విశ్వతో ముఖః" అనగా నీవు జన్మించినవాడవై అనగా సకల భూతముల రూప

